తెలుగు

# అథర్వవేదసంహిత

## మంత్ర పద పాఠ సహితం

అనువాదం

కళాప్రపూర్ణ విద్వాన్ విశ్వం, డి లిట్.

ఐదవ సంపుటం

(పదకొండు, పన్నెండుకాండలు)




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి.

TELUGU
ATHARVA VEDA SAMHITA

By

Kalāprapūrna VIDWĀN VISWAM, D. LITT.

T. T. D. Religious Series No 338

Copies - 2,000.



Price :

Cover : Sri BAPU

Published by:
Sri CH. VENKATAPATHI RAJU, I. A. S.,
Executive Officer,
T. T. Devasthanams,
Tirupati.

Printed at:
Tirumala Tirupati Devasthanams Press
Tirupati-517 507

# ముందుమాట

సి.హెచ్. వేంకటపతిరాజు, ఐ ఏ ఎస్,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు

మన ధర్మం మహనీయమైన హిందూధర్మం చరిత్రకందనికాలం నుంచి మనజీవన విధానం, సంస్కృతి, నాగరికత - అన్నీ వేదాలనుంచే ఏర్పడినాయి ధర్మాన్ని గౌరవించే జాతి మనది ధర్మంకోసం జీవితాన్ని త్యాగం చేసిన నీతి మనది మనకు, మనజీవనవిధానానికి అడుగడుగునా ఇంతటి స్ఫూర్తినందిస్తున్న వేదవాఙ్మయం ప్రాచీన సంస్కృతభాషలో ఉన్నది దానిని తెలుగువారికి అందించే తిరుమల తిరుపతి దేవస్థానాల ప్రయత్నంలో ఒక భాగమే అథర్వవేదానికి తెలుగు అనువాదం

ఇప్పటికి నాలుగు సంపుటాలను వరుసగా మీకందించాం ఇది అయిదవ సంపుటం ఇందులో అథర్వవేదంలో పదకొండు, పన్నెండు కాండలున్నాయి దీనిని కీ శే విద్వాన్ విశ్వంగారు అనువాదం చేశారు ఇంతటితో వారు అనువదించిన సంపుటాలు పూర్తయినాయి. ఆరవసంపుటంనుంచి డా॥ ఎస్ బి రఘునాథాచార్యులవారు అనువాదం చేస్తున్నారు అవి కూడా త్వరలో మీకందుబాటులోకి వస్తాయి

ఈ సంపుటానికి చక్కని "ప్రస్తావన" వ్రాసిన డాక్టర్ ఎస్ బి రఘునాథాచార్యులవారికి ( కో-ఆర్డినేటర్ పబ్లికేషన్స్, టి టి డి ) మా ధన్యవాదాల నందిస్తున్నాము వెనుకటి సంపుటాల్లాగానే దీన్ని కూడా తెలుగువారు ఆదరించగలరని నమ్ముతున్నాము

తిరుపతి
28-9-89

సి.హెచ్. వేంకటపతిరాజు, ఐ. ఏ ఎస్

# ప్రస్తావన

డాక్టర్ ఎస్ బి రఘునాథాచార్య,
సంస్కృత విభాగం,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

అథర్వవేదానికి "బ్రహ్మవేద" మని ప్రసిద్ధి యజ్ఞనిర్వాహకులైన నల్గురు ఋత్విక్కులలో బ్రహ్మప్రధానమైనవాడు [1] ఇతరులు చేసిన పొరపాట్లవల్ల యజ్ఞవైకల్యం కలగకుండా వాటిని పరిహరిస్తూ యజ్ఞాన్ని పూర్తి చేయాల్సిన బాధ్యత బ్రహ్మపైననే ఉంటుంది [2] అతడు మిగతా వేదాలతోపాటు అథర్వవేదంలో కూడా నిష్ణాతుడై ఉండాలి కనుకనే ఈ వేదానికి బ్రహ్మవేదమని ప్రసిద్ధి ఏర్పడింది.

అథర్వవేదం ఆధ్యాత్మిక - అధిభౌతిక - అధిదైవిక విషయాలను విశదపరుస్తున్నది అయితే అధిభౌతిక విషయాలపై కొంచెం ఎక్కువ మొగ్గు కనపడుతుంటుంది మానవ శరీరాలకు సంబంధించిన చికిత్సాదులపై అథర్వవేదంలో 144 సూక్తాలలో వివరణలు కనబడుతున్నాయి రెండువందల పైచిలుకు సూక్తాలలో రాజధర్మానికి సంబంధించిన అంశాలు విశదీకరించబడినాయి. సమాజస్వరూపం సుమారు 75 సూక్తాల్లో వర్ణింపబడింది ఇలా మానవశరీరం, రాజధర్మం, సమాజంమొ॥ అంశాలపైన అనేకదృక్కోణాల నుంచి చేయబడిన సమగ్రసమీక్ష మనకు ఈ వేదంలో కనబడటం విశేషం అంతే కాకుండా ఈ వేదంలో ఈశ్వరాస్తిత్వవాదం స్పష్టంగా గోచరిస్తున్నది

---

1. బ్రహ్మా సర్వవిద్యః సర్వం వేదితుమర్హతి     వి 1 8 3

2 త్రయాణామపరాధస్తు బ్రహ్మా పరిహరేత్సదా     వే భా భూ 88

భారతీయ సంస్కృతిని తీర్చిదిద్దిన వేదవాఙ్మయంలో ఒక భాగమైన అథర్వవేదాన్ని నలుగురికి అందుబాటులోకి తీసుకొనివస్తే పై అంశాలను యథాతథంగా గ్రహించే అవకాశముంటుందని, వాటి విలువలను తమతమ జీవితాలలో నిరూపుకోవటానికి కొందరైనా ప్రయత్నిస్తారనే ఆశయంతోనే తిరుమల తిరుపతి దేవస్థానం అథర్వ వేదానికి తెలుగు అనువాదం అనే భవ్యమైన ప్రణాళికను రూపొందించింది

ఈ ప్రణాళికలో కీ శే విద్వాన్ విశ్వంగారు తెలుగులో అనువదించిన నాలుగు భాగాలు ఇప్పటికి ప్రచురింపబడినాయి ఇది అయిదో భాగం ఇందులో అథర్వసంహితలోని పదకొండు, పన్నెండు కాండలున్నాయి ఈ కాండల్లో ఎన్నో విశేషాలు చోటు చేసుకున్నాయి వాటిలో కొన్నింటిని మాత్రం సంగ్రహంగా ఇక్కడ మనం తెలుసుకుందాం

# పదకొండవ కాండ

పదకొండవ కాండలో 313 మంత్రాలున్నాయి ఇవి పది సూక్తాలుగా, అయిదు అనువాకాలుగా విభజింపబడినాయి

**దేవతలు :**

ఈ కాండలోని మంత్రాలలో ప్రసిద్ధులైన దేవతలెందరో ప్రస్తావించబడినారు వారిలో ముఖ్యులు : భవుడు, ప్రాణము, బ్రహ్మచారి, చంద్రుడు, అర్బుది, నిషంధి మొదలైనవారు.

**ఎందుకు బ్రహ్మచర్యం ?**

బ్రహ్మచర్యాన్ని పాటించినవాళ్ళు ఈ లోకంలో సాధించనిది లేదు బ్రహ్మచర్యప్రభావం ఇంతా అంతా అని చెప్పటానికి వీల్లేదు

# పన్నెండవ కాండ

పన్నెండవ కాండలో 304 మంత్రాలున్నాయి ఇవి అయిదు సూక్తాలుగా, అయిదు అనువాకాలుగా విభజింపబడి ఉన్నాయి

## దేవతలు

ఈ కాండలో కొద్దిమంది దేవతలు ప్రసక్తమవుతున్నారు వారిల్లో ముఖ్యులు, ఆదిత్యుడు, మరుత్తులు, అగ్ని

## పృథివీసూక్తం

అథర్వవేదం మొత్తంలో తలమానికమైంది పృథివీసూక్తం ఈ సూక్తంలో పృథివీస్వరూపం, అందలి విశేషాలు ఎన్నో కోణాల నుంచి సమీక్షించబడినాయి ఇది పన్నెండవకాండలో మొదటి సూక్తంగా ఉన్నది ఇందులోని భావనలు ఎంతో ఉదాత్తమైనవి ఆనాటి మానవుని భావనలో నేలతల్లి ఎలా ఉండేదనే అంశం ఈ సూక్తంలోని ప్రత్యక్షరం ప్రత్యక్షీకరిస్తున్నది చూడండి

మంత్రము

యస్యామన్నం వ్రీహియవౌ
యస్యా ఇమాః పఞ్చ కృష్టయః ।
భూమ్యై పర్జన్యపత్న్యై
నమోఽస్తు వర్షమేదసే ॥ 12-1-42

అనువాదం।

ఏ భూమిపై వ్రీహియవలు పండునో,
ఆహారార్థమై అవి ఉపయుక్తమగునో,
దేనిపై పంచప్రకారములైన కృత్యములు నడుచునో

ఎక్కడ సంవత్సరాంతం అన్నాదులు ఉత్పన్నములగనో,
ఇంద్రుడు దేని పాలకుడో,
ఆ పర్జన్యపత్నికి నా నమస్కారం

మంత్రము:

**యస్యాః పురో దేవకృతాః**
**క్షేత్రే యస్యా వికుర్వతే ।**
**ప్రజాపతిః పృథివీం విశ్వగర్భా**
**మాశామాశాం రణ్యాం నః కృణోతు ॥** 12-1-43

అనువాదం:

ఈ భూమిపైనే నగరములు దేవకృతములై ఉన్నవి
దీని ప్రత్యేక ప్రాంతములలో పురుషులు
తమ తమ పనులను నిర్వర్తిస్తున్నారు
ప్రజాపతి విశ్వగర్భయైన ఈ పృథివిని
దిక్కుదిక్కులా రమణీయంగా రూపొందిస్తున్నాడు

మంత్రము

**నిధిం బిభ్రతీ బహుధా గుహా వసు**
**మణిం హిరణ్యం పృథివీ దదాతు మే ।**
**వసూని నో వసుదా రాసమానా**
**దేవీ దధాతు సుమనస్యమానా ॥** 12-1-44

అనువాదం:

బహువిధ గృహాలలో ధనము, రత్నాదులు, బంగారము
మొదలైన నిధులను ధరిస్తున్న మా ఈ భూమి
మాకు వాటినన్నిటినీ ప్రసాదించుగాక!
ధనదాత్రి అయిన ఈ దేవి మా పనులన్నిటినీ
సౌమనస్యంతో ధనమిచ్చి పూర్తిచేయుగాక!
తగినంత ధనాన్ని మాకు ప్రసాదించుగాక!

# విషయసూచిక

# అనువాకం - 1

## సూక్తం-1

ఋషి: బ్రహ్మ॥ దేవత బ్రహ్మౌదనము॥ ఛందస్సు: 1 అనుష్టుబ్గర్భా భురిక్ పంక్తి, 2,5 బృహతీగర్భా విరాట్ త్రిష్టుప్ 3 చతుష్పదా శాక్వర గర్భా జగతి 4,15,16,31 భురిక్ త్రిష్టుప్; 6 ఉష్ణిక్: 7,12-14,19, 22 23, 28, 30, 32-34 త్రిష్టుప్ 8 (త్రిపదా) విరాడ్ గాయత్రీ; 9 శాక్వరాతి జాగతగర్భా జగతీ 10 పురోతి జగతీ విరాడ్ జగతీ: 11 జగతీ: 17,21,24-26,37 విరాడ్ జగతీ: 18 అతి జాగతగర్భా పరాతి జాగతీ విరాడతి జగతీ: 20 అతిజాగతగర్భా పరాశాక్వరా చతుష్పదా భురిగ్ జగతీ; 27 అతిజాగతగర్భా భురిగ్ జగతీ: 29 భురిగ్ జగతీ: 35 చతుష్పదా కకుమ్మత్యుష్ణిక్ 36 పురో విరాట్ త్రిష్టుప్॥ మంత్రములు ॥ 37 ॥

వినియోగం :- ఇది అర్థసూక్తం. 'అగ్నే జాయస్వ అనే మంత్రంతో మొదలయ్యే అర్థసూక్తానికి బ్రహ్మౌదన సవంలో నిరుక్త హవిరభిమర్శన, సంపాత దాతృవచన దానాదులలో వినియోగం

ఇందులో 'అగ్నే జాయస్వ' అనే మొదటి దానితో బ్రహ్మౌదనాది సవయజ్ఞాదులలో అగ్నిని మథించి అనుమంత్రణం చెయ్యాలి

'కృణుత ధూమం' అనే రెండవ దానితో మథిస్తుండగా మొదట వచ్చే ధూమాన్ని అమంత్రణం చెయ్యాలి నాల్గవ పాదంతో పత్నీఫలాపేక్షతో అగ్నిని అనుమంత్రణం చేయాలి

'అగ్నే అధివిష్టా అనే మూడవ దానిలోని మూడు పాదాలతో మథించగా జనించిన అగ్నిని అనుమంత్రణం చెయ్యాలి

'సమిద్ధ, అనే నాల్గవ దానితో, సమిధలతో అగ్నిని ప్రజ్వలింప జేసి అనుమంత్రణం చెయ్యాలి

'ఉత్తమం నాకం' అనే నాల్గవ పాదాన్ని దాతతో పఠింప జేయాలి

'ఊర్జో భాగః' అనే ఋక్కు ప్రథమ భాగంతో జలకుంభాన్ని భూమిపై ఉంచాలి మిగత పాదత్రయంతో ఉదకపాత్రను పరచిన చర్మంపై ఉంచాలి

పైతృమేధంలో చయనం అను దానిలో 'ఊర్జో భాగః' అనే ఋక్కుతో అస్థికలను రాళ్ళతోగాని, ఇటుకలతోగాని కప్పపెట్టాలి

'అగ్నే చరుః అనే ఋక్కుతో చరుస్థలిని అగ్నిపై నుంచాలి

ఇలాగే దర్శపూర్ణమాసలలోని చర్వధిశ్రయణంలో కూడా దీనిని వినియోగించాలి

బ్రహ్మౌదన సవనంలో శుద్ధాః పూతాః 'బ్రహ్మణా శుద్ధా, అనే రెండు ఋక్కులను వినియోగించాలి

'ఉరుః ప్రథస్వ' అనే ఋక్కుతో చరుపాత్రను అగ్నిపై నుంచాలి అదే కర్మలో 'ఉరుః ప్రథస్వ' అనే ఋక్కునకు దార్శివచనంలో వినియోగం

'ఉదేహి వేదిం అనే సూక్తానికి బ్రహ్మౌదన సవంలో, 'అగ్నే జాయస్వ' అనే సూక్తంతో పాటు వినియోగం చెప్ప బడినది

మొదటి మంత్రంతో చరువును ఉద్వాసనం చేయాలి 'అభ్యా వర్తస్వ' అనే దానితో చరుస్థలికి ప్రదక్షిణం చెయ్యాలి

'అదితేర్హస్తం అనే ఋక్కుతో స్రుక్కును వేదిపై నుంచాలి, శృతం త్వా హవ్యం అనే మంత్రంతో నల్వురు ఆర్షేయులను అసనాలపై ఉపవేశింపజేయాలి

సోమరాజన్' అనే ఋక్కుతో ఆ నల్వురు ఋత్విక్కులను యజమానుడు అహ్వానించాలి

'శుద్ధాః పూతాః' అనే ఋక్కుతో ఆ ఋత్విక్కులకు హస్త ప్రక్షాళనార్థం ఉదకం ఇవ్వాలి 'ఇదం మే జ్యోతిః' అనే ఋక్కుతో ఓదనంలో హిరణ్యాన్ని ఉంచాలి

'పక్వం క్షేత్రాత్' అనే మధ్యమపాద ద్వయంతో దర్వంపై ఉంచిన ఓదనాన్ని కొంచెం కదలించాలి

'ఇదం మే జ్యోతిః' అనే ఋక్కు దాతృవచనంలో విని యుక్తమైనది

'అగ్నౌ తుషానా' అనే ఋక్కు ప్రథమపాదంతో అగ్నిలో పొట్టును ప్రేల్చాలి మిగతా పాదత్రయంతో ఫలీకరణములను ఉదూహనం చేయాలి

'శ్యామతః' మొదలైన ఋక్కులకు ఓదన సంపాతంలో వికల్పంగా వినియోగం

బభ్రేరధ్వర్యో' అనే సూక్తానికి బ్రహ్మౌదన సవంలో అగ్నే జాయస్వ' అనే దానితో పాటు వినియోగం చెప్పబడినది

'ఘృతేన గాత్రా' అనే పాదంతో ఘృతంతో ఓదనాన్ని తడపాలి 'కృణ్వే పన్థామ్ అనే చరమపాదాన్ని దాతచే పఠింప జేయాలి

'బభ్రే రక్షః' ఇత్యాది ఋక్కులతో ఓదనాన్ని అనుమంత్రణం చేయాలి సమాచినుష్వ' అనే మంత్రంతో అత్యాన్ని హోమం చేయాలి

మంత్రము 1

అగ్నే జాయస్వాదితి ర్నాథితేయం

బ్రహ్మౌదనం పచతి పుత్రకామా ।

సప్తఋషయో భూతకృత స్తే

త్వా మన్థన్తు ప్రజయా సహేహ

పదము ।

అగ్నే । జాయస్వ । అదితిః । నాథితా । ఇయమ్ ।

బ్రహ్మ౨ఓదనమ్ । పచతి । పుత్ర౨కామా ।

సప్త౨ఋషయః । భూత౨కృతః । తే ।

త్వా । మన్థన్తు । ప్ర౨జయా । సహ । ఇహ ॥ 1 ॥

అనువాదం

మథనంతో ఓ అగ్నీ ! అవిర్భవించు
ఇష్ట ఫలాన్ని ఆశిస్తూ ఈ అదితి
ఉత్తర కామనతో * బ్రహ్మౌదనాన్ని
పచనం చేస్తున్నది.
సప్తర్షులు పృథివ్యాది స్రష్ట లైనవారు
ఓ అగ్నీ ! నిన్ను ఈ దేవయజన కర్మలో
పుత్ర పౌత్రాది రూప మైన ప్రజతో కూడి
మథనం చేయుదురు గాక ! ॥ 1 ॥

మంత్రము ।

కృణుత ధూమం వృషణః సఖాయో-

ద్రోఘా వితా వాచ మచ్ఛ ।

అయ మగ్నిః పృతనాషాట్ సువీరో

యేన దేవా అసహన్త దస్యూన్ ॥ 2 ॥

*బ్రహ్మ కోసమై స్వాహాకారంతో అర్పించే అన్న మనీ, బ్రాహ్మల కోసం భోజనార్థం కల్పించే అన్న మనీ అర్థం

పదము।

కృణుత । ధూమమ్ । వృషణః । సఖాయః ।

అద్రోఘఽఅవితా । వాచమ్ । అచ్ఛ ।

అయమ్ । అగ్నిః । పృతనాషాట్ । సుఽవీరః ।

యేన । దేవాః । అసహన్త । దస్యూన్ ॥ 2 ॥

అనువాదం।

కోరికలు తీర్చువారు,
సర్వ జగన్మిత్రభూతులు అయిన,
ఋత్విక్కులైన మీరు - ధూమం వచ్చునట్లు చేయండి
సుచరిత్రులైన యజమానులకు రక్షక మైన
శ్రుతివాక్యాన్ని అభిలక్షించి
ఈ అగ్ని శాత్రవసేనలను అభిభవిస్తాడు.
సువీరులతో కూడిన ఈ అగ్నితో
ఇంద్రాదులు దస్యులను అభిభవించినారు ॥ 2 ॥

మంత్రము :

అగ్నేఽజనిష్ఠా మహతే వీర్యాఽయ

బ్రహ్మౌదనాయ పక్తవే జాతవేదః ।

సప్తఽఋషయో భూతకృత స్తే త్వాఽ-

జీజన న్నస్యై రయిం సర్వవీరం ని యచ్ఛ ॥ 3 ॥

పదము।

అగ్నే। అజనిష్ఠాః। మహతే। వీర్యా౨య।

బ్రహ్మ౨ఓదనాయ। పక్తవే। జాత౨వేదః।

సప్త౨ఋషయః। భూత౨కృతః। తే। త్వా।

అజీజనన్। అస్యై। రయిమ్। సర్వ౨వీరమ్। ని। యచ్ఛ ॥3॥

అనువాదం।

ఓ అగ్నీ! నీవు ఉత్పన్నుడ వైనావు
ప్రభూత వీర్యార్థమై ఓ జాతవేదా!
బ్రహ్మౌదనాన్ని పచనం చేయుటకు
పృథివ్యాది స్రష్ట లైన సప్తర్షులు నిన్ను ఉత్పన్నం చేసినారు
ఈ పత్ని కోసమై పుత్రపౌత్రాది రూప మైన
ధనాన్ని ప్రసాదించు ॥ 3 ॥

మంత్రము।

సమిద్ధో అగ్నే సమిధా సమిధ్యస్వ

విద్వాన్ దేవాన్ యజ్ఞియాం ఏహ వక్షః।

తేభ్యో హవిః శ్రపయం జాతవేద

ఉత్తమం నాక మధి రోహ యేమమ్ ॥ 4 ॥

పదము

సమ్౨ఇద్ధః। అగ్నే। సమ్౨ఇధా। సమ్। ఇధ్యస్వ।

విద్వాన్। దేవాన్। యజ్ఞియాన్। ఆ। ఇహ। వక్షః।

తేభ్యః । హవిః । శ్రపయన్ । జాతఽవేదః ।

ఉత్ఽతమమ్ । నాకమ్ । అధి । రోహయ । ఇమమ్ ॥ 4 ॥

అనువాదం :

సందీప్తుడ వైన ఓ అగ్ని ! నీవు
సమిధలతో జాజ్జ్వల్యమానుడ వైనావు
విద్వాంసుడ వైన నీవు
యజ్ఞార్హు లైన దేవతలను ఆవహించు
ఓ జాతవేదా! ఆ దేవతల నుంచి
బ్రహ్మౌదన లక్షణ మైన హవిస్సును
పచనం చేసి ఈ యజమానుని
ఉత్తమ మైన స్వర్గలోకాన్ని అధిరోహించునట్లు చెయ్యి ॥4॥

మంత్రము :

త్రేధా భాగో నిహితో యః పురా
వో దేవానాం పితౄణాం మర్త్యానామ్ ।
అంశాన్ జానీధ్వం వి భజామి తాన్ వో
యో దేవానాం స ఇమాం పారయాతి ॥ 5 ॥

పదము :

త్రేధా । భాగః । నిఽహితః । యః । పురా ।
వః । దేవానామ్ । పితౄణామ్ । మర్త్యానామ్ ।
అంశాన్ । జానీధ్వమ్ । వి । భజామి । తాన్ । వః ।
యః । దేవానామ్ । సః । ఇమామ్ । పారయాతి ॥ 5 ॥

అనువాదం।

మీ దేవతలకు, పితరులకు మర్త్యులకు
మూడు భాగాలుగా చేయబడిన తండులములతో
పురానిహిత మైనది
ఓ దేవతలారా। మీ మీ భాగములను తెలుసు కొనండి.
మీకై ఆ భాగములను నేను వేరు వేరు చేస్తున్నాను
అందులో దేవతల భాగం
అగ్నిలో ప్రేల్చబడినదై ఈ పత్నికి
ఇష్టఫల ప్రాప్తి కల్పిస్తుంది ॥ 5 ॥

మంత్రము

అగ్నే సహస్వా నభిభూ రభీదసి
నీచో న్యుఽబ్జ ద్విషతః సపత్నాన్।
ఇయం మాత్రా మీయమానా మితా చ
సజాతాం స్తే బలిహృతః కృణోతు ॥ 6 ॥

పదము

అగ్నే। సహస్వాన్। అభిఽభూః। అభి। ఇత్। అసి।
నీచః। ని। ఉబ్జ। ద్విషతః। సఽపత్నాన్।
ఇయమ్। మాత్రా। మీయమానా। మితా। చ।
సఽజాతాన్। తే। బలిఽహృతః। కృణోతు ॥ 6 ॥

అనువాదం :

ఓ అగ్నీ! పరాభిభవనక్షమ మైన బలం కలవాడవు
అందువలననే శత్రువులను అభిభవించ గలవాడవు
ద్వేషులను, మా శత్రువులను - మాకు
అప్రియకారు లైన శత్రువులను
అధోముఖులనుగా పడవేయి
నిర్మాతతో క్రియమాణ మైన ఈ శాల
ఓ యజమానుడా! నీకు సమానజను లైన పురుషులను
బలి నిచ్చు వారినిగా కల్పించు గాక! ॥ 6 ॥

మంత్రము :

సాకం సజాతైః పయసా సహై-
ధ్యుదుబ్జైనాం మహతే వీర్యా౨య ।
ఊర్ధ్వో నాకస్యాధి రోహ విష్టపం
స్వర్గో లోక ఇతి యం వదన్తి ॥ 7 ॥

పదము

సాకమ్ । స౨జాతైః । పయసా । సహ । ఏధి ।
ఉత్ । ఉబ్జ । ఏనామ్ । మహతే । వీర్యా౨య ।
ఊర్ధ్వః । నాకస్య । అధి । రోహ । విష్టపమ్ ।
స్వః౨గః । లోకః । ఇతి । యమ్ । వదన్తి ॥ 7 ॥

అనువాదం :

ఓ యజమానా! సజాతులతో పాటు
క్షీరం వంటి కర్మఫలంతో పాటు ఎదిగిరా
ఈ యజమాన పత్నిని అధిక వీర్యశుద్ధికై
ఉన్నత శిరస్కను చేయి
ఓ యజమానుడా! నీవు దేహావసాన
సమయంలో ఊర్ధ్వాభిముఖుడవై
స్వర్గాన్ని అధిరోహించు
ఆ స్వర్గం సుకృత ఫలోపభోగ ప్రదేశ మని
అభిజ్ఞులు పాకొంటారు ॥ 7 ॥

మంత్రము :

ఇయం మహీ ప్రతి గృహ్ణాతు చర్మ

పృథివీ దేవీ సుమనస్యమానా ।

అథ గచ్ఛేమ సుకృతస్య లోకమ్ ॥ 8 ॥

పదము

ఇయమ్ । మహీ । ప్రతి । గృహ్ణాతు । చర్మ ।

పృథివీ । దేవీ । సుఽమనస్యమానా ।

అథ । గచ్ఛేమ । సుఽకృతస్య । లోకమ్ ॥ 8 ॥

అనువాదం :

మా ముందున్న ఈ యజమాన భూమి
వృషభ చర్మంతో ఆస్తీర్యమాణ మగు గాక!
దానితో పాటు పృథివీదేవి అనుగ్రహ బుద్ధి కలది అగు గాక!
తదనంతరం సుకృత లోకమును పొందుదుము గాక! ॥8॥

మంత్రము :

ఏతా గ్రావాణౌ సయుజా యుఙ్ధి చర్మణి
నిర్భిన్ధ్యంశూన్ యజమానాయ సాధు ।
అవఘ్నతీ ని జహి య ఇమాం పృతన్యవ
ఊర్ధ్వం ప్రజా ముద్భర న్త్యుదూహ ॥ 9 ॥

పదము :

ఏతా । గ్రావాణౌ । సఽయుజా । యుఙ్ధి । చర్మణి ।
నిః । భిన్ధి । అంశూన్ । యజమానాయ । సాధు ।
అవఽఘ్నతీ । ని । జహి । యే । ఇమామ్ । పృతన్యవః ।
ఊర్ధ్వమ్ । ప్రఽజామ్ । ఉత్ఽభరన్తీ । ఉత్ । ఊహ ॥ 9 ॥

అనువాదం :

ఓ ఋత్విక్కూ! ఈ ముందున్న రాళ్ళవంటి రోలు, రోకలిని కలిపి
ఆహవనీయార్థం ఆస్తీర్ణ మైన ఈ యజనంపై ఉంచు
ఇవి సోమాంశు రూపము లైన వ్రీహులను
యజమానునకై బాగుగా పొట్టు పోవునట్లు చేయు గాక!
దంచుతున్న ఓ పత్నీ! విదారణం చెయ్యి
ఈ మా సంతాన హననార్థం ఏ శత్రువు లైతే తమ సేనలను
కూడగట్టుకొని వస్తున్నారో, వారిని వధించు
ముసలమును పైకెత్తి మా సంతానాన్ని
ఉన్నత స్థానానికి చేర్చు. ॥ 9 ॥

మంత్రము :

గృహాణ గ్రావాణౌ సకృతౌ వీర హస్త

ఆ తే దేవా యజ్ఞియా యజ్ఞ మగుః ।

త్రయో వరా యతమాం స్త్వం వృణీషే

తా స్తే సమృద్ధీ రిహ రాధయామి ॥ 10 ॥

పదము :

గృహాణ । గ్రావాణౌ । సఽకృతౌ । వీర । హస్తే ।

ఆ । తే । దేవాః । యజ్ఞియాః । యజ్ఞమ్ । అగుః ।

త్రయః । వరాః । యతమాన్ । త్వమ్ । వృణీషే ।

తాః । తే । సమ్ఽఋద్ధీః । ఇహ । రాధయామి ॥ 10 ॥

అనువాదం :

ఓ వీరుడా! ( అధ్వర్యూ! )
నీ చేతులలోనికి సుకృతము లైన
ఉలూఖల ముసలములను తీసుకో
యజ్ఞార్హు లైన దేవతలు నీ యజ్ఞమునకు వచ్చినారు
కోరుకోవలసిన మూడు వరములను
ఓ యజమానుడా! నీవు కోరుకో
నీవు కోరే ఆ సమృద్ధులను
ఈ యజ్ఞంలో సాధిస్తాను ॥ 10 ॥

మంత్రము।

ఇయం తే ధీతి రిదము తే జనిత్రం
గృహ్ణాతు త్వా మదితిః శూరపుత్రా।
పరా పునీహి య ఇమాం పృతన్యవో౨
స్మై రయిం సర్వవీరం ని యచ్ఛ ॥ 11 ॥

పదము

ఇయమ్। తే। ధీతిః। ఇదమ్। ఓం ఇతి। తే। జనిత్రమ్।
గృహ్ణాతు। త్వామ్। అదితిః। శూర౨పుత్రా।
పరా। పునీహి। యే। ఇమామ్। పృతన్యవః।
అస్మై। రయిమ్। సర్వ౨వీరమ్। ని। యచ్ఛ ॥ 11 ॥

అనువాదం

(ఓ శూర్పమా!) నీవు చేసే తండుల
తుషావివేచనమే పానము
ఈ పరాపవన కర్మే నీ జననానికి నిమిత్త మైనది
ఇలాంటి నిన్ను వీరపుత్ర అయిన అదితి చేపట్టును గాక!
ఏ శత్రువులు ఈ పత్నిని హింసించుటకై
సేనలను కూర్చుకొన్నారో, వారిని నిరసించుటకు
ఈ తండులముల నుంచి పొట్టును వేరుగా చెయ్యి
ఈ పత్నికి సర్వ వీరసంతానాన్ని, ధనాన్ని
కావలసినంత ప్రసాదించు. ॥ 11 ॥

మంత్రము

ఉపశ్వసే ద్రువయే సీదతా యూయం

వి విచ్యధ్వం యజ్ఞియాస స్తుషైః ।

శ్రియా సమానా నతి సర్వా స్స్యామ

ధస్పదం ద్విషత స్పాదయామి ॥ 12 ॥

పదము :

ఉపఽశ్వసే । ద్రువయే । సీదత । యూయమ్ ।

వి । విచ్యధ్వమ్ । యజ్ఞియాసః । తుషైః ।

శ్రియా । సమానాన్ । అతి । సర్వాన్ । స్యామ ।

అధఃఽపదమ్ । ద్విషతః । పాదయామి ॥ 12 ॥

అనువాదం

నిజమైన ఫలం కోసం ఓ తండులములారా!
మిమ్ములను సముదాయిస్తున్నాను
మీరు ఈ చేటలో నివసించండి
యజ్ఞార్హులైన మీరు పొట్టు నుండి వేరుపడండి
నీవు సృష్టించిన సంపదతో సర్వపురుషులను అతిక్రమించ గలను
శత్రువులను కాళ్ళ క్రింద పెట్టి నలిపివేయ గలను ॥ 12 ॥

మంత్రము

పరేహి నారి పునరేహి క్షిప్ర

మపాం త్వా గోష్ఠో ధ్యరుక్షద్ భరాయ ।

తాసాం గృహ్ణీతాద్ యతమా యజ్ఞియా
అసన్ విభాజ్య ధీరీతరా జహీతాత్ ॥ 13 ॥

పదము ।

పరా । ఇహి । నారి । పునః । ఆ । ఇహి । క్షిప్రమ్
అపామ్ । త్వా । గోఽస్థః । అధి । అరుక్షత్ । భరాయ ।
తాసామ్ । గృహ్ణీతాత్ । యతమాః । యజ్ఞియాః ।
అసన్ । విఽభాజ్య । ధీరీ । ఇతరాః । జహీతాత్ ॥ 13 ॥

అనువాదం ।

ఓ నారి! నీటికై జలాశయానికి వెళ్ళు
నీరు తీసుకుని త్వరగ తిరిగి రా
ఆ సమయంలో నిన్ను ఉదకగోష్ఠం అధిరోహించు గాక!
ఆ దొరికిన నీటి నడుమ యజ్ఞార్హము లైనవి
ఏ మాత్ర మున్నవో వాటిని ఘటాదులతో కొనిరా
యజ్ఞేతరము లైన ఉదకములను
ధీరురాల వైన నీవు విభజించి వదలివేయి ॥ 13 ॥

మంత్రము ।

ఏమా అగు ర్యోషితః శుమ్భమానా
ఉత్తిష్ఠ నారి తవసం రభస్వ ।
సుపత్నీ పత్యా ప్రజయా ప్రజావత్యా
త్వాగన్ యజ్ఞః ప్రతి కుమ్భం గృభాయ ॥ 14 ॥

పదము

ఆ । ఇమాః । అగుః । యోషితః । శుమ్భమానాః ।

ఉత్ । తిష్ఠ । నారి । తవసమ్ । రభస్వ ।

సుఽపత్నీ । పత్యా । ప్రఽజయా । ప్రజాఽవతీ ।

ఆ । త్వా । అగన్ । యజ్ఞః । ప్రతి । కుమ్భమ్ । గృభాయ ॥14॥

అనువాదం:

శోభనాలంకార యుక్తలై
ఈ నీటిని కొనివచ్చే స్త్రీలు వస్తున్నారు
ఓ నారీ! నీవు లేచి నిలబడు
నిన్ను సమీపించిన ఆ స్త్రీలు
సంగ్రహించుటకై ఉద్యుక్తులౌతున్నారు
శోభన పతియుక్తవై, పత్ని వైన నీవు
పుత్రాదిరూప మైన సంతానంతో విలసిల్లు
ఇలాంటి నిన్ను యజ్ఞం ఉదకరూపంతో సమీపిస్తున్నది.
ఉదకపూర్ణఘటం ప్రతిగ్రహించు ॥ 14 ॥

మంత్రము:

ఊర్జో భాగో నిహితో యః పురా వ

ఋషిప్రశిష్టాప ఆ భరైతాః ।

అయం యజ్ఞో గాతువి న్నాథవిత్ ప్రజావి-

దుగ్రః పశువిద్ వీరవిద్ వో అస్తు ॥ 15 ॥

పదము:

ఊర్జః । భాగః । ని౽హితః । యః । పురా । వః ।

ఋషి౽ప్రశిష్టా । అపః । ఆ । భర । ఏతాః ।

అయమ్ । యజ్ఞః । గాతు౽విత్ । నాథ౽విత్ । ప్రజా౽విత్ ।

ఉగ్రః । పశు౽విత్ । వీర౽విత్ । వః । అస్తు ॥ 15 ॥

అనువాదం:

ఓ ఉదకములారా! మీ సారభూత మైన
జలరాశి అంశం పూర్వం బ్రహ్మకల్పితమై ఉన్నది.
ఓ పత్నీ! ఈ కొనివచ్చిన ఉదకం బ్రహ్మతో ప్రశంసిత మైనది
దీనిని ఆస్తీర్ణ మైన చర్మంపై ఉంచు.
ఈ బ్రహ్మౌదన సవ మనే యజ్ఞం స్వర్గమార్గ లంభక మైనది
స్వర్గాది ఫలములను ఇచ్చునది
సంతాన లంభక మైనది ఉగ్ర మైనది
పశు లంభక మైనది కర్మకారులకు లంభక మైనది
ఓ యజమాన పత్న్యాదులారా! మీకు
ఇది ఫలప్రద మగు గాక! ॥ 15 ॥

మంత్రము:

అగ్నే చరు ర్యజ్ఞియ స్త్వాధ్యరుక్ష

చ్ఛుచి స్తపిష్ఠ స్తపసా తపైనమ్ ।

ఆర్షేయా దైవా అభిసంగత్య భాగ-

మిమం తపిష్ఠా ఋతుభి స్తపన్తు ॥ 16 ॥

పదాః

అగ్నే । చరుః । యజ్ఞియః । త్వా । అధి । అరుక్షత్ ।

శుచిః । తపిష్ఠః । తపసా । తప । ఏనమ్ ।

ఆర్షేయాః । దైవాః । అభిఽసంగత్య । భాగమ్ ।

ఇమమ్ । తపిష్ఠాః । ఋతుఽభిః । తపన్తు ॥ 16 ॥

అనువాదం

ఓ అగ్నీ ! నిన్ను యజ్ఞార్హ మైన
హవిఃపాత్ర అధిరోహించు గాక !
పరిశుద్ధ మైన, పాపశాంతికర మైన,
సంతాపక మైన ఆత్మీయ తేజస్సుతో
ఈ చరువును నీవు తప్తం చెయ్యి
ఆర్షేయ బ్రాహ్మణులు, ఇంద్రాది దేవతలు
వారి వారి భాగములను పొంది తపిష్ఠులై ఈ చరువును
వసంతాది కాల విశేషములతో
తపింప జేయుదురు గాక ! ॥ 16 ॥

మంత్రము :

శుద్ధాః పూతా యోషితో యజ్ఞియా ఇమా
అప శ్చరు మవ సర్పన్తు శుభ్రాః ।
అదుః ప్రజాం బహులాన్ పశూన్ నః
పక్త్వౌదనస్య సుకృతా మేతు లోకమ్ ॥ 17 ॥

పదము :

శుద్ధాః । పూతాః । యోషితః । యజ్ఞియాః । ఇమాః ।

ఆపః । చరుమ్ । అవ । సర్పన్తు । శుభ్రాః ।

అదుః । ప్రఽజామ్ । బహులాన్ । పశూన్ । నః ।

పక్త్వా । ఓదనస్య । సుఽకృతామ్ । ఏతు । లోకమ్ ॥ 17 ॥

అనువాదం:

శుద్ధములు, పవిత్రములు,
నారీ రూపములు, యజ్ఞార్హములు నైన
ఈ కొనివచ్చిన ఉదకములు చరువును
ప్రవేశించు గాక !
ఆ నీరు మాకు పుత్రాదిరూప మైన సంతానాన్ని
గో మహిషాది పశువులను ప్రసాదించు గాక !
ఓదన పాచకు డైన యజమాని
పుణ్యలోకములకు వెళ్ళు గాక ! ॥ 17 ॥

మంత్రము :

బ్రహ్మణా శుద్ధా ఉత పూతా ఘృతేన
సోమ స్యాంశవ స్తణ్డులా యజ్ఞియా ఇమే ।
అపః ప్ర వీశత ప్రతి గృహ్ణాతు వ-
శ్చరు రిమం పక్త్వా సుకృతా మేత లోకమ్ ॥ 18 ॥

పదము

బ్రహ్మణా । శుద్ధాః । ఉత । పూతాః । ఘృతేన ।

సోమస్య । అంశవః । తణ్డులాః । యజ్ఞియాః । ఇమే ।

అపః । ప్ర । విశత । ప్రతి । గృహ్ణాతు । వః ।

చరుః । ఇమమ్ । పక్త్వా । సుఽకృతామ్ । ఏత । లోకమ్ ॥ 18 ॥

అనువాదం

మంత్రంతో పరిశుద్ధము లైనవి, క్షరణశీలము లైన
ఉదకములతో ప్రక్షాళితము లైనవి,
అమృతలతా ఖండములు, యజ్ఞార్హములు నైన
ఈ తండులములు, స్థాలిగతము లైన ఉదకములలో
ప్రవేశించు గాక!
ఆ స్థాలి మిమ్ములను స్వీకరించు గాక!
ఈ అన్నాన్ని పచనం చేసి
సుకృతలోకాన్ని పొందుదురు గాక! ॥ 18 ॥

మంత్రము

ఉరుః ప్రథస్వ మహతా మహిమ్నా
సహస్రపృష్ఠః సుకృతస్య లోకే ।
పితామహాః పితరః ప్రజోపజాఽ
హం పక్తా పఞ్చదశస్తే అస్మి ॥ 19 ॥

పదము।

ఉరుః । ప్రథస్వ । మహతా । మహిమ్నా ।

సహస్రఽపృష్ఠః । సుఽకృతస్య । లోకే ।

పితామహాః । పితరః । ప్రఽజా । ఉపఽజా ।

అహమ్ । పక్తా । పఞ్చఽదశః । తే । అస్మి ॥ 19 ॥

అనువాదం

ఓ ఓదనమా! పుణ్య ఫలభూత మైన లోకంలో
అధిక మహిమతో, విస్తీర్ణ మైన
సహస్రావయవ పూర్ణంగా విస్తరించు
మా పితరులు ఓ ఓదనమా! నీతో తృప్తి చెందెదరు
మా పుత్రదుహితాదులను, అనంతర పుత్రాదులను
నీవు తృప్తిపరుస్తున్నావు
బ్రహ్మౌదనాన్ని పచనం చేసిన నేను
పంచదశ సంఖ్యాకుడను అవుతున్నాను
నేను చేసే ఈ కర్మతో అందరూ సంతృప్తి చెందుదురుగాక! ॥19॥

మంత్రము

సహస్రపృష్ఠః శతధారో అక్షితో
బ్రహ్మౌదనో దేవయానః స్వర్గః ।
అమూం స్త ఆ దధామి ప్రజయా రేష
యైనాన్ బలిహారాయ మృడతా న్మహ్య మేవ ॥ 20 ॥

పదము

సహ్ర్సఽపృష్ఠః । శతఽధారః । అక్షితః ।

బ్రహ్మఽఓదనః । దేవఽయానః । స్వఃఽగః ।

అమూన్ । తే । ఆ । దధామి । ప్రఽజయా । రేషయ ।

వీనాన్ । బలిఽహారాయ । మృడతాత్ । మహ్యమ్ । ఏవ ॥ 20 ॥

అనువాదం :

ఓ యజమానుడా! నీవు చేసే ఈ సవయజ్ఞం
సహస్ర పృష్ఠము, శతధారము,
అక్షీయమాణము, దేవయానము,
ఫలభూత మైన స్వర్గ సాధనభూతము అయినది
నీకు బలి ఇచ్చుటకై ఈ సజాతు లైన వారిని
అభిముఖంగా నిలుపుతున్నాను,
వీరిని పుత్రభృత్యాదులను అభీకరించు ( తగ్గునట్లు చేయి )
నన్నే పైన చెప్పిన సవయజ్ఞం సుఖపెట్టు గాక! ॥ 20 ॥

మంత్రము :

ఉదేహి వేదిం ప్రజయా వర్ధయైనాం
నుదస్వ రక్షః ప్రతరం ధేహ్యేనామ్ ।
శ్రియా సమానా నతి సర్వా న్స్యామ
మాధస్పదం ద్విషత స్పాదయామి ॥ 21 ॥

పదము :

ఉత్ఽఏహి । వేదిమ్ । ప్రఽజయా । వర్ధయ । ఏనామ్ ।
నుదస్వ । రక్షః । ప్రఽతరమ్ । ధేహి । ఏనామ్ ।
శ్రియా । సమానాన్ । అతి । సర్వాన్ । స్యామ ।
అధఃఽపదమ్ । ద్విషతః । పాదయామి ॥ 21 ॥

అనువాదం :

ఓ పక్వౌదనమా ! వేది పైనికి ఎక్కి రా
ఈ యజమానురాలిని సంతానంతో వర్ధిల్ల జెయ్యి
యజ్ఞవిఘాతకుడైన రాక్షసుని
ఇక్కడ నుంచి తరిమివెయ్యి
అలాగే ఈ యజమానురాలిని
ప్రకృష్టతరురాలినిగా చెయ్యి
నీవు సృష్టించిన సంపదతో సర్వులను అతిక్రమించ గలను
శత్రువులను కాళ్ళ క్రింద పెట్టి నలిపివేయ గలను ॥ 21 ॥

మంత్రము

అభ్యావర్తస్వ పశుభిః సహైనాం
ప్రత్యఙేనాం దేవతాభిః సహైధి ।
మా త్వా ప్రాపచ్ఛపథో మాఽభిచారః
స్వే క్షేత్రే అనమీవా వి రాజ ॥ 22 ॥

పదము

అభిఽఆవర్తస్వ । పశుఽభిః । సహ । ఏనామ్ ।
ప్రత్యఙ్ । ఏనామ్ । దేవతాభిః । సహ । ఏధి ।
మా । త్వా । ప్ర । ఆపత్ । శపథః । మా । అభిఽచారః ।
స్వే । క్షేత్రే । అనమీవా । వి । రాజ ॥ 22 ॥

అనువాదం ।

ఓ బ్రహ్మౌదనమా ! ఈ పత్నీయజమానాదులను
పశువులతో అభ్యావర్తనం చెయ్యి
అలాగే యష్టవ్య దేవతలతో పాటు
అభిముఖంగా వెళ్ళు
ఓ యజమాన దంపతులారా !
ఇతరులు పెట్టే శాపం మీకు తగులకుండు గాక !
అలాగే పరకృతమైన అభిచార కర్మ
మీకు తగులకుండు గాక !
స్వకీయస్థానంలో రోగరహితులై
విరాజిల్లుదురు గాక ! ॥ 22 ॥

మంత్రము ।

ఋతేన తష్టా మనసా హితైషా
బ్రహ్మౌదనస్య విహితా వేది రగ్రే ।
అంసద్రీం శుద్ధా ముప ధేహి నారి
తత్రౌదనం సాదయ దైవానామ్ ॥ 23 ॥

పదము :

ఋతేన । తష్టా । మనసా । హితా । ఏషా ।

బ్రహ్మౌఽఓదనస్య । వి౽హితా । వేదిః । అగ్రే ।

అంసద్రీమ్ । శుద్ధామ్ । ఉప । ధేహి । నారి ।

తత్ర । ఓదనమ్ । సాదయ । దైవానామ్ ॥ 23 ॥

అనువాదం :

ఋతంతో తనూకృతమై, మనస్సుతో ధృతమై,
ఏవంగుణ విశిష్ట మైన వేది
బ్రహ్మౌదనానికి ముందు
మహర్షులతో కల్పితమై ఉన్నది
ఓ నారీ! దేవ, మనుష్య, పితృసంబంధి
వివిధ భాగోపేత మైన,
అనుపహత మైన వేది సమీపంలో ఉందు
ఆ వేదిపై పక్వ మైన ఈ ఓదనాన్ని
దేవతలకు సంప్రాప్తింప జేయి ॥ 23 ॥

మంత్రము

అదితే ర్హస్తాం స్రుచ మేతాం ద్వితీయాం

సప్త ఋషయో భూతకృతో యా మకృణ్వన్ ।

సా గాత్రాణి విదు ష్యోదనస్య

దర్వి ర్వేద్యా మధ్యేనం చినోతు ॥ 24 ॥

పదము

అదితేః । హస్తామ్ । స్రుచమ్ । ఏతామ్ । ద్వితీయామ్ ।

సప్తఽఋషయః । భూతఽకృతః । యామ్ । అకృణ్వన్ ।

సా । గాత్రాణి । విదుషీ । ఓదనస్య ।

దర్విః । వేద్యామ్ । అధి । ఏనమ్ । చినోతు ॥ 24 ॥

అనువాదం ।

అదితి ఏ ద్వితీయ హస్తాన్ని హోమసాధన
భూత మైన స్రుక్కునుగా
ప్రాణి స్రష్ట లయిన సప్తర్షులు చేసినారో, ఆ ఈ దర్వి (స్రుక్కు)
పక్వ మైన ఓదన శరీరావ్యవయవములను తెలిసినదై
వేదిపై బ్రహ్మౌదనమును స్థాపించు గాక! ॥ 24 ॥

మంత్రము ।

శృతం త్వా హవ్య ముప సీదన్తు దైవా

నిఃసృప్యాగ్నేః పునరేనాన్ ప్ర సీద ।

సోమేన పూతో జఠరే సీద బ్రహ్మణా-

మార్షేయా స్తే మా రిషన్ ప్రాశితారః ॥ 25 ॥

పదము ।

శృతమ్ । త్వా । హవ్యమ్ । ఉప । సీదన్తు । దైవాః ।

నిఃఽసృప్య । అగ్నేః । పునః । ఏనాన్ । ప్ర । సీద ।

సోమేన । పూతః । జఠరే । సీద । బ్రహ్మణామ్ ।

ఆర్షేయాః । తే । మా । రిషన్ । ప్రఽఅశితారః ॥ 25 ॥

అనువాదం।

ఓ ఓదనమా! పక్వమై, హవనయోగ్య మైన
నిన్ను దేవతలు సమీపింతురు గాక!
నీవు అగ్ని సకాశం నుంచి వచ్చి తిరిగి
వీరిని అనుగ్రహింతువు గాక!
అమృతమయ మైన సోమరసంతో పూతమై,
బ్రాహ్మణుల జఠరంలో ప్రవేశించు
ఆర్షేయు లైన బ్రాహ్మలు, ఓదన భోక్తలు
నశింపకుందురు గాక! ॥ 25 ॥

మంత్రము।

సోమ రాజ న్త్సంజ్ఞాన మా వపైభ్యః
సుబ్రాహ్మణా యతమే త్వోపసీదాన్ ।
ఋషి నార్షేయాం స్తపసోధి జాతాన్
బ్రహ్మౌదనే సుహవా జోహవీమి ॥ 26 ॥

పదము।

సోమ । రాజన్ । సమ్ఽజ్ఞానమ్ । ఆ । వప । ఏభ్యః ।

సుఽబ్రాహ్మణాః । యతమే । త్వా । ఉపఽసీదాన్ ।

ఋషీన్ । ఆర్షేయాన్ । తపసః । అధి । జాతాన్ ।

బ్రహ్మఽఓదనే । సుఽహవా । జోహవీమి ॥ 26 ॥

అనువాదం

ఓ రాజా! సోమా! తపాత్మక బ్రహౌదనా!
భోక్తలైన బ్రాహ్మణులకు సంజ్ఞానం కలిగించు
జాతీయులైన బ్రాహ్మణులు నిన్ను సమీపిస్తున్నారు
ఈ శోభనాహ్వాన మైన పత్ని అర్షేయ
బ్రాహ్మణులను బ్రహౌదనమునకై
పదేపదే ఆహ్వానిస్తున్నాను. ॥ 26 ॥

మంత్రము

శుద్ధాః పూతా యోషితో యజ్ఞియా ఇమా
బ్రహ్మణాం హస్తేషు ప్రపృథక్ సాదయామి ।
యత్కామ ఇద మభిషిఞ్చామి వోహ-
మిన్ద్రో మరుత్వా న్స దదా దిదం మే ॥ 27 ॥

పదము

శుద్ధాః । పూతాః । యోషితః । యజ్ఞియాః । ఇమాః ।
బ్రహ్మణామ్ । హస్తేషు । ప్రఽపృథక్ । సాదయామి ।
యత్ఽకామః । ఇదమ్ । అభిఽసిఞ్చామి । వః । అహమ్ ।
ఇన్ద్రః । మరుత్వాన్ । సః । దదాత్ । ఇదమ్ । మే ॥ 27 ॥

అనువాదం :

శుద్ధములు, పవిత్రములు అయిన స్త్రీరూప
యజ్ఞార్థ ఉదకములను బ్రాహ్మణుల
హస్తముల యందు ఉంచుతున్నాను
ఓ ఉదకములారా ! మిమ్ములను
నేను ఏ కోరికతో ఇప్పుడు సేచనం చేస్తున్నానో,
దానిని మరుద్గణయుక్తుడైన ఇంద్రుడు
నాకు ప్రసాదించు గాక ! ॥ 27 ॥

మంత్రము

ఇదం మే జ్యోతి రమృతం హిరణ్యం
పక్వం క్షేత్రాత్ కామదుఘా మ ఏషా ।
ఇదం ధనం ని దధే బ్రాహ్మణేషు
కృణ్వే పన్థాం పితృషు యః స్వర్గః ॥ 28 ॥

పదము

ఇదమ్ । మే । జ్యోతిః । అమృతమ్ । హిరణ్యమ్ ।
పక్వమ్ । క్షేత్రాత్ । కామఽదుఘా । మే । ఏషా ।
ఇదమ్ । ధనమ్ । ని । దధే । బ్రాహ్మణేషు ।
కృణ్వే । పన్థామ్ । పితృషు । యః । స్వఃఽగః ॥ 28 ॥

అనువాదం :

ఈ స్వర్ణం అమృతమైనది నాకు జ్యోతిగా ఉన్నది
పక్వమైన ఈ అన్నం నాకు కామధేనువుగా ఉన్నది

ఈ ధనం బ్రాహ్మణులకు ఇస్తున్నాను
అది స్వర్గలోకంలో కోటి గుణిత మౌతుంది
నా పితరుల విషయంలో వారుకోరే
స్వర్గమునకు మార్గాన్ని వేస్తుంది ॥ 28 ॥

మంత్రము :

అగ్నౌ తుషానా వప జాతవేదసి
పరః కమ్బూకాం అప మృడ్ఢి దూరమ్ ।
ఏతం శుశ్రుమ గృహరాజస్య భాగ-
మథో విద్మ నిర్ ఋతే ర్భాగధేయమ్ ॥ 29 ॥

పదము

అగ్నౌ । తుషాన్ । ఆ । వప । జాతఽవేదసి ।
పరః । కమ్బూకాన్ । అప । మృడ్ఢి । దూరమ్ ।
ఏతమ్ । శుశ్రుమ । గృహఽరాజస్య । భాగమ్ ।
అథో ఇతి । విద్మ । నిఃఋతేః । భాగఽధేయమ్ ॥ 29 ॥

అనువాదం :

( ఓ ఋత్విక్కూ ! ) జాతవేది అయిన అగ్నిలో
బ్రహ్మౌదనార్థమైన తండులముల నుంచి
విడదీసిన పొట్టును ప్రక్షేపించు
ఫలీకరణములను తరువాత దూరంగా
కాలితో త్రోసివేయి

గృహాధిపతి అయిన వాస్తునాథుని
కంబుకాఖ్యమనే భాగాన్ని గూర్చి మేము విన్నాము.
మఱిన్ని నిర్ ఋతి భాగధేయాన్ని కూడా
తెలుసుకుని ఉన్నాము. ॥ 29 ॥

మంత్రము :

శ్రామ్యతః పచతో విద్ధి సున్వతః
పన్థాం స్వర్గ మధి రోహ యైనమ్ ।
యేన రోహాత్ పర మాపద్య యద్ వయ
ఉత్తమం నాకం పరమం వ్యోఽమ ॥ 30 ॥

పదము :

శ్రామ్యతః । పచతః । విద్ధి । సున్వతః ।
పన్థామ్ । స్వఃఽగమ్ । అధి । రోహయ । ఏనమ్ ।
యేన । రోహాత్ । పరమ్ । ఆఽపద్య । యత్ । వయః ।
ఉత్ఽతమమ్ । నాకమ్ । పరమమ్ । విఽఓమ ॥ 30 ॥

అనువాదం :

దీక్షారూపమైన తపస్సును చేస్తున్న,
ఉక్త రీతిలో బ్రహ్మౌదనాన్ని పచనం చేస్తున్న,
సోమాభిషవం చేస్తున్న యజమానులను
ఓ బ్రహ్మౌదనమా! నివు ఎరుగుదువు.
వీరిని స్వర్గానికి వెళ్ళే మార్గాన్ని అధిరోహింప జెయ్యి.

ఉత్తమ నాకాన్ని పరమవ్యోమాన్ని
చేరుకునే మార్గాన్ని ఇతడు ఆరోహించు గాక!
ఉత్కృష్ట పక్షిరూపమును గ్రహించి
ఆ మార్గాన్ని అధిరోహించు గాక! ॥ 30 ॥

**మంత్రము :**

**బభ్రే రధ్వర్యో ముఖ మేతత్ వి మృ-**

**డ్ఢ్యాజ్యాయ లోకం కృణుహి ప్రవిద్వాన్ ।**

**ఘృతేన గాత్రాను సర్వా వి మృడ్ఢి**

**కృణ్వే పన్థాం పితృషు యః స్వర్గః ॥ 31 ॥**

పదము :

**బభ్రేః । అధ్వర్యో ఇతి । ముఖమ్ । ఏతత్ । వి । మృడ్ఢి ।**

**ఆజ్యాయ । లోకమ్ । కృణుహి । ప్రఽవిద్వాన్ ।**

**ఘృతేన । గాత్రా అను । సర్వా । వి । మృడ్ఢి ।**

**కృణ్వే । పన్థామ్ । పితృషు । యః । స్వఃఽగః ॥ 31 ॥**

**అనువాదం :**

ఓ అధ్వర్యూ! పోషకమైన, పక్వమైన
ఓదనమునకు ఉపరి ప్రదేశంలో పరిమార్జనం చెయ్యి.
తదనంతరం ఓ అధ్వర్యూ! తెలిసిన వాడవై
ఆజ్యధారణార్థమైన స్థానాన్ని కల్పించు.
సర్వగాత్రములు ఈ క్షరణశీలమైన ఆజ్యంతో

అనుక్రమంగా మార్జనం చెయ్యి.
ఈ ఓదనంతో మార్గాన్ని కల్పించుకో.
పితరులకు స్వర్గమార్గమైనదే ఈ మార్గం. ॥ 31 ॥

మంత్రము :

బభ్రేః రక్షః సమద మా వపైభ్యో-
బ్రాహ్మణా యతమే త్వోపసీదాన్ ।
పురీషిణః ప్రథమానాః పురస్తా-
దార్షేయా స్తే మా రిషన్ ప్రాశితారః ॥ 32 ॥

పదము :

బభ్రేః । రక్షః । సఽమదమ్ । ఆ । వప । ఏభ్యః ।
అబ్రాహ్మణాః । యతమే । త్వా । ఉపఽసీదాన్ ।
పురీషిణః । ప్రథమానాః । పురస్తాత్ ।
ఆర్షేయాః । తే । మా । రిషన్ । ప్రఽఅశితారః ॥ 32 ॥

అనువాదం :

ఓ బ్రహ్మౌదనమా! అబ్రాహ్మణులు ఎందరు నిన్ను
సమీపిస్తారో, వారికి రక్షోజాతితో సమరం కల్పించు.
పూర్వం చెప్పిన ఆర్షేయులు పురీషులు
లోకంలో పుత్రపౌత్రాది సమృద్ధితో విస్తీర్యమాణులైన వారు
భృగంగిరో విదులైన బ్రాహ్మణులు ఓ ఓదనమా!
నీకు భోక్తలు. వారు హింసకు లోను కాకుందురు గాక! ॥32॥

మంత్రము :

ఆర్షేయేషు ని దధ ఓదన త్వా

నానార్షేయాణా మప్యస్త్యత్ర ।

అగ్ని ర్మే గోప్తా మరుతశ్చ సర్వే

విశ్వే దేవా అభి రక్షన్తు పక్వమ్ ॥ 33 ॥

పదము :

ఆర్షేయేషు । ని । దధే । ఓదన । త్వా ।

న । అనార్షేయాణామ్ । అపి । అస్తి । అత్ర ।

అగ్నిః । మే । గోప్తా । మరుతః । చ । సర్వే ।

విశ్వే । దేవాః । అభి । రక్షన్తు । పక్వమ్ । ॥ 33 ॥

అనువాదం :

ఓ ఓదనమా! నిన్ను ఆర్షేయులలో ఉంచుతున్నాను.
ఈ బ్రహ్మౌదనంలో ఋషిగోత్ర ప్రవరాదులు
ఎరుగని పురుషుల సంభావనే ఉండదు.
నాకీ అగ్ని అగ్రణి. నా రక్షకుడు.
అలాగే సప్తగణాత్మకులైన మరుత్తులు నాకు రక్షకులు.
సర్వదేవతలు పక్వమైన ఈ ఓదనాన్ని
అభిరక్షింతురు గాక! ॥ 33 ॥

**మంత్రము :**

యజ్ఞం దుహానం సదమిత్ ప్రపీనం
పుమాంసం ధేనుం సదనం రయీణామ్ ।
ప్రజామృతత్వ ముత దీర్ఘ మాయూ
రాయశ్చ పోషై రుప త్వా సదేమ ॥ 34 ॥

**పదము :**

యజ్ఞమ్ । దుహానమ్ । సదమ్ । ఇత్ । ప్రఽపీనమ్ ।
పుమాంసమ్ । ధేనుమ్ । సదనమ్ । రయీణామ్ ।
ప్రజాఽఅమృతత్వమ్ । ఉత । దీర్ఘమ్ । ఆయుః ।
రాయః । చ । పోషైః । ఉప । త్వా । సదేమ ॥ 34 ॥

**అనువాదం :**

యజ్ఞాన్ని ఉత్పాదనం చేస్తున్న సదా ప్రవృద్ధోధస్క మైన
బ్రహ్మౌదన పుంరూపమైన ధేనువును
ధన ఉపవేశన స్థానమైన ఓ ఓదనమా!
ఇలాంటి నిన్ను భుజిస్తున్న మేము
ప్రజామృతత్వం పొందుదుము గాక!
మరిన్ని దీర్ఘాయుష్కాల మగుదుము గాక! ॥ 34 ॥

**మంత్రము :**

వృషభోఽసి స్వర్గ ఋషీ నార్షేయాన్ గచ్ఛ ।
సుకృతాం లోకే సీద తత్ర నౌ సంస్కృతమ్ ॥ 35 ॥

పదము ;

వృషభః । అసి । స్వః౽గః । ఋషీన్ । ఆర్షేయాన్ । గచ్ఛ ।

సు౽కృతామ్ । లోకే । సీద । తత్ర । నౌ । సంస్కృతమ్ ॥ 35 ॥

అనువాదం :

ఓ బ్రహ్మౌదనమా ! నీవు వృషభమవు.
(కామితార్థ ప్రదాతవు.)
అలాగే స్వర్లోకాన్ని చేర్చుదానవు.
ఋషులను, ఆర్షేయులైన బ్రాహ్మణులను చేరు.
అలా వారు భుజింపగా సుకృతఫల భూతమైన
నాక పృష్ఠాఖ్యం పై అధిష్ఠించు.
ఆ తరువాత మాకు అలోకంలో సంస్కారం లభిస్తుంది. ॥35॥

మంత్రము :

సమాచిను ష్వాను సంప్రయా-
హ్యగ్నే పథః కల్పయ దేవయానాన్ ।
ఏతైః సుకృతై రను గచ్ఛేమ యజ్ఞం
నాకే తిష్ఠన్త మధి సప్తరశ్మౌ ॥ 36 ॥

పదము :

సమ్౽ఆచినుష్వ । అను౽సంప్రయాహి ।

అగ్నే । పథః । కల్పయ । దేవ౽యానాన్ ।

ఏతైః । సుఽకృతైః । అను । గచ్ఛేమ । యజ్ఞమ్ ।

నాకే । తిష్ఠన్తమ్ । అధి । సప్తఽరశ్మౌ ॥ 36 ॥

అనువాదం.

ఓ ఓదనమా! నీవు సమస్తాంగ సమూహీ భవనం చెయ్యి.
తరువాత వెళ్ళవలసిన చోటికి వెళ్ళు.
ఓ అగ్ని! నీవుకూడా ఈ ఓదనగమనార్థమై
దేవయానుల మార్గాలను నిర్మించు.
మేమున్నూ ఈ మార్గాలతోనే,
ఈ సుకృతంతోనే ఆదిత్యమండలోపరి
భాగంలో ఉన్న యజ్ఞాన్ని అనుగమిస్తాము. ॥ 36 ॥

మంత్రము:

యేన దేవా జ్యోతిషా ద్యాముదాయన్

బ్రహ్మౌదనం పక్త్వా సుకృతస్య లోకమ్ ।

తేన గేష్మ సుకృతస్య లోకం స్వ౨

రారోహన్తో అభి నాక ముత్తమమ్ ॥ 37 ॥

పదము:

యేన । దేవాః । జ్యోతిషా । ద్యామ్ । ఉత్ఽఆయన్ ।

బ్రహ్మఽఓదనమ్ । పక్త్వా । సుఽకృతస్య । లోకమ్ ।

**తేన । గేష్మ । సుఽకృతస్య । లోకమ్ । స్వ౨ః ।**

**ఆఽరోహన్తః । అభి । నాకమ్ । ఉత్ఽతమమ్ ॥ 37 ॥**

**అనువాదం :**

దేవతలు సూర్యరశ్మిరూపమైన తేజస్సుతో
ఆ మార్గంలో స్వర్గానికి వెళ్ళినారు.
బ్రహ్మౌదనాన్ని పచనం చేసి
పుణ్యకర్మ ఫలభూతమైన లోకాన్ని
దేవతలు వెళ్ళిన మార్గంలో మేమున్నూ
సవయజ్ఞాత్మక ఫలభూతమైన లోకాన్ని జయిస్తాము.
ఉత్తమ లోకాన్ని అభిలక్షించి స్వర్గాన్ని అధిరోహిస్తాము.

[ఈ సూక్తం బ్రహ్మౌదనాఖ్యమైన కర్మను సర్వాంగ సహితంగా ప్రతిపాదించునది కావున అర్థతః ఏకత్వం వల్ల అర్థసూక్తమని మంత్రద్రష్టలు దీనిని అంటారు.]

ఇది మొదటిసూక్తం

# సూక్తం-2

ఋషి: అథర్వుడు॥ దేవతలు: మంత్రములలో పేర్కొన్న శివాదులు॥ ఛందస్సు: 1 పరాతిజాగతా విరాడ్ జగతీ; 2 అనుష్టుబ్గర్భా పఞ్చపదా పథ్యా జగతీ; 3 చతుష్పదా స్వరాడుష్ణిక్; 4,5,7,13,15,16,21 అనుష్టుప్; 6 ఆర్షీ గాయత్రీ: 8 మహాబృహతీ; 9 ఆర్షీ త్రిష్టుప్; 10 పురఃకృతిః త్రిపదా విరాట్ త్రిష్టుప్; 11 పఞ్చపదా జగతీగర్భా విరాట్ శక్వరీ; 12 భురిక్ త్రిష్టుప్; 14,17-19,23,26,27 (త్రిపదా) విరాడ్ గాయత్రీ; 20 భురిక్ గాయత్రీ; 22 విషమ పాదలక్ష్మా త్రిపదా మహా బృహతీ; 24,29 జగతీ; 25 పఞ్చపదాతి శక్వరీ: 28 త్రిష్టుప్; 30 చతుష్పదా ఉష్ణిక్; 31 విపరీత పాదలక్ష్మా షట్పదా త్రిష్టుప్॥
మంత్రములు: ॥ 31 ॥

వినియోగం - ఇది అర్థసూక్తం. స్వస్త్యయన కాముడు, అజ్యసమిత్పురోడాశాది శష్కుల్యంతములైన పదమూడు ద్రవ్యాలలో ఏదో ఒక దానిని హోమం చేయడంలో దీనికి వినియోగం. వానినన్నిటినీ కూడా హోమం చేయవచ్చును.

అలాగే రుద్ర, భూత, ప్రేత, రాక్షస లోకపాలాది నిమిత్తాభిఘాతంలో స్వస్త్యయనార్థం అవు పాలతో వంజన చరువును మూడుగా విభజించి ఈ అర్థసూక్తంలో రుద్రదేవతలకు మూడు ఆహుతులను హోమం చేయాలి.

మాంసముఖాగ్రపతన లక్షణాద్భుత శాంత్యర్థం ఈ సూక్తంతో రుద్రునికై అజ్యహోమం చేయాలి.

అగ్ని చయనంలో 'రౌద్రీరిష్టకాః' అనే అర్థసూక్తంతో అనుమంత్రణం చేయాలి.

సర్వకామ ప్రాప్త్యర్థం కానీ, శాంత్యర్థం కానీ చేసే లక్షహోమంలో దీనికి వినియోగం.

భౌమ అంతరిక్షాది ఉత్పాతదోష నివృత్త్యర్థం అష్టమూర్తి అయిన మహాదేవుని స్తుతి ఈ సూక్తం.

మంత్రము :

భవాశర్వౌ మృడతం మాభి యాతం
భూతపతీ పశుపతీ నమో వామ్ ।
ప్రతిహితా మాయతాం మా వి స్రాష్టం
మా నో హింసిష్టం ద్విపదో మా చతుష్పదః ॥ 1 ॥

పదము .

భవాశర్వౌ । మృడతమ్ । మా । అభి । యాతమ్ ।
భూతపతీ ఇతి భూతఽపతీ । పశుపతీ ఇతి పశుఽపతీ । నమః । వామ్ ।
ప్రతిఽహితామ్ । ఆఽయతామ్ । మా । వి । స్రాష్టమ్ ।
మా । నః । హింసిష్టమ్ । ద్విఽపదః । మా । చతుఃఽపదః ॥ 1 ॥

అనువాదం :

ఓ భవాశర్వులారా ! మమ్ముల‌ను సుఖపెట్టండి.
నాకు అభిముఖంగా రక్షణార్థమై రండి.
ఓ భూతపతులారా ! పశుపతులారా !
మీకు నమస్కారం.
ఇందుతో సంతృప్తులై మీరు అల్లెత్రాటిపై
ఎక్కిడిన బాణాన్ని మాపైకి విడువకండి.
మాకు చెందిన ద్విపాత్తులైన మనుష్యులను హింసించకండి.
చతుష్పాత్తులైన గో, మహిషాశ్వాదులను హింసించకండి.
॥ 1 ॥

మంత్రము :

శునే క్రోష్ట్రే మా శరీరాణి కర్త మలిక్లవేభ్యో
గృధ్రేభ్యో యే చ కృష్ణా అవిష్యవః ।
మక్షికా స్తే పశుపతే వయాంసి
తే విఘసే మా విదన్త ॥ 2 ॥

పదము :

శునే । క్రోష్ట్రే । మా । శరీరాణి । కర్తమ్ । అలిక్లవేభ్యః ।
గృధ్రేభ్యః । యే । చ । కృష్ణాః । అవిష్యవః ।
మక్షికాః । తే । పశుఽపతే । వయాంసి ।
తే । విఽఘసే । మా । విదన్త ॥ 2 ॥

అనువాదం :

ఓ భవాశర్వులారా ! మాకు సంబంధించిన
కుక్కను, నక్కను ఏమీ చేయకండి.
భయభ్రాంతములైన గృధ్రములలో నల్లనివైన
వాయసములు మొదలైన పక్షులు
ఆమిషా ( మాంసా ) ర్థమై ఆకసంలో సంచరిస్తుంటాయి.
మమ్ము్లను వాటి పాల పడవేయకండి.
ఓ పశుపతీ ! ఆ మక్షికములు, ఆ పక్షులు
అన్న నిమిత్తమై మా శరీరాలను భక్షింపకుండు గాక ! ॥ 2 ॥

మంత్రము :

క్రన్దాయ తే ప్రాణాయ యాశ్చ తే భవరోపయః ।

నమస్తే రుద్ర కృణ్మః సహస్రాక్షాయామర్త్య ॥ 3 ॥

పదము.

క్రన్దాయ । తే । ప్రాణాయ । యాః । చ । తే । భవ । రోపయః ।

నమః । తే । రుద్ర । కృణ్మః । సహస్రఽఅక్షాయ । అమర్త్య ॥ 3 ॥

అనువాదం :

ఏ భవా! నీ శబ్దమునకై, ప్రాణమునకై నమస్కరిస్తున్నాను.
ఓ భవా! మోహింపజేసే నీ రూపములకు నమస్కారం.
ఓ దేవా! సహస్రాక్షునకు, అమర్త్యుడవైన నీకు
నమస్కారం చేస్తున్నాను. ॥ 3 ॥

మంత్రము :

పురస్తాత్ తే నమః కృణ్మ ఉత్తరా దధరా దుత ।

అభీవర్గాద్ దివస్ప ర్యన్తరిక్షాయ తే నమః ॥ 4 ॥

పదము.

పురస్తాత్ । తే । నమః । కృణ్మః । ఉత్తరాత్ । అధరాత్ । ఉత ।

అభీఽవర్గాత్ । దివః । పరి । అన్తరిక్షాయ । తే । నమః ॥ 4 ॥

అనువాదం :

ఓ రుద్రా! ప్రాగ్దిశలో నున్న నీకు నమస్కరిస్తున్నాము
ఉత్తర దిక్కున ఉన్న నీకు నమస్కరిస్తున్నాము
దక్షిణదిక్కున ఉన్న నీకు నమస్కరిస్తున్నాము
ఆకాశం ఉపరిభాగంలో అంతరిక్షంలో
ఉన్న నీకు నమస్కరిస్తున్నాము ॥ 4 ॥

మంత్రము

ముఖాయ తే పశుపతే యాని చక్షూంషి తే భవ ।
త్వచే రూపాయ సందృశే ప్రతీచీనాయ తే నమః ॥ 5 ॥

పదము :

ముఖాయ । తే । పశుऽపతే । యాని । చక్షూంషి । తే । భవ ।
త్వచే । రూపాయ । సమ్ऽదృశే । ప్రతీచీనాయ । తే । నమః
॥ 5 ॥

అనువాదం :

ఓ పశుపతీ! నీ ముఖమునకు నమస్కారం
ఓ భవ! నీ నయనములకు నమస్కారం
నీ చర్మమునకు, నీ రూపమునకు నమస్కారం
ప్రత్యగాత్మ రూపి అయిన నీకు నమస్కారం ॥ 5 ॥

మంత్రము :

అఙ్గేభ్యస్త ఉదరాయ జిహ్వాయా ఆస్యాऽయ తే ।
దద్భ్యో గన్ధాయ తే నమః ॥ 6 ॥

పదము

అఙ్గేభ్యః । తే । ఉదరాయ । జిహ్వాయై । ఆస్యాఽయ । తే ।
దత్ఽభ్యః । గన్ధాయ । తే । నమః ॥ 6 ॥

అనువాదం :

నీ అంగములకు నమస్కారం
నీ ఉదరమునకు నమస్కారం
నీ జిహ్వకు నమస్కారం
నీ నోటికి నమస్కారం
నీ దంతములకు నమస్కారం,
నీ ఘ్రాణములకు నమస్కారం ॥ 6 ।

మంత్రము :

అస్త్రా నీలశిఖణ్డేన సహస్రాక్షేణ వాజినా ।
రుద్రేణార్ధకఘాతినా తేన మా సమరామహి ॥ 7 ॥

పదము

అస్త్రా । నీలఽశిఖణ్డేన । సహస్రఽఅక్షేణ । వాజినా ।
రుద్రేణ । అర్ధకఽఘాతినా । తేన । మా । సమ్ । అరామహి ॥ 7 ॥

అనువాదం :

క్షేప్త అయిన, నీల శిఖండి అయిన,
సహస్రాక్షు డైన, వేగవంతు డైన
సేనార్ధ విధ్వంసకు డైన, ప్రసిద్ధు డైన
రుద్రునితో మేము సంగతులము కాకుందుము గాక ! ॥ 7 ॥

మంత్రము :

స నో భవః పరి వృణక్తు విశ్వత

ఆప ఇవాగ్నిః పరి వృణక్తు నో భవః ।

మా నోఽభి మాంస్త నమో అస్త్వస్మై ॥ 8 ॥

పదము

సః । నః । భవః । పరి । వృణక్తు । విశ్వతః ।

ఆపఃఽఇవ । అగ్నిః । పరి । వృణక్తు । నః । భవః ।

మా । నః । అభి । మాంస్త । నమః । అస్తు । అస్మై ॥ 8 ॥

అనువాదం

అట్టి భవుడు మమ్ములను సర్వోపద్రవజాతము నుంచి
దూరం చేయు గాక !
మండుతున్న అగ్ని ఉదకములను
పరిత్యజించునట్లు మమ్ములను భవుడు పరిత్యజించు గాక !
మమ్ములను బాధించకుండు గాక !
ఈ భవునకు నమస్కారం ॥ 8 ॥

మంత్రము :

చతు ర్నమో అష్టకృత్వో భవాయ

దశ కృత్వః పశుపతే నమస్తే ।

తవేమే పఞ్చ పశవో విభక్తా

గావో అశ్వాః పురుషా అజావయః ॥ 9 ॥

పదము,

చతుః। నమః। అష్టఽకృత్వః। భవాయ।

దశ। కృత్వః। పశుపతే। నమః। తే।

తవ। ఇమే। పఞ్చ। పశవః। విఽభక్తాః।

గావః। అశ్వాః। పురుషాః। అజఽఅవయః ॥ 8 ॥

అనువాదం:

శర్వునకు నాల్గు సార్లు నమస్కారం
భవునకు ఎనిమిది సార్లు నమస్కారం
ఓ పశుపతీ! నీకు పది సార్లు నమస్కరిస్తున్నాను
వక్ష్యమాణము లైన, భిన్న జతులకు చెందిన,
నీకు స్వభూతము లైన గోవులు, అశ్వములు, పురుషులు,
అజావయములు మొదలైన పశువులన్నింటినీ
నీవు సంరక్షించు. ॥ 9 ॥

మంత్రము:

తవ చతస్రః ప్రదిశ స్తవ ద్యౌ స్తవ

పృథివీ తవేద ముగ్రో ర్వ1న్తరిక్షమ్।



తవేదం సర్వ మాత్మన్వద్

యత్ ప్రాణత్ పృథివీ మను ॥ 10 ॥

పదము :

తవ । చతస్రః । ప్రఽదిశః । తవ । ద్యౌః । తవ ।

పృథివీ । తవ । ఇదమ్ । ఉగ్ర । ఉరు । అన్తరిక్షమ్ ।

తవ । ఇదమ్ । సర్వమ్ । ఆత్మన్ఽవత్ ।

యత్ । ప్రాణత్ । పృథివీమ్ । అను ॥ 10 ॥

అనువాదం :

ఓ ఉగ్రుడైన రుద్రుడా! చతుస్సంఖ్యాకము లైన
ప్రధాన దిక్కులు నీకు చెందినవి
స్వర్గలోకం కూడా నీ వశంలోనే ఉన్నది
భూలోకం నీది ఈ పరిదృశ్యమాన మైన
విశాల ఆకాశ మంతా నీదే!
ఈ విధంగా దిగ్వలయాన్ని, లోకత్రయాన్ని వ్యాపించి
అవస్థితుడవై ఉన్న నీకు
ఈ పరిదృశ్యమాన మైన సర్వ శరీరజాతము స్వభూత మైనది
పృథివిని అనుసరించి ఏ ప్రాణన వ్యాపారం
కొనసాగుతున్నదో అదంతా నీ ఆజ్ఞతో నడుస్తున్నదే. ॥ 10 ॥

మంత్రము

ఉరుః కోశో వసుధాన స్తవాయం
యస్మి న్నిమా విశ్వా భువనా న్యన్తః ।
స నో మృడ పశుపతే నమస్తే

పరః క్రోష్టారో అభిభాః శ్వానః
పరో యన్త్వఘరుదో వికేశ్యః ॥ 11 ॥

పదము

ఉరుః । కోశః । వసుఽధానః । తవ । అయమ్ ।
యస్మిన్ । ఇమా । విశ్వా । భువనాని । అన్తః ।
సః । నః । మృడ । పశుఽపతే । నమః । తే ।
పరః । క్రోష్టారః । అభిఽభాః । శ్వానః ।
పరః । యన్తు । అఘఽరుదః । విఽకేశ్యః ॥ 11 ॥

అనువాదం :

ఓ పశుపతీ! విస్తార మైన పుణ్యపాప కర్మల
నిధాన మైన కోశము నీకు చెందినదే
అండ కటాహాత్మక మైన ఉరుకోశ మధ్యంలో
ఈ పరిదృశ్యమానము లైన సర్వ విశ్వభువనములు
భూతజాతములు ఉన్నవి
నీవు మమ్ములను సుఖపెట్టుటకై నీకు నమస్కరిస్తున్నాము
నీ అనుగ్రహం వల్ల అభిభవించి నటువంటి
క్రోశన శీలము లైన సృగాలములు, శ్వానములు
మా నుంచి దూరంగా వెళ్ళిపోవు గాక!
అమంగళకరంగా రోదనం చేసే
వికీర్ణ కేశము లైన పిశాచములు దూరంగా వెళ్ళిపోవు గాక!
॥ 11 ॥

మంత్రము :

ధను ర్బిభర్షి హరితం హిరణ్యయం

సహస్రఘ్ని శతవధం శిఖణ్డిన్ ।

రుద్రస్యేషు శ్చరతి దేవహేతి-

స్తస్యై నమో యతమస్యాం దిశీతః ॥ 12 ॥

పదము :

ధనుః । బిభర్షి । హరితమ్ । హిరణ్యయమ్ ।

సహస్రఽఘ్ని । శతఽవధమ్ । శిఖణ్డిన్ ।

రుద్రస్య । ఇషుః । చరతి । దేవఽహేతిః ।

తస్యై । నమః । యతమస్యామ్ । దిశి । ఇతః ॥ 12 ॥

అనువాదం :

ఓ రుద్రా ! ప్రళయకాలంలో విశ్వ సంహారకార్థమై
ధనుస్సును ధరిస్తున్నావు
ఆ ధనుస్సు స్వర్ణమయ మైనది
వేలాది మందిని ఒక సారే చంపునది
శతసంఖ్యాక ప్రాణి జాతమునకు మారక మైనది
మయూర పింఛాది నిర్మిత మైన శిఖండములతో కూడినది
అలాంటి నీ ధనుస్సునకు నమస్కారం,
రోదించే దేవుని బాణం
సర్వత్రా నిర్నిరోధంగా తిరుగుతున్నది

అది దేవతల ఖడ్గము
ఆ బాణమునకు నమస్కారం
ఈ మా స్థానం నుంది అద ఏ దిశలో ఉన్నా
ఆ దిశకు నమస్కారం ॥ 12 ॥

మంత్రము

యో౽భియాతో నిలయతే
త్వాం రుద్ర నిచికీర్షతి ।
పశ్చా దనుప్రయుఙ్క్షే తం
విద్ధస్య పదనీరివ ॥ 13 ॥

పదము

యః । అభిఽయాతః । నిఽలయతే ।
త్వామ్ । రుద్ర । నిఽచికీర్షతి ।
పశ్చాత్ । అనుఽప్రయుఙ్క్షే । తమ్ ।
విద్ధస్య । పదనీఃఽఇవ ॥ 13 ॥

అనువాదం :

ఓ రుద్రా ! ఏ పురుషు డైనా
నీ కెదురు వచ్చి పారిపోతాడు
నిన్ను హింసించడానికి ఇచ్ఛగిస్తాడు
ఓ దేవా ! ఆ అపకారి అయిన వానికి
వెనువెంటనే నీవు ప్రత్యపకారం చేస్తావు

శత్రుహతు లైన పురుషుని అడుగుజాడలను బట్టి
వెళ్ళి శత్రువున్నచోట దాగిన వానిని
పట్టుకుని ప్రతీకారం చేస్తారు కదా! ॥ 13 ॥

మంత్రము॥

భవారుద్రౌ సయుజా సంవిదానా-

వుభా వుగ్రౌ చరతో వీర్యా౨య ।

తాభ్యాం నమో యతమస్యాం దిశీతః ॥ 14 ॥

పదము

భవారుద్రౌ । స౨యుజా । సమ్౨విదానౌ ।

ఉభౌ । ఉగ్రౌ । చరతః । వీర్యా౨య ।

తాభ్యామ్ । నమః । యతమస్యామ్ । దిశి । ఇతః ॥ 14 ॥

అనువాదం :

ఓ భవారుద్రులారా! మిత్రభూతులు,
సమాన మనస్కులు అయిన వారిద్దరు
ఉగ్రులై పరాక్రమించుటకై సంచరిస్తున్నారు
వారికి నమస్కారం మీ అవాసస్థానం నుంచి ఏ దిశలో
వారుంటారో అదిక్కులో నున్న వారికి నమస్కారం ॥ 14 ॥

మంత్రము

నమస్తే౨స్త్వాయతే నమో అస్తు పరాయతే ।

నమస్తే రుద్ర తిష్ఠత

ఆసీనాయోత తే నమః ॥ 15 ॥

పదము :

నమః । తే । అస్తు । ఆఽయతే ।

నమః । అస్తు । పరాఽయతే ।

నమః । తే । రుద్ర । తిష్ఠతే ।

ఆసీనాయ । ఉత । తే । నమః ॥ 15 ॥

అనువాదం :

ఓ రుద్రా! మాకు అభిముఖంగా వస్తున్న నీకు నమస్కారం
మాకు పరాఙ్ముఖుడవై వెడుతున్న నీకు నమస్కారం
అలా కాక ఆగమన పరాగమనములను వదలి
ఎక్కడైనా ఉన్నప్పటికీ నీకు నమస్కారం
స్వస్థానంలో ఆసీనుడవై ఉన్న నీకు నమస్కారం ॥ 15 ॥

మంత్రము

నమః సాయం నమః ప్రాత-
ర్నమో రాత్ర్యా నమో దివా ।
భవాయ చ శర్వాయ
చోభాభ్యా మకరం నమః ॥ 16 ॥

పదము :

నమః । సాయమ్ । నమః । ప్రాతః ।

నమః । రాత్ర్యా । నమః । దివా ।

భవాయ । చ । శర్వాయ । చ ।

ఉభాభ్యామ్ । అకరమ్ । నమః ॥ 16 ॥

అనువాదం :

ఓ రుద్రా ! సాయంకాలం నీకు నమస్కారం
ప్రాతఃకాలంలో నీకు నమస్కారం
అలాగే రాత్రి సమయంలో నీకు నమస్కారం
పగలు నీకు నమస్కారం
భవునకు నమస్కారం
శర్వునకు నమస్కారం
పరస్పరానురాగంతో సంయుక్తులై ఉన్న
ఆ ఇరువురకు నమస్కారం ॥ 16 ॥

మంత్రము

సహస్రాక్ష మతిపశ్యం పురస్తాద్
రుద్ర మస్యన్తం బహుధా విపశ్చితమ్ ।
మోపారామ జిహ్వయేయమానమ్ ॥ 17 ॥

పదము :

సహస్రఽఅక్షమ్ । అతిఽపశ్యమ్ । పురస్తాత్ ।
రుద్రమ్ । అస్యన్తమ్ । బహుఽధా । విపఃఽచితమ్ ।
మా । ఉప । అరామ । జిహ్వయా । ఈయమానమ్ ॥ 17 ॥

అనువాదం

వేయి కళ్ళతో ఎదుటి వానిని దాటి
అతిశయ దృష్టిని బరపే పూర్వదిశలో
బహుప్రకారంగా శరజాలాన్ని గుప్పించే మేధావి
జిహ్వాగ్రంతో సర్వజగత్తును వ్యాపించువాడు
అయిన రుద్రునకు సమీపంగా మేము వెళ్ళము ॥ 17 ॥

మంత్రము

శ్యావాశ్వం కృష్ణ మసితం మృణన్తం
భీమం రథం కేశినః పాదయన్తమ్ ।
పూర్వే ప్రతీమో నమో అస్త్వస్మై ॥ 18 ॥

పదము,

శ్యావఽఅశ్వమ్ । కృష్ణమ్ । అసితమ్ । మృణన్తమ్ ।
భీమమ్ । రథమ్ । కేశినః । పాదయన్తమ్ ।
పూర్వే । ప్రతి । ఇమః । నమః । అస్తు । అస్మై ॥ 18 ॥

అనువాదం:

కపిశవర్ణము లైన అశ్వములు కలవాడు, కృష్ణవర్ణుడు,
సితేతర పరిచ్ఛదమును హింసించువాడు,
భీముడు, 'కేశి' అను అసురుని రథమును
విరుగగొట్టి నేలపై పడవేయువాడు అయిన ఈ రుద్రుని
ఇతరుల కంటె వేరుగా మేము గ్రహిస్తున్నాము.
ఆ రుద్రునకు నమస్కారం. ॥ 18 ॥

మంత్రము

మా నోఽభి స్రా మత్యం దేవహేతిం

మా నః క్రుధః పశుపతే నమస్తే ।

అన్యత్రాస్మద్ దివ్యాం శాఖాం వి ధూను ॥ 19 ॥

పదము :

మా । నః । అభి । స్రాః । మత్యఽమ్ । దేవఽహేతిమ్ ।

మా । నః । క్రుధః । పశుఽపతే । నమః । తే ।

అన్యత్ర । అస్మత్ । దివ్యామ్ । శాఖామ్ । వి । ధూను ॥ 19 ॥

అనువాదం :

ఓ రుద్రా ! దేవహేతిని
మర్త్యులైన జనాన్ని అభిలక్షించి వేయ వద్దు
ఓ పశుపతీ ! మాపై కోపపడ వద్దు
నీకు నమస్కారం
మా నుండి వేఱొక చోటుకు
దివ్యమై, శాఖావంత మైన దేవహేతిని విసరు ॥ 19 ॥

మంత్రము

మా నో హింసీ రధి నో బ్రూహి

పరి ణో వృఙ్గ్ధి మా క్రుధః ।

మా త్వయా సమరామహి ॥ 20 ॥

పదము

మా । నః । హింసీః । అధి । నః । బ్రూహి ।

పరి । నః । వృఙ్ధి । మా । క్రుధః ।

మా । త్వయా । సమ్ । అరామహి ॥ 20 ॥

అనువాదం ।

ఓ రుద్రా! మమ్ములను హింసించ వద్దు
మమ్ములను గూర్చి గొప్పగానే చెప్పు
మమ్ములను నీ ఆయుధానికి గురిచేయకు మా పై కోపించకు
ఇలాంటి నీతో మేము సంగతులము కాము ॥ 20 ॥

మంత్రము :

మా నో గోషు పురుషేషు

మా గృధో నో అజావిషు ।

అన్యత్రోగ్ర వి వర్తయ

పియారూణాం ప్రజాం జహి ॥ 21 ॥

పదము :

మా । నః । గోషు । పురుషేషు ।

మా । గృధః । నః । అజ౨అవిషు ।

అన్యత్ర । ఉగ్ర । వి । వర్తయ ।

పియారూణామ్ । ప్ర౨జామ్ । జహి ॥ 21 ॥

అనువాదం :

ఓ రుద్రా ! మాకు సంబంధించిన గోవులను,
పురుషులను హింసించవలెనని తలపెట్టకు
మా మేకలను, గొర్రెలను చంప తలపెట్టకు
ఓ ఉగ్రా ! నీ హేతిని మా కంటె ఇతర మైన
చోటు ఉన్న శత్రుసంతానంపై పడవేయి
దేవ హింసకు లైన వారిని చంపు ॥ 21 ॥

మంత్రము

యస్య తక్మా కాసికా హేతి రేక-
మశ్వస్యేవ వృషణః క్రన్ద ఏతి ।
అభిపూర్వం నిర్ణయతే నమో అస్త్వస్మై ॥ 22 ॥

పదము

యస్య । తక్మా । కాసికా । హేతిః । ఏకమ్ ।
అశ్వస్యఽఇవ । వృషణః । క్రన్దః । ఏతి ।
అభిఽపూర్వమ్ । నిఃఽనయతే । నమః । అస్తు । అస్మై ॥ 22 ॥

అనువాదం

జ్వర, కాసరోగాది పీడ ఏ రుద్రుని హనన సాధనమై
అపకారి అయిన పురుషునిపై
గుర్రం సకిలించినట్లుగా పడుతుందో,
ఆ హేతి వచ్చిన వానని వచ్చినట్లుగా
నిశ్శేషంగా నాశనం చెందించు గాక !
అలాంటి రుద్రునకు నమస్కారం ॥ 22 ॥

మంత్రము:

యో౨న్తరిక్షే తిష్ఠతి విష్టభితో౨-

యజ్వనః ప్రమృణన్ దేవపీయూన్ ।

తస్మై నమో దశభిః శక్వరీభిః ॥ 23 ॥

పదము:

యః । అన్తరిక్షే । తిష్ఠతి । వి౨స్తభితః ।

అయజ్వనః । ప్ర౨మృణన్ । దేవ౨పీయూన్ ।

తస్మై । నమః । దశ౨భిః । శక్వరీభిః ॥ 23 ॥

అనువాదం:

ఏ రుద్రుడు అంతరిక్షంలో నిరుద్ధగతియై ఉంటాడో,
యాగాది కర్మలకు దూరులైన,
దేవహింసకులైన జనాన్ని పూర్తిగా
ధ్వంసం చేస్తాడో, ఆ రుద్రునకు
పది వ్రేళ్ళతోనూ నమస్కరిస్తున్నాను ॥ 23 ॥

మంత్రము:

తుభ్య మారణ్యాః పశవో మృగా వనే

హితా హంసాః సుపర్ణాః శకునా వయాంసి ।

తవ యక్షం పశుపతే అప్స్వ౧న్త-

స్తుభ్యం క్షరన్తి దివ్యా ఆపో వృధే ॥ 24 ॥

పదము ।

తుభ్యమ్ । అరణ్యాః । పశవః । మృగాః । వనే ।

హితాః । హంసాః । సుఽపర్ణాః । శకునాః । వయాంసి ।

తవ । యక్షమ్ । పశుఽపతే । అప్ఽసు । అన్తః ।

తుభ్యమ్ । క్షరన్తి । దివ్యాః । ఆపః । వృధే ॥ 24 ॥

అనువాదం :

ఓ పశుపతీ! నీకై అరణ్యభవము లైన
పశువులను ఇస్తున్నాము వాటిని స్వీకరించు *
అరణ్యంలో విధాత సృష్టించి వదలిన
హరిణ, శార్దూల, సింహాదులు అరణ్య పశువులు
అలాగే హంసలు, డేగలు ఇతర వనచరు లైన
పక్షులు - వీని నన్నిటినీ ఓ రుద్రా! నీ భాగంగా ఇస్తున్నాము
నీ పూజ్య స్వరూపాన్ని, ఉదకమధ్యంలో
ఉన్న దానిని అభిషేకించుటకై
దివ్యము లైన ఉదకములు ప్రవహిస్తున్నవి
వానిని కూడా ఏమీ చేయ వద్దు ॥ 24 ॥

మంత్రము :

శింశుమారా అజగరాః పురీకయా

జషా మత్స్యా రజసా యేభ్యో అస్యసి ।

న తే దూరం న పరిష్ఠాస్తి తే

* గ్రామీణ పశువుల జోలికి పోవద్దని తాత్పర్యము

భవ సద్యః సర్వాన్ పరి పశ్యసి

భూమిం పూర్వస్మా ద్ధం స్యుత్తరస్మిన్ సముద్రే ॥ 25 ॥

పదము

శింశుమారాః । అజగరాః । పురీకయాః ।

జషాః । మత్స్యాః । రజసాః । యేభ్యః । అస్యసి ।

న । తే । దూరమ్ । న । పరిఽస్థా । అస్తి । తే ।

భవ । సద్యః । సర్వాన్ । పరి । పశ్యసి ।

భూమిమ్ । పూర్వస్మాత్ । హంసి । ఉత్తరస్మిన్ । సముద్రే ॥ 25 ॥

అనువాదం :

ఒక రకమైన మొసళ్ళు, అజగరములనే
సర్ప విశేషములు, పురీకయాది
జలచరములు మొదలగునవి ఓ రుద్రా! నీ కోసమై ఉన్నవి.
నీవు ఆత్మీయ తేజస్సుతో వాటిపై ఆయుధాన్ని ప్రయోగించు
ఓ భవా! సర్వగతుడ వైన నీకు దూర మన్నది లేదు.
నిన్ను వదలి ఉన్న ప్రజ కూడా లేదు
ఒక క్షణంలో సర్వభూమిని పరికించగలవు
పూర్వోవర్తి అయిన ( తూర్పున ఉన్న )
సముద్రం నుంచి ఉత్తరమున ఉన్న సముద్రం లోనికి
ఒక క్షణంలో వెళ్ళిపోగలవు ॥ 25 ॥

మంత్రము :

మా నో రుద్ర తక్మనా మా విషేణ

మా నః సం స్రా దివ్యేనాగ్నినా ।

అన్యత్రాస్మద్ విద్యుతం పాతయైతామ్ ॥ 26 ॥

పదము :

మా । నః । రుద్ర । తక్మనా । మా । విషేణ ।

మా । నః । సమ్ । స్రాః । దివ్యేన । అగ్నినా ।

అన్యత్ర । అస్మత్ । విఽద్యుతమ్ । పాతయ । ఏతామ్ ॥ 26 ॥

అనువాదం :

ఓ రుద్రా ! జ్వరాది రోగములతో మమ్ములను
స్పృశించ వద్దు విషంతో స్పృశించ వద్దు
అలాగే దివోభవ మైన విద్యుద్రూప మైన
అగ్నితో మమ్ములను స్పృశించ వద్దు
మమ్ములను వదలి వేరుగా నున్న
అరణ్య పశ్వాదులపై విద్యుద్రూప మైన
ఆయుధ భూత మైన పిడుగును ఎడవేయి ॥ 26 ॥

మంత్రము :

భవో దివో భవ ఈశే పృథివ్యా

భవ ఆ పప్ర ఉర్వ1న్తరిక్షమ్ ।

తస్మై నమో యతమస్యాం దిశీ3తః ॥ 27 ॥

పదము :

భవః । దివః । భవః । ఈశే । పృథివ్యాః ।

భవః । ఆ । పప్రే । ఉరు । అన్తరిక్షమ్ ।

తస్మై । నమః । యతమస్యామ్ । దిశి । ఇతః ॥ 27 ॥

అనువాదం :

భవుడు ద్యులోకానికి ఈశ్వరుడు
ఆ భవుడు భూలోకమునకు ప్రభువే
విశాల మైన అంతరిక్షలోకాన్ని ఆయనే
స్వతేజస్సుతో పూరింప జేస్తున్నాడు ఆయనకు నమస్కారం.
ఆయన ఇక్కడ నుంచి ఏ దిక్కులో ఉన్నప్పటికీ
ఆ దిశకు నమస్కారం ॥ 27 ॥

మంత్రము :

భవ రాజన్ యజమానాయ మృడ

పశూనాం హి పశుపతి ర్బభూథ ।

యః శ్రద్దధాతి సన్తి దేవా ఇతి

చతుష్పదే ద్విపదేఽస్య మృడ ॥ 28 ॥

పదము :

భవ । రాజన్ । యజమానాయ । మృడ ।

పశూనామ్ । హి । పశుఽపతిః । బభూథ ।

యః । శత్ఽదధాతి । సన్తి । దేవాః । ఇతి ।

చతుఃఽపదీ । ద్విఽపదీ । అస్య । మృడ ॥ 28 ॥

అనువాదం

ఓ రాజా! భవా! ఈ యాగం చేస్తున్న యజమానుని
సుఖం కోసం, నీవు పశుపతివి అవుతున్నావు
అయన దేవతలు రక్షకులుగా ఉన్నారని నమ్ముతున్నాడు
అట్టి యజమానుని చతుష్పాదు లైన గవాశ్వాదులకు
ద్విపాత్తు లైన పుత్ర భృత్యాదులకు
సుఖాన్ని ప్రసాదించు ॥ 28 ॥

మంత్రము ః

మా నో మహాన్త ముత మా నో అర్భకం
మా నో వహన్త ముత మా నో వక్ష్యతః ।
మా నో హింసీః పితరం మాతరం చ
స్వాం తన్వఽం రుద్ర మా రీరిషో నః ॥ 29 ॥

పదము

మా । నః । మహాన్తమ్ । ఉత । మా । నః । అర్భకమ్ ।
మా । నః । వహన్తమ్ । ఉత । మా । నః । వక్ష్యతః ।
మా । నః । హింసీః । పితరమ్ । మాతరమ్ । చ ।
స్వామ్ । తన్వఽమ్ । రుద్ర । మా । రిరిషః । నః ॥ 29 ॥

**అనువాదం**

ఓ రుద్రా! మాలోని పెద్దను (వృద్ధుని) హింసించ వద్దు
అలాగే మా శిశువును హింసించ వద్దు
మాకు సంబంధించిన భారం మోసే
మధ్యమ వయస్కుని కూడా హింసించ వద్దు
మాలో పనిచేస్తున్న వారిని ఎవరినీ హింసించ వద్దు
మా తల్లిని, తండ్రిని హింసించ వద్దు
మా శరీరాన్ని హింసించ వద్దు ॥ 29 ॥

**మంత్రము :**

రుద్ర స్యైలబకారేభ్యోఽ సంసూక్తగిలేభ్యః ।
ఇదం మహాస్యేభ్యః శ్వభ్యో అకరం నమః ॥ 30 ॥

**పదము :**

రుద్రస్య । ఐలబఽకారేభ్యః । అసంసూక్తఽగిలేభ్యః ।
ఇదమ్ । మహాఽఆస్యేభ్యః । శ్వఽభ్యః । అకరమ్ । నమః ॥30॥

**అనువాదం :**

రుద్రుని ప్రమథగణమునకు నమస్కరిస్తున్నాను
అమంగళ వచనాలను పలికే రుద్రగణములకు నమస్కారం
మహాస్యము లైన శునకములకు నమస్కారం ॥ 30 ॥

**మంత్రము :**

నమస్తే ఘోషిణీభ్యో నమస్తే కేశినీభ్యః
నమో నమస్కృతాభ్యో నమః సంభుఞ్జతీభ్యః ।

నమస్తే దేవ సేనాభ్యః

స్వస్తి నో అభయం చ నః ॥ 31 ॥

పదము :

నమః । తే । ఘోషిణీభ్యః । నమః । తే । కేశినీభ్యః ।

నమః । నమఃఒకృతాభ్యః । నమః । సమ్ఒభుఞ్జతీభ్యః ।

నమః । తే । దేవ । సేనాభ్యః ।

స్వస్తి । నః । అభయమ్ । చ । నః ॥ 31 ॥

అనువాదం :

ఓ రుద్రా ! ఘోషించే నీ సేనలకు నమస్కారం
విపరీతాకృతి కేశయుక్తు లైన సేనలకు నమస్కారం
చండీశ్వరాదులకు కూడా నమస్కారం
సహభోజనం చేస్తున్న సేనలకు నమస్కారం
ఓ రుద్రా ! దీనికి వ్యతిరేకంగా ఉన్న
సేనలకు కూడా నమస్కారం
మాకు క్షేమము కలుగు గాక !
భయరాహిత్యం కూడా కలుగు గాక ! ॥ 31 ॥

ఇది రెండవ సూక్తం

ఇది మొదటి అనువాకం

## అనువాకం - 2

### సూక్తం - 3

ఋషి: అథర్వుడు ॥ దేవత బార్హస్పత్యోదనము ॥ ఛందస్సు: 1,14 ఆసురీ గాయత్రీ 2 త్రిపదా సమవిషమా గాయత్రీ 3,6,10 ఆసురీ పంక్తి 4,8 సామ్న్యనుష్టుప్, 5 13 15,25 సామ్న్యుష్ణిక్ 7,19-22 ప్రాజాపత్యానుష్టుప్ 9,17,18 ఆసుర్యనుష్టుప్ 11 భురిగార్చ్యనుష్టుప్: 12 యాజుషీ జగతీ 16,23 ఆసురీ బృహతీ 24 త్రిపదా ప్రాజాపత్యా బృహతీ: 26 ఆర్చ్యుష్ణిక్: 27,28 సామ్నీ బృహతీ 29 భురిక్ సామ్నీ బృహతీ 30 యాజుషీ త్రిష్టుప్ 31 అల్పశః పంక్తిరుత యాజుషీ॥ మంత్రములు ॥ 56 ॥

వినియోగం - ఇది అర్థసూక్తం బృహస్పతి సవ మనే సవయజ్ఞంలో హవిరభిమర్శనం, సంపాతం దాతృవాచన దానం ఇత్యాదులలో దీనికి వినియోగం

అభిచార కర్మలో సవవిధానంతో ఓదనాన్ని పక్వం చేసి పృషాతకంతో (క్షీరఘృత సమ్మిశ్రణం) తడిపి ఈ అర్థసూక్తంతో అభిమర్శించి, సంపాతించి, అభిమంత్రించి ద్వేషికి ఇవ్వవలెను

ద్వేషిని ఈ అర్థసూక్తంతో అభిమర్శించడమో, హుతాజ్యశేషంతో సంపాతం చేయడమో చేయాలి అది కానపుడు ఓదన ప్రాశనాన్ని గురించి తర్వాత చెప్తారు ఆ ఓదనానికి శిరః ప్రభృతి అంగాలను కల్పిస్తారు

మంత్రము

**తస్యౌదనస్య బృహస్పతిః శిరో బ్రహ్మ ముఖమ్ ।**

పదము :

**తస్య । ఓదనస్య । బృహస్పతిః । శిరః । బ్రహ్మ । ముఖమ్ ॥1॥**

**అనువాదం**

ఆ ఓదనమునకు బృహస్పతి శిరస్సు బ్రహ్మ ముఖము ॥1॥

**మంత్రము:**

ద్యావాపృథివీ శ్రోత్రే సూర్యాచన్ద్రమసా-
వక్షిణీ సప్త ఋషయః ప్రాణాపానాః ॥ 2 ॥

**పదము:**

ద్యావాపృథివీ ఇతి । శ్రోత్రే ఇతి । సూర్యాచన్ద్రమసౌ ।
అక్షిణీ ఇతి । సప్త ఋషయః । ప్రాణాపానాః ॥ 2 ॥

**అనువాదం:**

ద్యావా పృథ్వులు ఈ ఓదనమునకు కర్ణములు
సూర్య చంద్రులు చక్షువులు
సప్తర్షులు ప్రాణాపానములు ॥ 2 ॥

**మంత్రము:**

చక్షు ర్ముసలం కామ ఉలూఖలమ్ ॥ 3 ॥

**పదము:**

చక్షుః । ముసలమ్ । కామః । ఉలూఖలమ్ ॥ 3 ॥

**అనువాదం:**

రోకలి దీనికి నేత్రము రోలు కామన ॥ 3 ॥

**మంత్రము:**

దితిః శూర్ప మదితిః శూర్పగ్రాహీ వాతోఽపావినక్ ॥ 4 ॥

పదము:

దితిః । శూర్పమ్ । అదితిః । శూర్పఽగ్రాహీ ।

వాతః । అప । అవినక్ ॥ 4 ॥

అనువాదం:

దితి చేట. అదితి చేటను పట్టుకొని చెరిగే ఆమె

వాయువు ధాన్యం నుండి తండులములను

వేరుచేయువాడు ॥ 4 ॥

మంత్రము:

అశ్వాః కణా గావ స్తణ్డులా మశకా స్తుషాః ॥ 5 ॥

పదము:

అశ్వాః । కణాః । గావః । తణ్డులాః । మశకాః । తుషాః ॥ 5 ॥

అనువాదం

దాని కణములు అశ్వములు

తండులములు గోవులు

పొట్టు మశకములు ॥ 5 ॥

మంత్రము

కబ్రు ఫలీకరణాః శరోఽభ్రమ్ ॥ 6 ॥

పదము:

కబ్రు । ఫలీఽకరణాః । శరః । అభ్రమ్ ॥ 6 ॥

అనువాదం

ఫలీకరణములు *కల్రులు మేఘము శిరస్సు ॥ 6 ॥

మంత్రము :

శ్యామ మయో౽స్య మాంసాని

లోహిత మస్య లోహితమ్ ॥ 7 ॥

పదము

శ్యామమ్ । అయః । అస్య । మాంసాని ।

లోహితమ్ । అస్య । లోహితమ్ ॥ 7 ॥

అనువాదం :

శ్యామ వర్ణమైన ఇనుప పనిముట్లు
ఈ ఓదనమునకు మాంసములు
లోహిత వర్ణమైన లోహం ఈ ఓదనమునకు రక్తము ॥7॥

మంత్రము

త్రపు భస్మ హరితం వర్ణః

పుష్కర మస్య గన్ధః ॥ 8 ॥

పదము

త్రపు । భస్మ । హరితమ్ । వర్ణః ।

పుష్కరమ్ । అస్య । గన్ధః ॥ 8 ॥

---

(తల, కనుబొమ్మలు వేరుగా లేని ప్రాణిజాతము)

అనువాదం :

ఓదనం పక్వం చేయగా మిగిలే బూడిద సీసము
బంగారం ఈ ఓదనమునకు వర్ణము
ఈ ఓదన గంధం కమలము ॥ 8 ॥

మంత్రము

ఖలః పాత్రం స్ఫ్యావంసా వీషే అనూక్యే౽ ॥ 9 ॥

పదము :

ఖలః । పాత్రమ్ । స్ఫ్యౌ । అంసౌ । ఈషే ఇతి । అనూక్యేఇతి ॥9॥

అనువాదం :

కళ్ళం దీనికి పాత్రం
బండిలో ధాన్యానికి ఆధారంగా ఉండే
భాగములు ఈ ఓదనమునకు
భుజమధ్యంలో ఉండే భాగములు ॥ 9 ॥

మంత్రము :

ఆన్త్రాణి జత్రవో గుదా వరత్రాః ॥ 10 ॥

పదము :

ఆన్త్రాణి । జత్రవః । గుదాః । వరత్రాః ॥ 10 ॥

అనువాదం :

ప్రేగులు, బండికి ఎద్దులను కట్టే పగ్గాలు
అన్నరస సంచారణార్థమై సర్వప్రాణి శరీర లలో
ఉండే గుదములు ఈ ఓదనశకట లాంగలములకు
కట్టే చర్మవికార రజ్జువులు ॥ 10 ॥

మంత్రము :

ఇయ మేవ పృథివీ కుమ్భీ భవతి
రాధ్యమాన స్యౌదనస్య ద్యౌ రపిధానమ్ ॥ 11 ॥

పదము :

ఇయమ్ । ఏవ । పృథివీ । కుమ్భీ । భవతి ।
రాధ్యమానస్య । ఓదనస్య । ద్యౌః । అపిఽధానమ్ ॥ 11 ॥

అనువాదం :

ఈ పృథివి పచ్యమాన మౌతున్న ఓదనమునకు
పాకార్థ మైన స్థాలిగా ఉన్నది
ద్యులోకం దానికి మూత పెట్టే పాత్ర ॥ 11 ॥

మంత్రము :

సీతాః పర్శవః సికతా ఊబధ్యమ్ ॥ 12 ॥

పదము :

సీతాః । పర్శవః । సికతాః । ఊబధ్యమ్ ॥ 12 ॥

అనువాదం :

నాగేటి చాళ్ళు ఈ ఓదనమునకు పార్శ్వాస్థులు
నదులలో ఉన్న ఇసుక ఉదరంలోని భాగం ॥ 12 ॥

మంత్రము

ఋతం హస్తావనేజనం కుల్యోఽపసేచనమ్ ॥ 13 ॥

పదము

ఋతమ్ । హస్త౽అవనేజనమ్। కుల్యా౽ । ఉప౽సేచనమ్ ॥13॥

అనువాదం

లోకంలో ఉన్న ఉదక మంతా
ఈ ఓదనం తిన్నవాని హస్తప్రక్షాళనార్థ మైనది
చిన్నకాలువలలోని సమస్త జలం
ఈ ఓదనమునకు మిశ్రమసాధనము ॥ 13 ॥

మంత్రము :

ఋచా కుమ్భ్యధిహి తార్త్విజ్యేన ప్రేషితా ॥ 14 ॥

పదము :

ఋచా । కుమ్భీ । అధి౽హితా । ఆర్త్విజ్యేన । ప్ర౽ఇషితా ॥14॥

అనువాదం :

ఓదన పాకార్థ మైన స్థాలి
ఋగ్వేదంతో అగ్నిపై ఉంచబడినది
ఋత్విజులు యజుర్వేదంతో
ప్రేషితు లైన వారు ॥ 14 ॥

మంత్రము

బ్రహ్మణా పరిగృహీతా సామ్నా పర్యూఢా ॥ 15 ॥

పదము

బ్రహ్మణా । పరి౽గృహీతా । సామ్నా । పరి౽ఊఢా ॥ 15 ॥

అనువాదం:

బ్రహ్మవేదంతో ( అథర్వవేదంతో ) పరిగృహీతమై,
సామవేదంతో ఇది ( నిప్పులతో ) పరివేష్టిత మైనది ॥ 15 ॥

మంత్రము

బృహ ద్దాయవనం రథన్తరం దర్వీః ॥ 16 ॥

పదము :

బృహత్ । ఆఽయవనమ్ । రథమ్ఽతరమ్ । దర్వీః ॥ 16 ॥

అనువాదం

సామం నీటిలో పోసిన బియ్యాన్ని కలిపే తెడ్డు
రథన్తరసామ దర్వి ( కొయ్యగరిటె ) ॥ 16 ॥

మంత్రము

ఋతవః పక్తార ఆర్తవాః సమిన్ధతే ॥ 17 ॥

పదము :

ఋతవః । పక్తారః । ఆర్తవాః । సమ్ । ఇన్ధతే ॥ 17 ॥

అనువాదం :

వసంతాదు లైన ఆరు ఋతువులు
ఓదనమునకు పాచకులు
ఋతుసంబంధ మైన అహోరాత్రులు
అగ్నిని సందీపనం చేస్తారు ॥ 17 ॥

మంత్రము :

చరుం పఞ్చబిల ముఖం ఘర్మో౽భీన్ధే ॥ 17 ॥

పదము

చరుమ్ । పళ్ఛ౽బిలమ్ । ఉఖమ్ । ఘర్మః । అభి । ఇన్ధే ॥ 18 ॥

అనువాదం

ఆ ఓదన పాకార్థ మైన పాత్రను
తీవ్రంగా ఆదిత్యుడు తపింప జేస్తాడు ॥ 18 ॥

మంత్రము

ఓదనేన యజ్ఞవచః సర్వే లోకాః సమాప్యాః ॥ 19 ॥

పదము

ఓదనేన । యజ్ఞ౽వచః । సర్వే । లోకాః । సమ్౽అప్యాః ॥ 19 ॥

అనువాదం:

ఇలా పక్వ మైన ఓదనంతో
యజ్ఞోక్తము లైన సర్వ లోకములు ప్రాపింప దగినవి ॥19॥

మంత్రము:

యస్మి న్త్సముద్రో ద్యౌ ర్భూమి
స్త్రయో౽వరపరం శ్రితాః ॥ 20 ॥

పదము

యస్మిన్ । సముద్రః । ద్యౌః ।

భూమిః । త్రయః । అవర౽పరమ్ । శ్రితాః ॥ 20 ॥

అనువాదం :

ఈ ఓదనంలో సముద్రము, ఆకాశము, భూమి-
ఈ మూడు ఒకదాని క్రింద ఒకటిగా ఉండునవి ॥ 20 ॥

మంత్రము

యస్య దేవా అకల్ప న్తోచ్ఛిష్టే షడశీతయః ॥ 21 ॥

పదము :

యస్య । దేవాః । అకల్పన్త । ఉత్‌ఽశిష్టే । షట్ । అశీతయః ॥21॥

అనువాదం :

ఈ ఓదనంలో యాగావశిష్ట మైన భాగంతో
ఎనభై ఆరుగురు దేవతలు
సమర్థు లైనారు ( వీర్యవంతు లైనారు ) ॥ 21 ॥

మంత్రము

తం త్వౌదనస్య పృచ్ఛామి ।

యో అస్య మహిమా మహాన్ ॥ 22 ॥

పదము :

తమ్ । త్వా । ఓదనస్య । పృచ్ఛామి ।

యః । అస్య । మహిమా । మహాన్ ॥ 22 ॥

అనువాదం

( శిష్యుని ప్రశ్న ) ఓ గురుదేవా ! ఈ ఓదన మహిమను
చెప్పవలసినదిగా నిన్ను ప్రార్థిస్తున్నాను
దీని మహిమ అధికతర మైనది ( అనంత మైనది ) ॥ 22 ॥

మంత్రము

స య ఓదనస్య మహిమానం విద్యాత్ ॥ 23 ॥

పదము

సః । యః । ఓదనస్య । మహిమానమ్ । విద్యాత్ ॥ 23 ॥

అనువాదం

ఈ గురువునకు ఈ ఓదన మహిమ తెలియును ॥ 23 ॥

మంత్రము

నాల్ప ఇతి బ్రూయా న్నానుపసేచన

ఇతి నేదం చ కిం చేతి ॥ 24 ॥

పదము :

న । అల్పః । ఇతి । బ్రూయాత్ । న ।అనుపఽసేచనః ।

ఇతి । న । ఇదమ్ । చ । కిమ్ । చ । ఇతి ॥ 24 ॥

అనువాదం :

ఉపదేశ సమయంలో ఆ మహిమ అల్ప మని చెప్పకూడదు
ఉపసేచన రహిత మని చెప్పకూడదు.
ఇదిగో ఇది అని చూపించి చెప్పకూడదు.
అనిర్దిష్ట రూపంలో చెప్పకూడదు, ॥ 24 ॥

మంత్రము :

యావద్ దాతాఽభిమనస్యేత తన్నాతి వదేత్ ॥ 25 ॥

పదము

యావత్ । దాతా । అభిఽమనస్యేత । తత్ । న । అతి । వదేత్

॥ 25 ॥

అనువాదం

దాత ఎంత బలాన్ని ఇచ్ఛగించినాడో
దానిని మించి చెప్పకూడదు ॥ 25 ॥

మంత్రము ॥

బ్రహ్మవాదినో వదన్తి పరాఞ్చ-
మోదనం ప్రాశీః ప్రత్యఞ్చా౩ మితి ॥ 26 ॥

పదము

బ్రహ్మఽవాదినః । వదన్తి పరాఞ్చమ్ ।
ఓదనమ్ । ప్ర । ఆశీః । ప్రత్యఞ్చా౩మ్ । ఇతి ॥ 26 ॥

అనువాదం

బ్రహ్మవాదులు సమావేశమై పరస్పరం-
సంభాషించుకుంటున్నారు
ఓ దేవదత్తా! పరాఙ్ముఖంగా ఉన్న
ఈ ఓదనమును తిన్నావు
ఆత్మాభిముఖంగా ఉన్న ఓదనాన్ని కూడా తిన్నావు ॥ 26 ॥

మంత్రము

త్వ మోదనం ప్రాశీ స్త్వ మోదనా౩ ఇతి ॥ 27 ॥

పదము :

**త్వమ్ । ఓదనమ్ । ప్ర । ఆశీః । త్వామ్ । ఓదనాః । ఇతి ॥27॥**

అనువాదం

నీవు ఓదనమును తిన్నవాడ వైనావు
నిన్ను ఆ ఓదనం తిన్నది ॥ 27 ॥

మంత్రము :

పరాఞ్చం చైనం ప్రాశీః ప్రాణా-
స్త్వా హాస్యన్తీ త్యేన మాహ ॥ 28 ॥

పదము

పరాఞ్చమ్ । చ । ఏనమ్ । ప్రఽఆశీః । ప్రాణాః ।
త్వా । హాస్యన్తి । ఇతి । ఏనమ్ । ఆహ ॥ 28 ॥

అనువాదం

పరాఙ్ముఖంగా ఉన్న ఓదనమును భుజించినట్లయితే
ప్రాణవాయువులు నిన్ను త్యజిస్తాయని
అతనికి విద్వాంసుడు తెలియజెప్పవలెను ॥ 28 ॥

మంత్రము

ప్రత్యఞ్చం చైనం ప్రాశీ రపానా-
స్త్వా హాస్యన్తీ త్యేన మాహ ॥ 29 ॥

పదము

ప్రత్యఞ్చమ్ । చ । ఏనమ్ । ప్ర౽ఆశీః । అపానాః ।
త్వా । హాస్యన్తి । ఇతి । ఏనమ్ । ఆహ ॥ 29 ॥

అనువాదం,

'ప్రత్యఙ్ముఖ మైన ఓదనాన్ని తిన్నావంటే
నిన్ను అపానవాయు వృత్తులు త్యజించ గలవు'
అని అభిజ్ఞులు ఆ భోక్తకు చెప్పవలెను ॥ 29 ॥

మంత్రము :

నైవాహ మోదనం న మా మోదనః ॥ 30 ॥

పదము :

న । ఏవ । అహమ్ । ఓదనమ్ । న । మామ్ । ఓదనః ॥ 30 ॥

అనువాదం :

నేనీ ఓదనాన్ని భుజించను
ఆ ఓదనం నన్ను భుజించదు ॥ 30 ॥

మంత్రము

ఓదన ఏవౌదనం ప్రాశీత్ ॥ 31 ॥

పదము :

ఓదనః । ఏవ । ఓదనమ్ । ప్ర । ఆశీత్ ॥ 31 ॥

అనువాదం :

ఓదనమే కర్త
తన్ను తానే భుజిస్తుంది ॥ 31 ॥

మంత్రము:

తత శ్చైన మన్యేన శీర్ష్ణా ప్రాశీ-

ర్యేన చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।

జ్యేష్ఠత స్తే ప్రజా మరిష్యతీ త్యేన మాహ ।

తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।

బృహస్పతినా శీర్ష్ణా ।

తేనైనం ప్రాశిషం తేనైన మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః

సర్వపరుః సర్వతనూః ।

సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః

సం భవతి య ఏవం వేద ॥ 32 ॥

పదము.

తతః । చ । ఏనమ్ । అన్యేన । శీర్ష్ణా । ప్ర౽ఆశీః ।

యేన । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్ర౽అశ్నన్ ।

జ్యేష్ఠతః । తే । ప్ర౽జా । మరిష్యతి । ఇతి । ఏనమ్ । అహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।

వ । ప్రత్యఞ్చమ్ । బృహస్పతినా । శీర్ష్ణా ।

తేన । ఏనమ్ । ప్ర । అశిషమ్ । తేన । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వ౨అఙ్గః । సర్వ౨పరుః । సర్వ౨తనూః ।

సర్వ౨అఙ్గః । ఏవ । సర్వ౨పరుః । సర్వ౨తనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 32 ॥

అనువాదం :

పూర్వ ఋషులు శిరస్సుతో ఈ ఓదనాన్ని భుజించినారు.
అందువల్ల ఇంకొక శిరస్సుతో
'ఈ ఓదనాన్ని నీవు భుజించినట్లయితే
నీ సంతానం పెద్దవారు మొదలుకొని వరుసగా
మరణిస్తారని' అతనికి అభిజ్ఞులు చెప్పినారు.
అలాంటి ఓదనాన్ని నేను అవాఙ్ముఖుడనై భుజింపను.
పరాఙ్ముఖుడనై కూడా భుజింపను.
అత్మాభిముఖుడనై కూడా భుజింపను.
బృహస్పత్యాత్మ అయిన శీర్షంతో ఓదనాన్ని భుజించినాను.
అదే శిరస్సుతో ఈ ఓదనాన్ని
పోవలసిన చోటుకు పంపించినాను. నే నిలా భుజించినాను.
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సంపూర్ణ శరీర మైనది.
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని
తెలుసుకుంటాడో అతను సర్వాంగత్వాది
ఫలాన్ని పొంది పుణ్యభూత మైన
స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు. ॥ 32 ॥

మంత్రము :

తత శ్చైన మన్యాభ్యాం శ్రోత్రాభ్యాం ప్రాశీ

ర్యాభ్యాం చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।

బధిరో భవిష్యసీత్యేన మాహ ।

తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।

ద్యావాపృథివీభ్యాం శ్రోత్రాభ్యామ్ ।

తాభ్యా మేనం ప్రాశిషం తాభ్యా మేన మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః

సర్వపరుః సర్వతనూః ।

సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః

సం భవతి య ఏవం వేద ॥ 33 ॥

పదము :

తతః । చ । ఏనమ్ । అన్యాభ్యామ్ । శ్రోత్రాభ్యామ్ । ప్రఽఆశీః ।

యాభ్యామ్ । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఅశ్నన్ ।

బధిరః । భవిష్యసి । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ ।
న । పరాఞ్చమ్ । న । ప్రత్యఞ్చమ్ ।
ద్యావాపృథివీభ్యామ్ । శ్రోత్రాభ్యామ్ ।
తాభ్యామ్ । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ ।
తాభ్యామ్ । ఏనమ్ । అజీగమమ్ ।
ఏషః । వై । ఓదనః । సర్వ౽అఙ్గః ।
సర్వ౽పరుః । సర్వ౽తనూః ।
సర్వ౽అఙ్గః । ఏవ । సర్వ౽పరుః । సర్వ౽తనూః ।
సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 33 ॥

అనువాదం:

ఏ చెవులతో మొదటి ఋషులు
ఈ ఓదనాన్ని భుజించినారో
అలా కాక ఇతర లౌకిక కర్ణములతో
దీనిని భుజిస్తే నీవు బధిరుడ వౌతావు_
అని ఆ తిన్నవానికి అభిజ్ఞులు చెప్తారు.
నేను అలాంటి ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను.
పరాఙ్ముఖుడనై భుజింపను.
ఆత్మాభిముఖుడనై భుజింపను.
ద్యావాపృథువులు ఈ ఓదనమునకు శ్రోత్రములు
వాటితోనే దీనిని భుజించినాను.

వాటితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటుకు పంపించినాను.
నే నిలా భుజించినాను.
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధి సముపేత మైనది. సంపూర్ణ శరీర మైనది.
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది,
పుణ్యభూత మైన స్వర్గాద లోకంలో ఉద్భవిస్తాడు. ॥ 33 ॥

మంత్రము :

తత శ్చైన మన్యాభ్యా మక్షీభ్యాం ప్రాశీ
ర్యాభ్యాం చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
అన్ధో భవిష్యసీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం
న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।
సూర్యాచన్ద్రమసాభ్యా మక్షీభ్యామ్ ।
తాభ్యా మేనం ప్రాశిషం తాభ్యా మేన మజీగమమ్ ।
ఏష వా ఓదనః సర్వాఙ్గః
సర్వపరుః సర్వతనూః ।
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 34 ॥

పదము :

తతః । చ । ఏనమ్ । అన్యాభ్యామ్ । అక్షిభ్యామ్ । ప్రఽఆశీః ।

యాభ్యామ్ । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఆశ్నన్ ।

అన్ధః । భవిష్యసి । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ ।

న । పరాఞ్చమ్ । న । ప్రత్యఞ్చమ్ ।

సూర్యాచన్ద్రమసాభ్యామ్ । అక్షిభ్యామ్ ।

తాభ్యామ్ । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ ।

సమ్ ।

.అఙ్గః ।

సర్వఽపరుః । సర్వఽతనూః ।

సర్వఽఅఙ్గః । ఏవ । సర్వఽపరుః । సర్వఽతనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 34 ॥

అనువాదం :

ఏ చక్షువులతో పూర్వ ఋషులు
ఈ ఓదనమును భుజించినారో,
వాటితో కాక ఇతరములైన చక్షువులతో
ఈ ఓదనమును భుజించినట్లయితే

అంధుడ వౌతా వని అభిజ్ఞులు అన్నారు.
అలాంటి ఓదనాన్ని నేను అవాఙ్ముఖుడనై భుజింపను.
పరాఙ్ముఖుడనై భుజింపను.
సూర్యచంద్రుల రూప మైన కనులతో
ఈ అన్నాన్ని భుజించినాను.
వాటితోనే ఈ ఓదనాన్ని
పోవలసిన చోటికి పంపించినాను.
నే నిలా భుజించినాను.
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధి సముపేత మైనది.
సంపూర్ణ శరీర మైనది.
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది,
పుణ్యభూత మైన స్వర్గాదిలోకంలో ఉద్భవిస్తాడు. ॥ 34 ॥

మంత్రము :

తత శ్చైన మన్యేన ముఖేన ప్రాశీ
ర్యేన చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
ముఖత స్తే ప్రజా మరిష్యతీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం
న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।
బ్రహ్మణా ముఖేన ।
తేనైనం ప్రాశిషం తేనైన మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః
సర్వపరుః సర్వతనూః ।
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 35 ॥

పదము ।

తతః । చ । ఏనమ్ । అన్యేన । ముఖేన । ప్ర౨ఆశీః ।
యేన । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్ర౨ఆశ్నన్ ।
ముఖతః । తే । ప్ర౨జా । మరిష్యతి । ఇతి । ఏనమ్ । ఆహ ।
తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ ।
న । పరాఞ్చమ్ । న । ప్రత్యఞ్చమ్ ।
బ్రహ్మణా । ముఖేన । తేన । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ ।
తేన । ఏనమ్ । అజీగమమ్ ।
ఏషః । వై । ఓదనః । సర్వ౨అఙ్గః ।
సర్వ౨పరుః । సర్వ౨తనూః ।
సర్వ౨అఙ్గః । ఏవ । సర్వ౨పరుః । సర్వ౨తనూః ।
సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 35 ॥

**అనువాదం :**

ఈ ఓదనాన్ని బ్రహ్మాత్మక మైన ముఖంతో
పూర్వ ఋషులు భుజించినారు.
మరొక ముఖంతో దీనిని భుజించినట్లైతే
'నీకు చెందిన సంతానం నశిస్తుం'దని
భుజించిన వానికి అభిజ్ఞులు చెప్తారు.
దానిని నేను అవాఙ్ముఖుడనై భుజింపను.
పరాఙ్ముఖుడనై భుజింపను.
ఆత్మాభిముఖుడనై భుజింపను
ఆ బ్రహ్మముఖంతోనే నేను ఈ ఓదనాన్ని భుజించినాను.
దానితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటికి పంపించినాను.
నే నిలా భుజించినాను.
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధిసముపేత మైనది.
సంపూర్ణ శరీర మైనది.
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది,
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు. ॥ 35 ॥

**మంత్రము :**

తత శ్చైన మన్యయా జిహ్వయా ప్రాశీ
ర్యయా చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
జిహ్వా తే మరిష్యతీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।
అగ్నే ర్జిహ్వయా ।
తయైనం ప్రాశిషం తయైన మజీగమమ్ ।
ఏష వా ఓదనః సర్వాఙ్గః
సర్వపరుః సర్వతనూః ।
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 36 ॥

పదము :

తతః । చ । ఏనమ్ । అన్యయా । జిహ్వయా । ప్రఽఆశీః ।
యయా । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఆశ్నన్ ।
జిహ్వా । తే । మరిష్యతి । ఇతి । ఏనమ్ । ఆహ ।
తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ ।
న । పరాఞ్చమ్ । న । ప్రత్యఞ్చమ్ ।
అగ్నేః । జిహ్వయా । తయా । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ ।
తయా । ఏనమ్ । అజీగమమ్ ।
ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।

సర్వ౨పరుః । సర్వ౨తనూః ।

సర్వ౨అఙ్గః । ఏవ । సర్వ౨పరుః । సర్వ౨తనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 36 ॥

అనువాదం :

ఏ జిహ్వాతో పూర్వ ఋషులు
ఈ ఓదనాన్ని భుజించినారో, దానిని
అన్యజిహ్వాతో నీవు భుజించినట్లయితే
నీ జిహ్వ ప్రాణత్యాగం చేస్తుంది.
దానిని నేను అవాఙ్ముఖుడనై భుజింపను.
పరాఙ్ముఖుడనై భుజింపను.
ఆత్మాభిముఖుడనై భుజింపను.
అగ్ని అవయవభూత మైన జిహ్వాతో
ఈ ఓదనాన్ని నేను భుజించినాను.
దానితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటికి పంపించినాను.
నే నిలా భుజించినాను.
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధిసముపేత మైనది.
సంపూర్ణ శరీర మైనది.
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉత్పన్ను డౌతాడు. ॥36॥

మంత్రము :

తత శ్చైన మన్యై ర్దన్తైః ప్రాశీ

ర్యై శ్చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।

దన్తా స్తే శత్స్యన్తీ త్యేన మాహ ।

తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ॥

ఋతుభి ర్దన్తైః ।

తై రేనం ప్రాశిషం తై రేన మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః

సర్వపరుః సర్వతనూః

సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః

సం భవతి య ఏవం వేద ॥ 37 ॥

పదము :

తతః । చ । ఏనమ్ । అన్యైః । దన్తైః । ప్రఽఆశీః ।

యైః । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఆశ్నన్ ।

దన్తాః । తే । శత్స్యన్తి । ఇతి । ఏనమ్ । ఆహ ।

**తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।**

**న । ప్రత్యఞ్చమ్ । ఋతుఽభిః । దన్తైః ।**

**తైః । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ । తైః । ఏనమ్ । అజీగమమ్ ।**

**ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।**

**సర్వఽపరుః । సర్వఽతనూః ।**

**సర్వఽఅఙ్గః । ఏవ । సర్వఽపరుః । సర్వఽతనూః ।**

**సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 37 ॥**

అనువాదం :

ఏ దంతములతో ఈ ఓదనాన్ని
పూర్వ ఋషులు తిన్నారో
వానితో కాక ఇతర దంతములతో
దానిని తిన్న వాని దంతములు
విశీర్ణములై రాలిపోగలవని అభిజ్ఞులు చెప్పినారు,
దానిని నేను అవాఙ్ముఖుడనై భుజింపను.
పరాఙ్ముఖుడనై భుజింపను.
ఆత్మాభిముఖుడనై భుజింపను.
వసంతాది ఋతువుల దంతములతో
ఈ ఓదనాన్ని భుజించినాను.
వాటితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటికి పంపించినాను.
నే నిలా భుజించినాను.
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధి సముపేత మైనది.

సంపూర్ణ శరీర మైనది.
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది,
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు. ॥ 37 ॥

మంత్రము :

తత శ్చైన మన్యైః ప్రాణాపానైః ప్రాశీ-
ర్యై శ్చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
ప్రాణాపానా స్త్వా హాస్యన్తీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం
న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।
సప్తర్షిభిః ప్రాణాపానైః ।
తై రేనం ప్రాశిషం తై రేన మజీగమమ్ ।
ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః ।
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః ।
సం భవతి య ఏవం వేద ॥ 38 ॥

పదము :

తతః । చ । ఏనమ్ । అన్యైః । ప్రాణాపానైః । ప్రఽఆశీః ।
యైః । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఆశ్నన్ ।

ప్రాణాపానాః । త్వా । హాస్యన్తి । ఇతి । ఏనమ్ । ఆహ ।
తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।
న । ప్రత్యఞ్చమ్ । సప్తర్షిఽభిః । ప్రాణాపానైః ।
తైః । ఏనమ్ । ప్ర । అశిషమ్ । తైః । ఏనమ్ । అజీగమమ్ ।
ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।
సర్వఽపరుః । సర్వఽతనూః ।
సర్వఽఅఙ్గః । ఏవ । సర్వఽపరుః । సర్వఽతనూః ।
సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 38 ॥

**అనువాదం :**

ఏ ప్రాణాపానములతో ఈ ఓదనాన్ని
పూర్వ ఋషులు భుజించినారో,
దానితో కాక తదన్యములతో దీనిని
భుజించినట్లయితే ప్రాణాపానములు
ఎగిరిపోగల వని అభిజ్ఞులు చెప్పినారు.
నేను ఈ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను.
పరాఙ్ముఖుడనై భుజింపను.
ఆత్మాభిముఖుడనై భుజింపను.
సప్తర్షుల రూప మైన ప్రాణాపానములతోనే
నేను ఈ ఓదనాన్ని భుజించినాను.
వాటితోనే దీనిని పోవలసిన చోటికి పంపించినాను.
నే నిలా భుజించినాను.

ఈ ఓదనం సర్వావయవోపేత మైనది
సర్వావయవ సంధి సముపేత మైనది సంపూర్ణ శరీరమైనది,
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు ॥ ३८ ॥

మంత్రము

తత శ్చైన మన్యేన వ్యచసా ప్రాశీ-

ర్యేన చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।

రాజయక్ష్మ స్త్వా హనిష్యతీ త్యేన మాహ ।

తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।

అన్తరిక్షేణ వ్యచసా ।

తేనై నం ప్రాశిషం తేనై న మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః ।

సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః

సం భవతి య ఏవం వేద ॥ ३९ ॥

పదము

తతః । చ । ఏనమ్ । అన్యేన । వ్యచసా । ప్రఽఆశీః ।

యేన । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఅశ్నన్ ।

రాజఽయక్ష్మః । త్వా । హనిష్యతి । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।

న । ప్రత్యఞ్చమ్ । అన్తరిక్షేణ । వ్యచసా ।

తేన । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ । తేన । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।

సర్వఽపరుః । సర్వఽతనూః ।

సర్వఽఅఙ్గః । ఏవ । సర్వఽపరుః । సర్వఽతనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 39 ॥

అనువాదం

'ఏ కృత్స్న శరీరవర్తి యైన దానితో
ఈ ఓదనాన్ని పూర్వఋషులు భుజించినారో,
అలా కాక మరొకదానితో ఈ ఓదనాన్ని భుజించినట్లయితే,
నిన్ను రాజయక్ష్మ (క్షయరోగం) చంపుతుంది' అని
అభిజ్ఞులు చెప్పినారు
నేను ఈ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను
పరాఙ్ముఖుడనై భుజింపను
అత్మాభిముఖుడనై భుజింపను
సర్వశరీరవర్తి అయిన దానితో నే నీ ఓదనాన్ని భుజించినాను
దానితోనే దీనిని పోవలసిన చోటికి పంపించినాను
నే నిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది

సర్వావయవ సంధి సముపేత మైనది
సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాదిలోకంలో ఉద్భవిస్తాడు ॥ 39 ॥

మంత్రము :

తత శ్చైన మన్యేన పృష్ఠేన ప్రాశీ-
ర్యేన చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
విద్యుత్ త్వా హనిష్యతీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం న పరాఞ్చం
న ప్రత్యఞ్చమ్ । దివా పృష్ఠేన ।
తేనైనం ప్రాశిషం తేనైన మజీగమమ్ ।
ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 40 ॥

పదము

తతః । చ । ఏనమ్ । అన్యేన । పృష్ఠేన । ప్రఽఆశీః ।
యేన । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఆశ్నన్ ।

విఽద్యుత్ । త్వా । హనిష్యతి । ఇతి । ఏనమ్ । ఆహ ।
తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।
న । ప్రత్యఞ్చమ్ । దివా । పృష్ఠేన । తేన । ఏనమ్ ।
ప్ర । అశిషమ్ । తేన । ఏనమ్ । అజీగమమ్ ।
ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।
సర్వఽపరుః । సర్వఽతనూః ।
సర్వఽఅఙ్గః । ఏవ । సర్వఽపరుః । సర్వఽతనూః ।
సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 40 ॥

**అనువాదం :**

'ద్యులోకాత్మక మైన ఏ పృష్ఠంతో
ఈ ఓదనాన్ని పూర్వఋషులు భుజించినారో
దానికి భిన్న మైన పృష్ఠంతో మీ రీ ఓదనాన్ని తిన్నట్లయితే
విద్యుత్తు నిన్ను చంపగలదు ' అని అభిజ్ఞులు చెప్పినారు
దానిని నేను అవాఙ్ముఖుడనై భుజించను
పరాఙ్ముఖుడనై భుజించను
ఆత్మాభిముఖుడనై కూడా భుజించను.
ద్యులోకాత్మక మైన పృష్ఠంతోనే
నే నీ ఓదనాన్ని భుజించినాను
దానితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటికి పంపించినాను
నే నిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది

సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా
ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అటు సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు ॥ 40 ॥

మంత్రము

తత శ్చైన మన్యే నోరసా ప్రాశీ-
ర్యేన చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
కృష్యా న రాత్స్యసి త్యేన మాహ ॥
తం వా అహం నార్వాఞ్చం
న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।
పృథివ్యోరసా ।
తేనైనం ప్రాశిషం తేనైన మజీగమమ్ ।
ఏష వా ఓదనః సర్వాఙ్గః
సర్వపరుః సర్వతనూః ।
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 41 ॥

పదము :

తతః । చ । ఏనమ్ । అన్యేన । ఉరసా । ప్ర౽ఆశీః ।

యేన । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్ర౽ఆశ్నన్ ।

జ్యేష్ఠః । న । రాత్స్యసి । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ ।

న । పరాఞ్చమ్ । న । ప్రత్యఞ్చమ్ ।

పృథివ్యా । ఉరసా । తేన । ఏనమ్ । ప్ర । అశిషమ్ ।

తేన । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వ౽అఙ్గః ।

సర్వ౽పరుః । సర్వ౽తనూః ।

సర్వ౽అఙ్గః । ఏవ । సర్వ౽పరుః । సర్వ౽తనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 41 ॥

అనువాదం

ఏ వక్షోభాగంతో పూర్వఋషులు దీనిని ఉన్నారో,
దానితో కాక మరొక వక్షస్సుతో దీనిని తిన్నట్లయితే
నీవు వ్యవసాయం చేసిన వ్రీహి యవాది సస్యములు
సమృద్ధం కావు-అని అభిజ్ఞులు వానితో చెప్పినారు
నేను ఈ ఓదనాన్ని అభిముఖుడనై భుజింపను
పరాఙ్ముఖుడనై భుజింపను

పృథివ్యాత్మక మైన ఉరస్సుతో దీనిని నేను తిన్నాను
దానితోనే దీనిని పోవలసిన చోటికి పంపించినాను
నే నిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధిసముపేతి మైనది
సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాదిలోకంలో ఉద్భవిస్తాడు ॥ 41 ॥

మంత్రము

తత శ్చైన మన్యే నోదరేణ ప్రాశీ-
ర్యేన చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
ఉదరదార స్త్వా హనిష్యతీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం
న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ । సత్యేనోదరేణ ।
తేనైనం ప్రాశిషం తేనైన మజీగమమ్ ।
ఏష వా ఓదనః సర్వాఙ్గః
సర్వపరుః సర్వతనూః ।
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 42 ॥

తతః । చ । ఏనమ్ । అన్యేన । ఉదరేణ । ప్ర౭అశీః ।

యేన । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్ర౭అశ్నన్ ।

ఉదర౭దారః । త్వా । హనిష్యతి । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।

న । ప్రత్యఞ్చమ్ । సత్యేన । ఉదరేణ ।

తేన । ఏనమ్ । ప్ర । అశిషమ్ । తేన । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వ౭అఙ్గః ।

సర్వ౭పరుః । సర్వ౭తనూః

సర్వ౭అఙ్గః । ఏవ । సర్వ౭పరుః । సర్వ౭తనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 42 ॥

అనువాదం।

పూర్వఋషులు ఏ ఉదరంతో దీనిని తిన్నారో,
దానితో కాక మరొక దానితో తిన్నట్లయితే
అతిసార రోగంతో నిన్నది చంపుతుంది-అని
అభిజ్ఞులు వానికి చెప్పినారు
నే నీ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను
పరాఙ్ముఖుడనై భుజింపను
ఆత్మాభిముఖుడనై భుజింపను
సత్య మైన ఉదరంతో ఈ ఓదనాన్ని నేను భుజించినాను

దానితోనే దీనిని వోవలసిన చోటికి పంపించినాను
నే నిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది
సర్వావయవ సంఘసముపేత మైనది సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని
తెలుసుకుంటాడో, అతను సర్వాంగత్వాది
ఫలాన్ని పొంది, పుణ్యభూత మైన
స్వర్గాదిలోకంలో ఉద్భవిస్తాడు ॥ 42 ॥

మంత్రము

తత శ్చైన మన్యేన వస్తినా ప్రాశీ-
ర్యేన చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
అప్సు మరిష్యసీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం

।

గమమ్ ।

న్నాః

॥ 43 ॥

పదము

తతః । చ । ఏనమ్ । అన్యేన । వస్తినా । ప్ర౽అశీః ।

యేన । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్ర౽అశ్నన్ ।

అప్౽సు । మరిష్యసి । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।

న । ప్రత్యఞ్చమ్ । సముద్రేణ । వస్తినా ।

తేన । ఏనమ్ । ప్ర । అశిషమ్ । తేన । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వ౽అఙ్గః ।

సర్వ౽పరుః । సర్వ౽తనూః ।

సర్వ౽అఙ్గః । ఏవ । సర్వ౽పరుః । సర్వ౽తనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 43 ॥

అనువాదం:

ఏ వస్తి (మూత్రాశయం)తో పూర్వ ఋషులు
దీనిని తిన్నారో, దానితో కాక వేరొక దానితో
తిన్నట్లయితే నీవు నీళ్ళలో పడి చనిపోతావు-అని
ఆ తిన్నవానికి అభిజ్ఞులు చెప్తారు
నేను ఈ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను,
పరాఙ్ముఖుడనై భుజింపను,
ఆత్మాభిముఖుడనై భుజింపను

సముద్రాత్మక మైన ఆత్మీయ వస్తితో నేను దానిని తిన్నాను.
దానితోనే ఆ ఓదనాన్ని పోవలసిన చోటికి పంపించినాను.
నే నిలా భుజించినాను.
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధి సముపేత మైనది.
సంపూర్ణ శరీర మైనది.
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని
తెలుసుకుంటాడో, అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది,
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు. ॥ 43 ॥

మంత్రము:

తత శ్చైన మన్యాభ్యా మూరుభ్యాం ప్రాశీ-
ర్యాభ్యాం చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
ఊరూ తే మరిష్యత ఇత్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।
మిత్రావరుణయో రూరుభ్యామ్ ।
తాభ్యా మేనం ప్రాశిషం తాభ్యా మేన మజీగమమ్ ।
ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః ।
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 44 ॥

పదము

తతః । చ । ఏనమ్ । అన్యాభ్యామ్ । ఊరుఽభ్యామ్ । ప్రఽఆశీః।

యాభ్యామ్ । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఆశ్నన్ ।

ఊరూ ఇతి । తే । మరిష్యతః । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।

న । ప్రత్యఞ్చమ్ । మిత్రావరుణయోః । ఊరుఽభ్యామ్ ।

తాభ్యామ్ । ఏనమ్ । ప్ర । అశిషమ్ ।

తాభ్యామ్ । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।

సర్వఽపరుః । సర్వఽతనూః ।

సర్వఽఅఙ్గః । ఏవ । సర్వఽపరుః । సర్వఽతనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 44 ॥

అనువాదం ।

ఏ ఊరువులతో పూర్వ ఋషులు దీనిని తిన్నారో,
వాటితో కాక మరొక వాటితో తిన్నట్లయితే
ఆ ఊరువులు గతప్రాణము లౌతాయని
ఆ తిన్నవానికి అభిజ్ఞులు చెప్పినారు
నేనీ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను,
పరాఙ్ముఖుడనై భుజింపను అత్యాభిముఖుడనై భుజింపను.

మిత్రావరుణుల ఊగున్నులతో దీనిని నేను భుజించినాను
వాటితోనే నేనీ ఓదనాన్ని పోవలసిన చోటుకు పంపినాను
నేనిలా భుజించినాను
ఈ ఓదనం సర్వాంగయుక్తోపేత మైనది
సర్వావయువ సంధి సముపేత మైనది
సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగిత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు ॥ 44 ॥

మంత్రము

తత శ్చైన మన్యాభ్యా మక్షీవద్భ్యాం ప్రాశీ

ర్యాభ్యాం చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।

ప్రాణమో భవిష్యసీ త్యేన మాహ ।

తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।

త్వష్టు రక్షీవద్భ్యామ్ । తాభ్యా మేనం

ప్రాశిషం తాభ్యా మేన మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః

సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః

సం భవతి య ఏవం వేద ॥ 45 ॥

పదము

తతః । చ । ఏనమ్ । అన్యాభ్యామ్ ।

అష్ఠీవత్ఽభ్యామ్ । ప్రఽఆశీః ।

యాభ్యామ్ । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఅశ్నన్ ।

స్రామః । భవిష్యసి । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ ।

న । పరాఞ్చమ్ । న । ప్రత్యఞ్చమ్ ।

త్వష్టుః । అష్ఠీవత్ఽభ్యామ్ ।

తాభ్యామ్ । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ ।

తాభ్యామ్ । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।

సర్వఽపరుః । సర్వఽతనూః ।

సర్వఽఅఙ్గః । ఏవ । సర్వఽపరుః । సర్వఽతనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 45 ॥

అనువాదం :

ఏ మోకాళ్ళతో పూర్వ ఋషులు ఈ ఓదనాన్ని భుజించినారో అలాకాక వేరొక విధంగా భుజించినట్లయితే

శుష్కజంఘుడ వౌతా వని అభిజ్ఞులు చెప్పినారు
నే నీ ఓదనాన్ని పరాఙ్ముఖుడనై భుజింపను
అవాఙ్ముఖుడనై భుజింపను
ఆత్మాభిముఖుడనై భుజింపను
నేను త్వష్టకు చెందిన జానువులతో ఈ ఓదనాన్ని తిన్నాను
వాటితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటుకు పంపించినాను.
నే నిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధిసముపేత మైనది
సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు ॥ 45 ॥

మంత్రము.

తత శ్చైన మన్యాభ్యాం పాదాభ్యాం ప్రాశీ-
ర్యాభ్యాం చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
బహుచారీ భవిష్యసీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం
న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।
అశ్వినోః పాదాభ్యామ్ ।
తాభ్యా మేనం ప్రాశిషం తాభ్యా మేన మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 46 ॥

పదము

తతః । చ । ఏనమ్ । అన్యాభ్యామ్ । పాదాభ్యామ్ । ప్రఽఆశీః ।
యాభ్యామ్ । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఅశ్నన్ ।
బహుఽచారీ । భవిష్యసి । ఇతి । ఏనమ్ । ఆహ ।
తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।
న । ప్రత్యఞ్చమ్ । అశ్వినోః । పాదాభ్యామ్ ।
తాభ్యామ్ । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ ।
తాభ్యామ్ । ఏనమ్ । అజీగమమ్ ।
ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।
సర్వఽపరుః । సర్వఽతనూః ।
సర్వఽఅఙ్గః । ఏవ । సర్వఽపరుః । సర్వఽతనూః ।
సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద । ॥ 46 ॥

అనువాదం :

వాని క్రింద నున్న ఏ పాదాలతో పూర్వ ఋషులు
దానిని భుజించినారో,
వాటితో కాక మరొక విధంగా భుజిస్తే
దేశద్రిమ్మరి వౌతా వని అభిజ్ఞులు చెప్పినారు
నే నీ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను
పరాఙ్ముఖుడనై భుజింపను
ఆత్మాభిముఖుడనై భుజింపను
అశ్వినీ దేవతలకు చెందిన పాదములతో
నేను దీనిని భుజించినాను
వాటితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటుకు పంపించినాను
నే నిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది
సర్వావయావ సంధిసముపేత మైనది
సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాదిలోకంలో ఉద్భవిస్తాడు ॥ 46 ॥

మంత్రము :

తత శ్చైన మన్యాభ్యాం ప్రపదాభ్యాం ప్రాశీ-
ర్యాభ్యాం చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।
సర్ప స్త్వా హనిష్యతీ త్యేన మాహ ।
తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।
సవితుః ప్రపదాభ్యామ్ ।
తాభ్యా మేనం ప్రాశిషం తాభ్యా మేన మజీగమమ్ ।
ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః ।
సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః
సం భవతి య ఏవం వేద ॥ 47 ॥

పదము

తతః । చ । ఏనమ్ । అన్యాభ్యామ్ ।
ప్రఽపదాభ్యామ్ । ప్రఽఆశీః ।
యాభ్యామ్ । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఅశ్నన్ ।
సర్పాః । త్వా । హనిష్యతి । ఇతి । ఏనమ్ । ఆహ ।
తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।
న । ప్రత్యఞ్చమ్ । సవితుః । ప్రఽపదాభ్యామ్।
తాభ్యామ్ । ఏనమ్ । ప్ర । అశిషమ్ ।
తాభ్యామ్ । ఏనమ్ । అజీగమమ్ ।
ఏషః । వై । ఓదనః । సర్వఽఅఙ్గః ।

సర్వ॒ఽపరుః । సర్వ॒ఽతనూః ।

సర్వ॒ఽఅఙ్గః । ఏ॒వ । సర్వ॒ఽపరుః । సర్వ॒ఽతనూః ।

సమ్ । భ॒వ॒తి॒ । యః । ఏవమ్ । వేద ॥ 47 ॥

అనువాదం

దీని ఏ పాదాగ్రములతో పూర్వ ఋషులు తిన్నారో,
అలా కాక వేరొక విధంగా నీవు తింటే
సర్పం నిన్ను కాటువేసి చంపుతుందని
అభిజ్ఞులు వానికి చెప్పినారు.
నేనీ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను
పరాఙ్ముఖుడనై భుజింపను
నేను దీనిని సవితకు చెందిన
పాదాగ్రములతో భుజించినాను
వాటితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటికి పంపించినాను
నేనిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది
సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా ఓదనాన్ని తెలసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది,
పుణ్యభూత మైన స్వర్గాదిలోకంలో ఉద్భవిస్తాడు ॥ 47 ॥

మంత్రము ।

తత శ్చైన మన్యాభ్యాం హస్తాభ్యాం ప్రాశీ-
ర్యాభ్యాం చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।

బ్రాహ్మణం హనిష్యసీ త్యేన మాహ ।

తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।

ఋతస్య హస్తాభ్యామ్ ।

తాభ్యా మేనం ప్రాశిషం తాభ్యా మేన మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః ।

సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః

సం భవతి య ఏవం వేద ॥ 48 ॥

పదము ।

తతః । చ । ఏనమ్ । అన్యాభ్యామ్ । హస్తాభ్యామ్ । ప్రఽఆశీః ।

యాభ్యామ్ । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఆశ్నన్ ।

బ్రాహ్మణమ్ । హనిష్యసి । ఇతి । ఏనమ్ । ఆహ ।

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।

న । ప్రత్యఞ్చమ్ । ఋతస్య । హస్తాభ్యామ్ ।

తాభ్యామ్ । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ ।

తాభ్యామ్ । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వ౽అఙ్గః ।

సర్వ౽పరుః । సర్వ౽తనూః ।

సర్వ౽అఙ్గః । ఏవ । సర్వ౽పరుః । సర్వ౽తనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 48 ॥

**అనువాదం ।**

ఏ ఇతరావయవము లైన చేతులతో
పూర్వ ఋషులు ఈ ఓదనాన్ని తిన్నారో,
వానితో కాక మరొక విధంగా తింటే
నీకు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుందని-
అభిజ్ఞులు వానికి చెప్పినారు
నే నీ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను
పరాఙ్ముఖుడనై భుజింపను
ఆత్మాభిముఖుడనై భుజింపను
బ్రహ్మహస్తములతో నే నీ ఓదనాన్ని భుజించినాను
వానితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటుకు పంపించినాను.
నే నిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది.
సర్వావయవ సంధిసముపేత మైనది
సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా
ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాది లోకంలో ఉద్భవిస్తాడు ॥ 48 ॥

మంత్రము

తత శ్చైన మన్యయా ప్రతిష్ఠయా ప్రాశీ-

ర్యయా చైతం పూర్వ ఋషయః ప్రాశ్నన్ ।

అప్రతిష్ఠానోఽ నాయతనో మరిష్యసీ త్యేన మాహ ।

తం వా అహం నార్వాఞ్చం

న పరాఞ్చం న ప్రత్యఞ్చమ్ ।

సత్యే ప్రతిష్ఠాయ ।

తయైనం ప్రాశిషం తయైన మజీగమమ్ ।

ఏష వా ఓదనః సర్వాఙ్గః సర్వపరుః సర్వతనూః ।

సర్వాఙ్గ ఏవ సర్వపరుః సర్వతనూః

సం భవతి య ఏవం వేద ॥ 49 ॥

పదము

తతః । చ । ఏనమ్ । అన్యయా । ప్రతిఽస్థయా । ప్రఽఆశీః ।

యయా । చ । ఏతమ్ । పూర్వే । ఋషయః । ప్రఽఆశ్నన్ ।

అప్రతిఽస్థానః । అనాయతనః । మరిష్యసి । ఇతి । ఏనమ్ । ఆహ

తమ్ । వై । అహమ్ । న । అర్వాఞ్చమ్ । న । పరాఞ్చమ్ ।

న । ప్రత్యఞ్చమ్ । సత్యే । ప్రతి౽స్థాయ ।

తయా । ఏనమ్ । ప్ర । ఆశిషమ్ ।

తయా । ఏనమ్ । అజీగమమ్ ।

ఏషః । వై । ఓదనః । సర్వ౽అఙ్గః ।

సర్వ౽పరుః । సర్వ౽తనూః ।

సర్వ౽అఙ్గః । ఏవ । సర్వ౽పరుః । సర్వ౽తనూః ।

సమ్ । భవతి । యః । ఏవమ్ । వేద ॥ 49 ॥

అనువాదం

పాదములకు ఆధారభూత మైనది భూమి
ఆ ప్రతిష్ఠాత్మక మైన దానితో
ఈ ఓదనాన్ని పూర్వఋషులు అన్నారు
అలాకాక మరొకవిధంగా నీవు తింటే
ప్రతిష్ఠారహితుడ వౌతా వని-
అభిజ్ఞులు వానికి చెప్పినారు
నే నీ ఓదనాన్ని అవాఙ్ముఖుడనై భుజింపను
పరాఙ్ముఖుడనై భుజింపను ప్రత్యఙ్ముఖుడనై భుజింపను
సత్యబ్రహ్మ ప్రతిష్ఠాత్మక మైన దానితో భుజించినాను
దానితోనే ఈ ఓదనాన్ని పోవలసిన చోటుకు పంపించినాను
నే నిలా భుజించినాను
ఈ ఓదనం సర్వావయవోపేత మైనది
సర్వావయవ సంధిసముపేత మైనది

సంపూర్ణ శరీర మైనది
ఏ పురుషుడు ఈ విధంగా ఈ ఓదనాన్ని తెలుసుకుంటాడో,
అతను సర్వాంగత్వాది ఫలాన్ని పొంది
పుణ్యభూత మైన స్వర్గాదిలోకంలో ఉద్భవిస్తాడు ॥ 49 ॥

మంత్రము

ఏతద్ వై బ్రధ్నస్య విష్టపం య దోదనః ॥ 50 ॥

పదము

ఏతత్ । వై । బ్రధ్నస్య । విష్టపమ్ । యత్ । ఓదనః ॥ 50 ॥

అనువాదం

ఈ ఉక్తమహిమోపేత మైన ఓదనం
సూర్యమండల మధ్యవర్తి అయిన ఈశ్వరుని వంటిది ॥ 50 ॥

మంత్రము

బ్రధ్నలోకో భవతి బ్రధ్నస్య
విష్టపి శ్రయతే య ఏవం వేద ॥ 51 ॥

పదము

బ్రధ్నఽలోకః । భవతి । బ్రధ్నస్య ।
విష్టపి । శ్రయతే । యః । ఏవమ్ । వేద ॥ 51 ॥

అనువాదం

ఆ ఉక్తప్రకార మైన ఓదనం యొక్క
సూర్యమండలాత్మకత్వాన్ని తెలిసినవాడు
సూర్యలోక వర్తి అవుతాడు ॥ 51 ॥

మంత్రము

ఏతస్మాద్ వా ఓదనాత్ త్రయస్త్రింశతం

లోకాన్ ని రమిమీత ప్రజాపతిః ॥ 52 ॥

పదము

ఏతస్మాత్ । వై । ఓదనాత్ । త్రయఃఽత్రింశతమ్ ॥

లోకాన్ । నిః । అమిమీత । ప్రజాఽపతిః ॥ 52 ॥

అనువాదం

ఈ సూర్యాత్మక మైన సర్వ జగదుపాదానభూత మైన
ప్రజాపతి ముప్పదిమూడు లోకాలకు
అధిష్ఠాన దేవత లైన వారిని నియమించినాడు. ॥ 52 ॥

మంత్రము:

తేషాం ప్రజ్ఞానాయ యజ్ఞ మసృజత ॥ 53 ॥

పదము

తేషామ్ । ప్రఽజ్ఞానాయ । యజ్ఞమ్ । అసృజత ॥ 53 ॥

అనువాదం:

వారి ప్రజ్ఞానార్థమై యజ్ఞాన్ని సృష్టించినాడు ॥ 53 ॥

మంత్రము

స య ఏవం విదుష ఉపద్రష్టా

భవతి ప్రాణం రుణద్ధి ॥ 54 ॥

పదము ।

సః । యః । ఏవమ్ । విదుషః । ఉపఽద్రష్టా ।

భవతి । ప్రాణమ్ । రుణద్ధి ॥ 54 ॥

అనువాదం

ఏ పురుషుడైనా ఈ విధంగా
ఉపాసకుని ఉపద్రష్ట అవుతాడో
అతని ప్రాణమును నిరుద్ధగతిగా చేస్తాడు ॥ 54 ॥

మంత్రము ।

న చ ప్రాణం రుణద్ధి సర్వజ్యానిం జీయతే ॥ 55 ॥

పదము:

న । చ । ప్రాణమ్ । రుణద్ధి । సర్వఽజ్యానిమ్ । జీయతే ॥ 55 ॥

అనువాదం ।

అలా ప్రాణాన్ని నిరోధించడమే గాక,
ప్రజా పశ్వాది రూప మైన
సర్వాభీష్టవస్తు జ్ఞానానికి
హాని ఎలా జరుగుతుందో అలా జరుగుతుంది ॥ 55 ॥

మంత్రము ।

న చ సర్వజ్యానిం జీయతే

పురైనం జరసః ప్రాణో జహాతి ॥ 56 ॥

పదము :

న । చ । సర్వఽజ్యానిమ్ । జీయతే ।

పురా । ఏనమ్ । జరసః । ప్రాణః । జహాతి ॥ 56 ॥

అనువాదం :

ఆ సర్వహాని మాత్రమే గాక,
ఆ నిందకుని జరావస్థకు ముందే
ప్రాణం పరిత్యజిస్తుంది ॥ 56 ॥

ఇది మూడవ సూక్తం

## సూక్తం-4

ఋషులు: భార్గవుడు, వైదర్భి॥ దేవత ప్రాణము॥ ఛందస్సు 1 శంకుమత్యనుష్టుప్: 2-7,9-13,16-19,23-25 అనుష్టుప్ 8 పథ్యాపంక్తి 14 నిచృదనుష్టుప్ 15 భురిగనుష్టుప్ 20 అనుష్టుబ్గర్భా త్రిష్టుప్ 21 మధ్యేజ్యోతిర్జగతీ: 22 త్రిష్టుప్ 26 బృహతీగర్భాఽనుష్టుప్॥ మంత్రములు: ॥ 26 ॥

వినియోగం:- ఇది అర్థసూక్తం ఉపనయన కర్మలో మాణవకుని నాభిని స్పృశించి ఆచార్యుడు దీనిని జపిస్తాడు

అలాగే అయుష్కాముడు దీనితో దక్షిణకర్ణంలో అనుమంత్రణం చేస్తాడు

అయుష్కాముడు ఋషహస్తంతో శరీరాన్ని అభిమంత్రిస్తాడు ఇది అయుష్యగణంలోనిది గనుక హోమాలలో దీనికి వినియోగం

అమృతాఖ్య మహాశాంతిలో వ్రీహియవమయ మైన మణిని దీనితో కట్టుకోవాలి

గ్రహయజ్ఞంలో శనైశ్చరునికి చేసే హవిరాజ్యహోమంలో దీనితో సమిదాధానం, ఉపస్థానం చెయ్యాలి

అలాగే శాంత్యర్థ మైన లక్షహోమంలో దీనికి వినియోగం

మంత్రము:

ప్రాణాయ నమో యస్య సర్వ మిదం వశే।

యో భూతః సర్వ స్యేశ్వరో

యస్మి న్త్సర్వం ప్రతిష్ఠితమ్ ॥ 1 ॥

పదము :

ప్రాణాయ । నమః । యస్య । సర్వమ్ । ఇదమ్ । వశే ।

యః । భూతః । సర్వస్య । ఈశ్వరః ।

యస్మిన్ । సర్వమ్ । ప్రతిఽస్థితమ్ ॥ 1 ॥

అనువాదం :

ప్రాణమునకు నమస్కారం.
ఆ ప్రాణమునకు వశమై చరాచరాత్మక
జగత్తు సర్వమూ ఉంటుంది.
ఆ ప్రాణం భూతకాలావచ్ఛిన్న మైన
సర్వ ప్రాణిజాతమునకు ప్రభు వైనది.
ఈ ప్రాణంలో సమస్త జగత్తు ప్రతిష్ఠితమై ఉంటుంది. ॥ 1 ॥

మంత్రము :

నమస్తే ప్రాణ క్రన్దాయ నమస్తే స్తనయిత్నవే ।

నమస్తే ప్రాణ విద్యుతే నమస్తే ప్రాణ వర్షతే ॥ 2 ॥

పదము :

నమః । తే । ప్రాణ । క్రన్దాయ । నమః । తే । స్తనయిత్నవే ।

నమః । తే । ప్రాణ । విఽద్యుతే । నమః । తే । ప్రాణ । వర్షతే

॥ 2 ॥

అనువాదం :

ఓ ప్రాణమా ! శబ్దించే నీకు నమస్కారం.
మేఘాలలో దూరి గర్జించే నీకు నమస్కారం.

ఓ ప్రాణమా! విద్యుదాత్మక మైన నీకు నమస్కారం.
ఓ ప్రాణమా! వర్షించే నీకు నమస్కారం. ॥ 2 ॥

మంత్రము :

యత్ ప్రాణ స్తనయిత్నునాఽ భిక్రన్ద త్యోషధీః ।
ప్ర వీయన్తే గర్భాన్ దధతేఽథో బహ్వీ ర్వి జాయన్తే ॥3॥

పదము :

యత్ । ప్రాణః । స్తనయిత్నునా । అభిఽక్రన్దతి । ఓషధీః ।
ప్ర । వీయన్తే । గర్భాన్ । దధతే ।
అథో ఇతి । బహ్వీః । వి । జాయన్తే ॥ 3 ॥

అనువాదం :

జగత్ప్రాణభూతుడైన, సూర్యాత్మకుడైన దేవుడు
గర్జిస్తూ ఓషధులను అభిలక్షించి శబ్దిస్తాడు.
అప్పుడా ఓషధులు గర్భం ధరిస్తాయి.
అనంతరం బహుప్రకార మైనవి ఉత్పన్నమౌతాయి. ॥ 3 ॥

మంత్రము :

యత్ ప్రాణ ఋతా వాగతేఽ భిక్రన్ద త్యోషధీః ।
సర్వం తదా ప్ర మోదతే
యత్ కిం చ భూమ్యా మధి ॥ 4 ॥

పదము :

యత్ । ప్రాణః । ఋతౌ । ఆఽగతే । అభిఽక్రన్దతి । ఓషధీః ।

సర్వమ్ । తదా । ప్ర । మోదతే ।

యత్ । కిమ్ । చ । భూమ్యామ్ । అధి ॥ 4 ॥

అనువాదం :

ప్రాణం ఋతుసమయంలో ఓషధులను గూర్చి
అభిక్రందనం చేస్తుంది.
అప్పుడు అవి అన్నీ సంతోషిస్తాయి.
భూమిపై నున్న ప్రాణిజాతమెల్లా సంతోషిస్తుంది. ॥ 4 ॥

మంత్రము :

యదా ప్రాణో అభ్యవర్షీద్
వర్షేణ పృథివీం మహీమ్ ।
పశవ స్తత్ ప్ర మోదన్తే
మహో వై నో భవిష్యతి ॥ 5 ॥

పదము :

యదా । ప్రాణః । అభిఽఅవర్షీత్ ।

వర్షేణ । పృథివీమ్ । మహీమ్ ।

పశవః । తత్ । ప్ర । మోదన్తే ।

మహః । వై । నః । భవిష్యతి ॥ 5 ॥

అనువాదం :

ప్రాణం విశాలమైన పృథివిని
వర్షంతోనే సర్వత్రా అభిషిక్తం చేస్తుంది.
అప్పుడు గవాదిపశువులు సంతోషిస్తాయి.
అది తమకొక మహోత్సవంగా భావిస్తాయి. ॥ 5 ॥

మంత్రము :

అభివృష్టా ఓషధయః ప్రాణేన సమవాదిరన్ ।
ఆయు ర్వై నః ప్రాతీతరః
సర్వా నః సురభీ రకః ॥ 6 ॥

పదము :

అభి౽వృష్టాః । ఓషధయః । ప్రాణేన । సమ్ । అవాదిరన్ ।
ఆయుః । వై । నః । ప్ర । అతీతరః ।
సర్వాః । నః । సురభీః । అకః ॥ 6 ॥

అనువాదం :

ప్రాణంతో అభిషిక్తములై ఓషధులు ప్రాణంతో సంభాషిస్తాయి.
ఓ ప్రాణమా ! మాకు ఆయుస్సును వృద్ధిచెందిస్తావు.
అలాగే మమ్ములను సురభిళంగా చేస్తావు. 6 ॥

మంత్రము:

నమస్తే అస్త్వాయతే నమో అస్తు పరాయతే ।
నమస్తే ప్రాణ తిష్ఠత ఆసీనాయోత తే నమః ॥ 7 ॥

పదము :

నమః । తే । అస్తు । ఆఽయతే । నమః । అస్తు । పరాఽయతే ।

నమః । తే । ప్రాణ । తిష్ఠతే । ఆసీనాయ । ఉత । తే । నమః ॥ 7 ॥

అనువాదం :

ఓ ప్రాణమా! వస్తున్న నీకు నమస్కారం.
వెడుతున్న నీకు నమస్కారం.
ఒకచోట నున్న నీకు నమస్కారం.
కూర్చుని ఉన్న నీకు నమస్కారం. ॥ 7 ॥

మంత్రము :

నమస్తే ప్రాణ ప్రాణతే నమో అస్త్వపానతే ।

పరాచీనాయ తే నమః ప్రతీచీనాయ తే నమః

సర్వస్మై త ఇదం నమః ॥ 8 ॥

పదము :

నమః । తే । ప్రాణ । ప్రాణతే । నమః । అస్తు । అపానతే ।

పరాచీనాయ । తే । నమః । ప్రతీచీనాయ । తే । నమః ।

సర్వస్మై । తే । ఇదమ్ । నమః ॥ 8 ॥

అనువాదం:

ఓ ప్రాణమా! ప్రాణన వ్యాపారం చేసే నీకు నమస్కారం.
అపానన వ్యాపారం చేసే నీకు నమస్కారం.
పరాగమన స్వభావం కల, దేహానికి

బయటనున్న నీకు నమస్కారం.
దేహమధ్యంలో నున్న నీకు నమస్కారం.
ఇంతెందుకు సర్వవ్యాపార కర్త్రి వైన నీకు నమస్కారం. ॥8॥

మంత్రము :

యా తే ప్రాణ ప్రియా తనూ-
ర్యో తే ప్రాణ ప్రేయసీ ।
అథో యద్ భేషజం తవ
తస్య నో ధేహి జీవసే ॥ 9 ॥

పదము :

యా । తే । ప్రాణ । ప్రియా । తనూః ।
యో ఇతి । తే । ప్రాణ । ప్రేయసీ ।
అథో ఇతి । యత్ । భేషజమ్ । తవ ।
తస్య । నః । ధేహి । జీవసే ॥ 9 ॥

అనువాదం :

ఓ ప్రాణమా ! నీకు ప్రీతికరమైన శరీరం ఉన్నది.
ఓ ప్రాణమా ! నీకు ప్రియతము రూపమైన ప్రేయసి ఉన్నది.
అంతేకాక నీకు సంబంధించిన ఔషధం ఉన్నది.
వాటి నుంచి మాకు జీవనార్థం ఔషధం ప్రసాదించు.
॥ 9 ॥

**మంత్రము :**

ప్రాణః ప్రజా అను వస్తే
పితా పుత్ర మివ ప్రియమ్ ।
ప్రాణో హ సర్వ స్యేశ్వరో
యచ్చ ప్రాణతి యచ్చ న ॥ 10 ॥

పదము :

ప్రాణః । ప్రఽజాః । అను । వస్తే ।
పితా । పుత్రమ్ఽఇవ । ప్రియమ్ ।
ప్రాణః । హ । సర్వస్య । ఈశ్వరః ।
యత్ । చ । ప్రాణతి । యత్ । చ । న ॥ 10 ॥

**అనువాదం :**

ఓ ప్రాణమా! ప్రజాసముదాయాన్ని
అనుక్రమంగా ఆచ్ఛాదించి ఉంటావు.
తండ్రి ఇష్టుడైన పుత్రుని తన వస్త్రంతో
కప్పినట్లుగా కప్పి ఉంటావు.
ప్రాణన వ్యాపారం కల జంగమాత్మకమైన
వస్తుసముదాయానికీ, ప్రాణన వ్యాపారం లేని
స్థావరాత్మకమైన వస్తుసముదాయానికీ నీవే ప్రభువువు.
। 10 ॥

మంత్రము :

ప్రాణో మృత్యుః ప్రాణ స్తక్మా

ప్రాణం దేవా ఉపాసతే ।

ప్రాణో హ సత్యవాదిన

ముత్తమే లోక ఆ దధత్ ॥ 11 ॥

పదము :

ప్రాణః । మృత్యుః । ప్రాణః । తక్మా ।

ప్రాణమ్ । దేవాః । ఉప । ఆసతే ।

ప్రాణః । హ । సత్యऽవాదినమ్ ।

ఉత్ऽతమే । లోకే । ఆ । దధత్ ॥ 11 ॥

అనువాదం :

ప్రాణమే మృత్యువు. ప్రాణమే జ్వరాది రోగము.
అలాగే దేహాంతర్గతమైన ప్రాణమును
దేవతలు ( ఇంద్రియములు ) ఉపాసిస్తారు.
ఆ ప్రాణమే సత్యవాదిని ఉత్కృష్టతమునిగా
లోకంలో నిలబెడుతుంది. ॥ 11 ॥

మంత్రము :

ప్రాణో విరాట్ ప్రాణో దేష్ట్రీ

ప్రాణం సర్వ ఉపాసతే ।

ప్రాణో హ సూర్య శ్చన్ద్రమాః
ప్రాణ మాహుః ప్రజాపతిమ్ ॥ 12 ॥

పదము :

ప్రాణః । విఽరాట్ । ప్రాణః । దేష్ట్రీ ।
ప్రాణమ్ ; సర్వే । ఉప । ఆసతే ।
ప్రాణః ।, హ । సూర్యః । చన్ద్రమాః ।
ప్రాణమ్ । ఆహుః । ప్రజాఽపతిమ్ ॥ 12 ॥

అనువాదం :

ప్రాణమే విరాట్టు, ప్రాణమే సర్వప్రాణి
ప్రేరకమైన పరదేవత.
ప్రాణాన్నే సర్వులూ ఉపాసిస్తారు.
ప్రాణమే సర్వప్రేరకుడైన ఆదిత్యుడు.
అలాగే అమృతమయుడైన చంద్రుడు కూడా ఆ ప్రాణమే.
ప్రాణాన్ని ప్రజాపతిగా అభిజ్ఞులు చెప్తారు. ॥ 12 ॥

మంత్రము :

ప్రాణాపానౌ వ్రీహియవా-
వనడ్వాన్ ప్రాణ ఉచ్యతే ।
యవే హ ప్రాణ ఆహితో-
పానో వ్రీహి రుచ్యతే ॥ 13 ॥

పదము :

ప్రాణాపానౌ । వ్రీహి౽యవౌ ।

అనడ్వాన్ । ప్రాణః । ఉచ్యతే ।

యవే । హ । ప్రాణః । ఆ౽హితః ।

అపానః । వ్రీహిః । ఉచ్యతే ॥ 13 ॥

అనువాదం :

ప్రాణాపానములే వ్రీహియవలు.
ఆ ప్రాణమే వృషభము.
యవలలో ప్రాణవృత్త్యాత్మకమైన వాయువు
సమాహితమై ఉంటుంది.
అపానవృత్త్యాత్మకమైన వాయువు
వ్రీహ్యాత్మకమైనది. ॥ 13 ॥

మంత్రము :

అపానతి ప్రాణతి పురుషో గర్భే అన్తరా ।

యదా త్వం ప్రాణ జిన్వ స్యథ స జాయతే పునః ॥14॥

పదము :

అప । అనతి । ప్ర । అనతి । పురుషః । గర్భే । అన్తరా ।

యదా । త్వమ్ । ప్రాణ । జిన్వసి । అథ । సః । జాయతే । పునః ॥ 14 ॥

అనువాదం :

(అన్నరస పరిణామ రూపధారి అయిన)
పురుషుడు స్త్రీ గర్భాశయ మధ్యంలో
ప్రాణాపానవ్యాపారం చేస్తాడు.
ఓ ప్రాణమా! నీవు గర్భభూతుడైన
పురుషుని ఎప్పుడు పోషిస్తావో,
ఆ తరువాతనే అతడు పునర్జన్మిస్తాడు. ॥ 14 ॥

మంత్రము :

ప్రాణ మాహు ర్మాతరిశ్వానం
వాతో హ ప్రాణ ఉచ్యతే ।
ప్రాణేహ భూతం భవ్యం చ
ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్ ॥ 15 ॥

పదము :

ప్రాణమ్ । ఆహుః । మాతరిశ్వానమ్ ।
వాతః । హ । ప్రాణః । ఉచ్యతే ।
ప్రాణే । హ । భూతమ్ । భవ్యమ్ । చ ।
ప్రాణే । సర్వమ్ । ప్రతిऽస్థితమ్ ॥ 15 ॥

అనువాదం :

ప్రాణమునే అంతరిక్షాధిపతి అయిన వాయువని చెప్తారు.
వాయువే ప్రాణం కదా!

ఆ ప్రాణంలో భూతకాలావచ్ఛిన్నమైన జగత్తు,
భవిష్యత్కాలావచ్ఛిన్నమైన జగత్తు
సర్వము ఆశ్రయించి ఉంటుంది.
ఇంతెందుకు-ఆ ప్రాణంలోనే
సర్వజగత్తు ప్రతిష్ఠితమై ఉన్నది. ॥ 15 ॥

మంత్రము :

ఆథర్వణీ రాఙ్గిరసీ ర్దైవీ ర్మనుష్యజా ఉత ।
ఓషధయః ప్ర జాయన్తే
యదా త్వం ప్రాణ జిన్వసి ॥ 16 ॥

పదము :

ఆథర్వణీః । ఆఙ్గిరసీః । దైవీః । మనుష్యఽజాః । ఉత ।
ఓషధయః । ప్ర । జాయన్తే ।
యదా । త్వమ్ । ప్రాణ । జిన్వసి ॥ 16 ॥

అనువాదం :

అథర్వణుడు సృష్టించినవి,
అంగిరసుడు సృష్టించినవి,
దేవతలు సృష్టించినవి,
మనుష్యులవల్ల ఉత్పన్నమైనవి-
ఇలా నానావిధములైన ఓషధులు
విపరీతంగా ఉత్పన్నములౌతాయి.
ఓ ప్రాణమా! నీవు వృష్టిప్రదానం
చేయడం వల్ల వానిని సంతోష పెడతావు. ॥ 16 ॥

మంత్రము :

యదా ప్రాణో అభ్యవర్షీద్

వర్షేణ పృథివీం మహీమ్ ।

ఓషధయః ప్ర జాయన్తేఽ-

థో యాః కాశ్చ వీరుధః ॥ 17 ॥

పదము :

యదా । ప్రాణః ।అభిఽఅవర్షీత్ ।

వర్షేణ । పృథివీమ్ । మహీమ్ ।

ఓషధయః । ప్ర । జాయ న్తే ।

అథో । ఇతి । యాః । కాః । చ । వీరుధః ॥ 17 ॥

అనువాదం :

ప్రాణం విశాలమైన పృథివిని
వర్షంతో సర్వత్రా అభిషిక్తం చేస్తుంది.
ఓషధులు వృష్ట్యనంతరమే ఉత్పన్న మౌతాయి.
మరిన్నీ కొన్ని లతలు కూడా అప్పుడే అంకురిస్తాయి. ॥17॥

మంత్రము :

యస్తే ప్రాణేదం వేద

యస్మిం శ్చాసి ప్రతిష్ఠితః ।

సర్వే తస్మై బలిం హరా-
నముష్మిం ల్లోక ఉత్తమే ॥ 18 ॥

పదము :

యః । తే । ప్రాణ । ఇదమ్ । వేద ।
యస్మిన్ । చ । అసి । ప్రతిऽస్థితః ।
సర్వే । తస్మై । బలిమ్ । హరాన్ ।
అముష్మిన్ । లోకే । ఉత్ऽతమే ॥ 18 ॥

అనువాదం :

ఓ ప్రాణమా ! నీ మాహాత్మ్యాన్ని ఎవరెరుగుదురో,
ఏ విద్వాంసుని యందు నీవు ప్రతిష్ఠింపబడినావో,
ఆ విద్వాంసునికై సర్వదేవతలు
ఉత్కృష్టతమమైన ఈ స్వర్గ లోకంలో
అమృతమయమైన బలినర్పిస్తారు. ॥ 18 ॥

మంత్రము :

యథా ప్రాణ బలిహృత-
స్తుభ్యం సర్వాః ప్రజా ఇమాః ।
ఏవా తస్మై బలిం హరాన్
యస్త్వా శృణవత్ సుశ్రవః ॥ 19 ॥

పదము :

యథా । ప్రాణ । బలిఽహృతః ।

తుభ్యమ్ । సర్వాః । ప్రఽజాః । ఇమాః ।

ఏవ । తస్మై । బలిమ్ । హరాన్ ।

యః । త్వా । శృణవత్ । సుఽశ్రవః ॥ 19 ॥

అనువాదం :

ఓ ప్రాణమా ! ఈ సర్వప్రజలు ఏప్రకారంగా
నీకై బలిహర్తలౌతున్నారో,
ఇట్లే ఆ విద్వాంసునకు బలిని ఇత్తురు గాక !
ఓ వినబడే ప్రాణమా ! నిన్ను ఎవరైతే వింటారో
వారికి కూడా బలిని ఇత్తురు గాక ! ॥ 19 ॥

మంత్రము :

అన్త ర్గర్భ శ్చరతి దేవతా స్వాభూతో

భూతః స ఉ జాయతే పునః ।

స భూతో భవ్యం భవిష్యత్ పితా

పుత్రం ప్ర వివేశా శచీభిః ॥ 20 ॥

పదము :

అన్తః । గర్భః । చరతి । దేవతాసు । ఆఽభూతః ।

భూతః । సః । ఓం ఇతి । జాయతే । పునః ।

సః । భూతః। భవ్యమ్ । భవిష్యత్ । పితా ।

పుత్రమ్ । ప్ర । వివేశ । శచీభిః ॥ 20 ॥

అనువాదం :

దేవతల మధ్యంలో ఉండి ప్రాణం చరిస్తుంది.
సర్వవ్యాప్తమై నిత్యమై ఉన్న ఆ ప్రాణం పునర్జన్మిస్తుంది.
నిత్యవర్తమానమైన ఆ ప్రాణం
భూతకాలావచ్ఛిన్నమైన వస్తువు -
భావికాలావచ్ఛిన్నమైన వస్తువు -
వీటిలో ఆత్మీయశక్తితో ప్రవేశిస్తుంది.
తండ్రి పుత్రునిలో ప్రవేశించినట్లు
ఈ ప్రాణం ప్రవేశించి
సర్వజగత్తును చైతన్యవంతం చేస్తుంది. ॥ 20 ॥

మంత్రము :

ఏకం పాదం నోత్ఖిదతి
సలిలా ద్ధంస ఉచ్చరన్ ।
యదఙ్గ స తముత్ఖిదే
న్నైవాద్య న శ్వః స్యా
న్న రాత్రీ నాహః స్యా
న్న వ్యుచ్ఛేత్ కదా చన ॥ 21 ॥

పదము :

ఏకమ్ । పాదమ్ । న । ఉత్ । ఖిదతి ।

సలిలాత్ । హంసః । ఉత్ఽచరన్ ।

యత్ । అఙ్గ । సః । తమ్ । ఉత్ఽఖిదేత్ ।

న । ఏవ । అద్య । న । శ్వః । స్యాత్ ।

న । రాత్రీ । న । అహః । స్యాత్ ।

న । వి । ఉచ్ఛేత్ । కదా । చన ॥ 21 ॥

**అనువాదం :**

హంస ( సూర్యుడు ) సలిలం నుంచి పైకి లేస్తూ
ఒక కాలిని మాత్రం అలాగే ఉంచుతుంది.
ఓ దేవదత్తా! ఆ ఉద్గతుడైన సూర్యుడు
అలా ఉంచిన పాదాన్ని కూడా పైకెత్తితే
నేడు, రేపు, రాత్రి, పగలు అన్న వ్యవహారం ఉండనే ఉండదు.
ఎప్పుడున్నా ఉషః ప్రాదుర్భావం కూడా జరుగదు. ॥ 21 ॥

**మంత్రము :**

అష్టాచక్రం వర్తత ఏకనేమి

సహస్రాక్షరం ప్ర పురో ని పశ్చా ।

అర్ధేన విశ్వం భువనం జజాన

యదస్యార్ధం కతమః స కేతుః ॥ 22 ॥

పదము :

అష్టాఽచక్రమ్ । వర్తతే । ఏకఽనేమి ।

సహస్రఽఅక్షరమ్ । ప్ర । పురః । ని । పశ్చా ।

అర్ధేన । విశ్వమ్ । భువనమ్ । జజాన ।

యత్ । అస్య । అర్ధమ్ । కతమః । సః । కేతుః ॥ 22 ॥

**అనువాదం :**

* ఎనిమిది చక్రములు గల శరీరం (ప్రాణమనే)
ఒకే ఒక చక్రనేమితో ప్రవర్తిస్తుంది.
అనేక అక్ష (ర) ములతో కూడినదిది.
ఈ రథాత్మకమైన శరీరం పూర్వభాగంలో
ముందుకు పోతుంది.
అపరభాగంలో వెనుకకు పోతుంది.
తన అంశమైన విశ్వం సమస్తభూతజాతాన్ని
జనింపజేసినది.
ఈ సూత్రాత్మకమైన ప్రాణమునకు
ఒక సగం ప్రాణరూపంలో ఉంటుంది.
అపర భాగం ఏది? ఎటువంటిది? ॥ 22 ॥

మంత్రము :

యో అస్య విశ్వజన్మన

ఈశే విశ్వస్య చేష్టతః ।

---

*(చర్మము, రక్తము మొదలైనవి ఏడు ధాతువులు. ఓజస్సు అనునది ఎనిమిదవ ధాతువు.)

అన్యేషు క్షిప్రధన్వనే
తస్మై ప్రాణ నమోస్తు తే ॥ 23 ॥

పదము :

యః । అస్య । విశ్వఽజన్మనః ।
ఈశే । విశ్వస్య । చేష్టతః ।
అన్యేషు । క్షిప్రఽధన్వనే ।
తస్మై । ప్రాణ । నమః । అస్తు । తే ॥ 23 ॥

అనువాదం :

ఈ ప్రాణం నానారూపములైన
జగత్తులకు కారణభూతమైనది.
వానిని కదలించునది.
ఈ సర్వజత్తులకు ప్రభువైనది.
ఇతర ప్రాణులలో త్వరగా వ్యాపించునది.
ఓ ప్రాణమా! అలాంటి నీకు నమస్కారం. ॥ 23 ॥

మంత్రము :

యో అస్య సర్వజన్మన
ఈశే సర్వస్య చేష్టతః
అతన్ద్రో బ్రహ్మణా ధీరః
ప్రాణో మాను తిష్ఠతు ॥ 24 ॥

పదము :

యః । అస్య । సర్వఽజన్మనః ।

ఈశే । సర్వస్య । చేష్టతః ।

అతన్ద్రః । బ్రహ్మణా । ధీరః ।

ప్రాణః । మా । అను । తిష్ఠతు ॥ 24 ॥

అనువాదం :

ఈ ప్రాణం నానారూపములైన
జగత్తులకు కారణభూతమైనది. వానిని కదలించునది.
ఈ సర్వజగత్తులకు ప్రభువైనది.
అ ప్రాణం అలసతాదూరమైనది. ధీరమైనది.
బ్రహ్మరూపంతో నన్ను అనువర్తించు గాక! ॥ 24 ॥

మంత్రము :

ఊర్ధ్వః సుప్తేషు జాగార నను తిర్యఙ్ ని పద్యతే ।
న సుప్త మస్య సుప్తే ష్వను శుశ్రావ కశ్చన ॥ 25 ॥

పదము :

ఊర్ధ్వః । సుప్తేషు । జాగార । నను । తిర్యఙ్ । ని । పద్యతే ।
న । సుప్తమ్ । అస్య । సుప్తేషు । అను । శుశ్రావ । కః । చన ॥25॥

అనువాదం :

ఓ ప్రాణమా! నీవు ఊర్ధ్వగతివై
నిద్రావస్థలో నున్న ప్రాణులలో మేల్కొని ఉంటావు.

నిద్రిస్తున్న ప్రాణి నిద్రాపరవశుడై ఉంటాడు కదా !
నిద్రిస్తున్న ప్రాణులలో ఈ ప్రాణమునకు
నిద్ర అనునది ఉన్నట్టు ఏ పురుషుడూ వినలేదు. ॥ 25 ॥

**మంత్రము :**

ప్రాణ మా మత్ పర్యావృతో
న మ దన్యో భవిష్యసి ।
అపాం గర్భ మివ జీవసే
ప్రాణ బధ్నామి త్వా మయి ॥ 26 ॥

**పదము :**

ప్రాణ । మా । మత్ । పరిఽఆవృతః ।
న । మత్ । అన్యః । భవిష్యసి ।
అపామ్ । గర్భమ్ఽఇవ । జీవసే ।
ప్రాణ । బధ్నామి । త్వా । మయి ॥ 26 ॥

**అనువాదం :**

ఓ ప్రాణమా ! నా సకాశం నుంచి పరాఙ్ముఖుడవు కావద్దు.
ఓ ప్రాణమా ! నీవు నా సకాశం నుంచి వేరు కావద్దు.
ఉదక గర్భంలో అగ్ని ఉన్నట్లు ఓ ప్రాణమా !
నిన్ను నా శరీరంలో జీవించుటకై బంధిస్తున్నాను. ॥ 26 ॥

ఇది నాల్గవ సూక్తం.

ఇది రెండవ అనువాకం.

## అనువాకం: 3

### సూక్తం - 5

ఋషి: బ్రహ్మ॥ దేవత: బ్రహ్మచారి॥ ఛందస్సు: 1 పురోఽతిజాగతా విరాడ్ గర్భా త్రిష్టుప్; 2 పఞ్చపదా బృహతీగర్భా విరాట్ శక్వరీ: 3 ఉరో బృహతీ; 4,5,24 త్రిష్టుప్: 6 శాక్వరగర్భా చతుష్పదా జగతీ; 7 విరాడ్ గర్భా త్రిష్టుప్; 8 పురోఽతిజాగతా విరాడ్ జగతీ; 9 బృహతీగర్భా త్రిష్టుప్; 10 భురిక్ త్రిష్టుప్; 11,13 జగతీ; 12 శాక్వరగర్భా చతుష్పదా విరాడతిజగతీ: 14,16-22 అనుష్టుప్; 15 పురస్తాజ్జ్యోతిస్త్రిష్టుప్: 23 పురోబార్హతాతిజాగతగర్భా త్రిష్టుప్: 25 ఆర్చ్యుష్ణిక్ (ఏకావసానా) 26 మధ్యేజ్యోతిరుష్ణిగ్గర్భా త్రిష్టుప్॥ మంత్రములు: ॥ 26 ॥

వినియోగం :- బ్రహ్మయజ్ఞ జపంలో దీనికి వినియోగం.

మంత్రము :

బ్రహ్మచారీష్ణం శ్చరతి రోదసీ ఉభే
తస్మిన్ దేవాః సంమనసో భవన్తి ।
స దాధార పృథివీం దివం చ
స ఆచార్యం 1 తపసా పిపర్తి ॥ 1 ॥

పదము :

బ్రహ్మచారీ । ఇష్ణన్ । చరతి । రోదసీ ఇతి ।
ఉభే ఇతి । తస్మిన్ । దేవాః । సమ్ఽమనసః । భవన్తి ।
సః । దాధార । పృథివీమ్ । దివమ్ । చ ।
సః । ఆఽచార్యఽమ్ । తపసా । పిపర్తి ॥ 1 ॥

అనువాదం

బ్రహ్మచారియందు ద్యావాపృథ్వులు
ఆత్మీయ తపస్సుతో వ్యాపించి స్వ నియమంతో ప్రవర్తిస్తున్నవి
ఇంద్రాది దేవతలు ఆ బ్రహ్మచారిలో
సమాన మనస్కులై ఉంటారు
ఆ బ్రహ్మచారి ఆత్మీయ తపస్సుతో
భూలోకాన్ని, ద్యులోకాన్ని ధరిస్తాడు
అలాగే తన గురువును అదే తపస్సుతో పరిపాలిస్తాడు ॥ 1 ॥

మంత్రము :

బ్రహ్మచారిణం పితరో దేవజనాః
పృథగ్ దేవా అనుసంయన్తి సర్వే ।
గన్ధర్వా ఏన మన్వాయన్
త్రయస్త్రింశత్ త్రిశతాః షట్సహస్రాః
సర్వాన్త్స దేవాంస్తపసా పిపర్తి ॥ 2 ॥

పదము

బ్రహ్మఽచారిణమ్ । పితరః । దేవఽజనాః ।
పృథక్ । దేవాః । అనుఽసంయన్తి । సర్వే ।
గన్ధర్వాః । ఏనమ్ । అను । ఆయన్ ।
త్రయఃఽత్రింశత్ । త్రిఽశతాః । షట్ఽసహస్రాః ।
సర్వాన్ । సః । దేవాన్ । తపసా । పిపర్తి ॥ 2 ॥

**అనువాదం**

బ్రహ్మచారిని పితరులు, దేవజనులు
సర్వ దేవతలు రక్షణార్థమై వేరువేరుగా అనుగమిస్తారు
అలాగే గంధర్వులు ఈ బ్రహ్మచారిని అనుగమిస్తారు
ముప్పై ముగ్గురు దేవతలు, మున్నూరు దేవతలు,
అరువేల దేవతలు ఇలాగే అనుగమిస్తారు
వారందరినీ ఆ బ్రహ్మచారి
ఆత్మీయ తపస్సుతో పరిపాలిస్తాడు, ॥ 2 ॥

మంత్రము।

**ఆచార్య౨ ఉపనయమానో**

**బ్రహ్మచారిణం కృణుతే గర్భ మన్తః ।**

**తం రాత్రీ స్తిస్ర ఉదరే బిభర్తి**

**తం జాతం ద్రష్టు మభిసంయన్తి దేవాః ॥ 3 ॥**

పదము

**ఆ౨చార్య౨ః । ఉప౨నయమానః ।**

**బ్రహ్మ౨చారిణమ్ । కృణుతే । గర్భమ్ । అన్తః ।**

**తమ్ । రాత్రీః । తిస్రః । ఉదరే । బిభర్తి ।**

**తమ్ । జాతమ్ । ద్రష్టుమ్ । అభి౨సంయన్తి । దేవాః ॥ 3 ॥**

**అనువాదం**

బ్రహ్మచారిని తన వద్దకు కొనిపోతున్న ఆచార్యుడు
విద్యామయ శరీరమధ్యంలో గర్భీభూతుని చేస్తాడు

అలాంటి బ్రహ్మచారిని మూడు రాత్రులు
ఉదరంలో ధరిస్తాడు
నాల్గవనాడు విద్యామయ శరీర
మధ్యం నుంచి ఉత్పన్నుడైన
బ్రహ్మచారిని చూచుటకై దేవతలు
అభిముఖులై వస్తారు ॥ 3 ॥

మంత్రము

ఇయం సమిత్ పృథివీ ద్యౌర్ద్వితీ
యోతాన్తరిక్షం సమిధా పృణాతి ।
బ్రహ్మచారీ సమిధా మేఖలయా
శ్రమేణ లోకాం స్తపసా పిపర్తి ॥ 4 ॥

పదము :

ఇయమ్ । సమ్ऽఇత్ । పృథివీ । ద్యౌః । ద్వితీయా ।
ఉత । అన్తరిక్షమ్ । సమ్ऽఇధా । పృణాతి ।
బ్రహ్మऽచారీ । సమ్ऽఇధా । మేఖలయా ।
శ్రమేణ । లోకాన్ । తపసా । పిపర్తి ॥ 4 ॥

అనువాదం

ఈ కనబడుతున్న పృథివి
బ్రహ్మచారికి మొదటి సమిధ
ద్యులోకం రెండవ సమిధ

మరిన్ని అంతరిక్షంలో సమిధలతో
పరిపూర్ణం చేస్తాడు
ఇలా బ్రహ్మచారి అధీయమానమైన సమిధతో,
కట్టుకున్న మౌంజితో, ధర్మంతో, తపస్సుతో
లోకములను పరిపూర్ణం చేస్తాడు ॥ 4 ॥

మంత్రము

పూర్వో జాతో బ్రహ్మణో బ్రహ్మచారి
ఘర్మం వసాన స్తపసోదతిష్ఠత్ ।
తస్మా జ్జాతం బ్రాహ్మణం బ్రహ్మ జ్యేష్ఠం
దేవాశ్చ సర్వే అమృతేన సాకమ్ ॥ 5 ॥

పదము

పూర్వః । జాతః । బ్రహ్మణః । బ్రహ్మ౽చారీ ।
ఘర్మమ్ । వసానః । తపసా । ఉత్ । అతిష్ఠత్ ।
తస్మాత్ । జాతమ్ । బ్రాహ్మణమ్ । బ్రహ్మ । జ్యేష్ఠమ్ ।
దేవాః । చ । సర్వే । అమృతేన । సాకమ్ ॥ 5 ॥

అనువాదం

సర్వ జగత్కారణమైన బ్రహ్మ నుంచి
బ్రహ్మచారి మొదటు ఉత్పన్నుడైనాడు
ధర్మాన్ని ఆచ్ఛాదనం చేసుకుని
తపస్సుతో ఉత్థితుడౌతాడు

ఆ బ్రహ్మసకాశం నుంచి బ్రాహ్మణ స్వభూతమైన
జ్యేష్ఠ బ్రహ్మ ఉదయించినది
తత్ప్రతిపాద్యులైన అగ్న్యాది సర్వదేవతలు
అమృతత్వంతో పాటు అలాగే జనించినారు ॥ 5 ॥

మంత్రము :

బ్రహ్మచార్యేఽతి సమిధా సమిద్ధః
కార్ష్ణం వసానో దీక్షితో దీర్ఘశ్మశ్రుః ।
స సద్య ఏతి పూర్వస్మా దుత్తరం సముద్రం
లోకా న్త్సంగృభ్య ముహు రాచరిక్రత్ ॥ 6 ॥

పదము

బ్రహ్మఽచారీ । ఏతి । సమ్ఽఇధా । సమ్ఽఇద్ధః ।
కార్ష్ణమ్ । వసానః । దీక్షితః । దీర్ఘఽశ్మశ్రుః ।
సః । సద్యః । ఏతి । పూర్వస్మాత్ । ఉత్తరమ్ । సముద్రమ్ ।
లోకాన్ । సమ్ఽగృభ్య । ముహుః । ఆఽచరిక్రత్ ॥ 6 ॥

అనువాదం :

సమిధలతో సందీపితమైన కృష్ణాజినాన్ని ధరించి
దీక్షితుడై, దీర్ఘశ్మశ్రువై బ్రహ్మచారి
బ్రహ్మచర్యం నిర్వర్తిస్తాడు
అలాంటి బ్రహ్మచారి త్వరలో పూర్వ సముద్రం నుంచి

ఉత్తర సముద్రం దాకా వెడతాడు.
లోకములను సంగ్రహించి అత్యంతం
అభిముఖ్యంతో ప్రవర్తిస్తాడు ॥ 6 ॥

మంత్రము:

బ్రహ్మచారీ జనయన్ బ్రహ్మాపో లోకం
ప్రజాపతిం పరమేష్ఠినం విరాజమ్ ।
గర్భో భూత్వాఽమృతస్య యోనా-
విన్ద్రో హ భూత్వాఽసురాం స్తతర్హ ॥ 7 ॥

పదము :

బ్రహ్మఽచారీ । జనయన్ । బ్రహ్మ । అపః । లోకమ్ ।
ప్రజాఽపతిమ్ । పరమేఽస్థినమ్ । విఽరాజమ్ ।
గర్భః । భూత్వా । అమృతస్య । యోనౌ ।
ఇన్ద్రః । హ । భూత్వా । అసురాన్ । తతర్హ ॥ 7 ॥

అనువాదం :

ఉక్తలక్షణుడైన బ్రహ్మచారి బ్రాహ్మణ జాతిని,
గంగాది నదులను, స్వర్గాది లోకములను,
ప్రజాపతిని, పరమేష్ఠిని, విరాట్టును
ఉత్పన్నం చేస్తుంటాడు
అమృతుడైన బ్రహ్మకు చెందిన యోనిలో
మొదట గర్భాన్ని కల్పిస్తాడు
తరువాత ఇంద్రుడై అసురులను సంహరించినాడు ॥ 7 ॥

మంత్రము :

ఆచార్యాఽ స్తతక్ష నభసీ ఉభే ఇమే
ఉర్వీ గమ్భీరే పృథివీం దివం చ ।
తే రక్షతి తపసా బ్రహ్మచారీ
తస్మిన్ దేవాః సంమనసో భవన్తి ॥ 8 ॥

పదము

ఆఽచార్యః । తతక్ష । నభసీ ఇతి । ఉభే ఇతి । ఇమే ఇతి ।
ఉర్వీ ఇతి । గమ్భీరే ఇతి । పృథివీమ్ । దివమ్ । చ ।
తే ఇతి । రక్షతి । తపసా । బ్రహ్మఽచారీ ।
తస్మిన్ । దేవాః । సమ్ఽమనసః । భవన్తి ॥ 8 ॥

అనువాదం

ఈ కనబడుతున్న ఆకసాన్ని, అంతరిక్షాన్ని
పృథివిని ఆచార్యుడు జనింపజేసినాడు
విస్తీర్ణములై, గంభీరములైన పృథివిని,
ద్యులోకమును సృష్టించిన ఆచార్యుని
బ్రహ్మచారి తన తపస్సుతో రక్షిస్తాడు
అలాంటి బ్రహ్మచారిలో సర్వదేవతలు
సమాన మనస్కులై ఉంటూరు ॥ 8 ॥

మంత్రము :

ఇమాం భూమిం పృథివీం బ్రహ్మచారీ
భిక్షా మా జభార ప్రథమో దివం చ ।

తే కృత్వా సమిధా వుపాస్తే
తయో రార్పితా భువనాని విశ్వా ॥ 9 ॥

పదము :

ఇమామ్ । భూమిమ్ । పృథివీమ్ । బ్రహ్మఽచారీ ।
భిక్షామ్ । ఆ । జభార । ప్రథమః । దివమ్ । చ ।
తే ఇతి । కృత్వా । సమ్ఽఇధౌ । ఉప । ఆస్తే ।
తయోః । ఆర్పితా । భువనాని । విశ్వా ॥ 9 ॥

అనువాదం :

ఈ కనబడుతున్న పృథివిని బ్రహ్మచారి
మొదట భిక్షగా స్వీకరించినాడు
తర్వాత ద్యులోకాన్ని ద్వితీయ భిక్షగా స్వీకరించినాడు
ఆ ద్యావాపృథ్వులను సమిధలను చేసుకొని
అగ్నిని పరిచరిస్తున్నాడు
ఆ ద్యావాపృథ్వులను
సర్వ భూతజాతములు ఆశ్రయించి ఉన్నవి ॥ 9 ॥

మంత్రము :

అర్వా గన్యః పరో అన్యో దివ స్పృష్ఠాద్ ।
గుహా నిధీ నిహితా బ్రాహ్మణస్య ।
తా రక్షతి తపసా బ్రహ్మచారీ
తత్ కేవలం కృణుతే బ్రహ్మ విద్వాన్ ॥ 10 ॥

పదము

అర్వాక్ । అన్యః । పరః । అన్యః । దివః । పృష్ఠాత్ ।
గుహా । నిధీ ఇతి । ని౽ధీ । ని౽హితౌ । బ్రాహ్మణస్య ।
తౌ । రక్షతి । తపసా । బ్రహ్మ౽చారీ ।
తత్ । కేవలమ్ । కృణుతే । బ్రహ్మ । విద్వాన్ ॥ 10 ॥

అనువాదం :

ద్యులోకం ఉపరిభాగానికి క్రిందనున్న
భూలోకం లోని వేదాత్మకమైననిధి
ఆచార్య హృదయగుహలో నిక్షిప్తమై ఉన్నది
మరొక నిధి ప్రక్క నుంచి,
పై భాగంలో నిక్షిప్తమై ఉన్నది
అతీతవేది అయిన బ్రాహ్మణునిలో
అవి నిక్షిప్తములై ఉన్నవి
ఆ నిధులను బ్రహ్మచారి తపస్సులతో రక్షిస్తుంటాడు
వేదార్థ రహస్యాభిజ్ఞుడు ఆ నిధిద్వయాన్ని
కేవలబ్రహ్మగా చేస్తాడు ॥ 10 ॥

మంత్రము

అర్వా గన్య ఇతో అన్యః పృథివ్యా
అగ్నీ సమేతో నభసీ అన్తరేమే ।
తయోః శ్రయన్తే రశ్మయోధి దృఢా-
స్తా నా తిష్ఠతి తపసా బ్రహ్మచారీ ॥ 11 ॥

పదము :

అర్వాక్ । అన్యః । ఇతః । అన్యః । పృథివ్యాః ।
అగ్నీ ఇతి । సమ్ఽఏతః । నభసీ ఇతి । అన్తరా । ఇమే ఇతి ।
తయోః । శ్రయన్తే । రశ్మయః । అధి । దృఢాః ।
తాన్ । ఆ । తిష్ఠతి । తపసా । బ్రహ్మఽచారీ ॥ 11 ॥

అనువాదం:

ఈ పృథివికి అథఃప్రదేశంలో
మరొక అగ్ని సూర్యాత్మకుడై ఉన్నాడు
మరొక అగ్ని పృథివిపై ఉన్నాడు
సూర్యుడు ఉదయించగానే
ఈ ద్యావాపృథ్వ్యల మధ్యనున్న ఆ అగ్నులు
పరస్పరం సంగతము లౌతాయి
ఆ సూర్యాగ్నులకు చెందిన కిరణములు
అతి దృఢములైన ద్యావాపృథ్వ్యలను ఆశ్రయించి ఉంటాయి.
ఈ విధంగా అగ్నిద్వయోపేతమైన ఈ భూమికి
బ్రహ్మచారి తపస్సుతో అధిదేవుడౌతాడు ॥ 11 ॥

మంత్రము :

అభిక్రన్దన్ స్తనయ న్నరుణః శితిఙ్గో
బృహ చ్ఛేపో౽ను భూమౌ జభార ।
బ్రహ్మచారీ సిఞ్చతి సానౌ రేతః పృథివ్యాం
తేన జీవన్తి ప్రదిశ శ్చతస్రః ॥ 12 ॥

పదము ।

అభి౽క్రన్దన్ । స్తనయన్ । అరుణః । శితిఙ్గః ।
బృహత్ । శేపః । అను । భూమౌ । జభార ।
బ్రహ్మ౽చారీ । సిఞ్చతి । సానౌ । రేతః । పృథివ్యామ్ ।
తేన । జీవన్తి । ప్ర౽దిశః । చతస్రః ॥ 12 ॥

అనువాదం ।

అభిక్రందనం చేస్తూ, ఉరుముతూ
శ్వేతవర్ణము, జలపూర్ణము అయిన మేఘమును చేరి
వరుణుడు తన జననేంద్రియాన్ని
భూమి యందు నిక్షిప్తం చేసినాడు
దానితో బ్రహ్మచారి వరుణ రేతస్సును
పృథివి యందు ఉన్నత ప్రదేశములందు వర్షిస్తాడు
ఆ వృష్టితో నలుదిక్కులు జీవిస్తాయి ॥ 12 ॥

మంత్రము

అగ్నౌ సూర్యే చన్ద్రమసి మాతరిశ్వన్
బ్రహ్మచార్య1ప్సు సమిధ మా దధాతి ।
తాసా మర్చీంషి పృథ గభ్రే చరన్తి
తాసా మాజ్యం పురుషో వర్ష మాపః ॥ 13 ॥

పదము :

అగ్నౌ । సూర్యే । చన్ద్రమసి । మాతరిశ్వన్ ।

బ్రహ్మఽచారీ । అప్ఽసు । సమ్ఽఇధమ్ । ఆ । దధాతి ।

తాసామ్ । అర్చీంషి । పృథక్ । అభ్రే । చరన్తి ।

తాసామ్ । ఆజ్యమ్ । పురుషః । వర్షమ్ । ఆపః ॥ 13 ॥

అనువాదం

బ్రహ్మచారి అగ్నియందు, సూర్యునియందు
చంద్రునియందు, వాయువునందు, ఉదకములందు
సమిధలను ప్రక్షేపణం చేస్తాడు
ఆ అగ్న్యాదుల దీప్తులు అంతరిక్షంలో అసంకీర్ణములై వర్తిస్తాయి
వానిలో ఆజ్యమున్నది పురుషుడున్నాడు
వర్షమున్నది ఉదకములున్నవి ॥ 13 ॥

మంత్రము

ఆచార్యోఽ మృత్యు ర్వరుణః

సోమ ఓషధయః పయః ।

జీమూతా ఆస న్త్సత్వాన-

స్తై రిదం స్వ1 రాభృతమ్ ॥ 14 ॥

పదము :

ఆఽచార్యఽః । మృత్యుః । వరుణః ।

సోమః । ఓషధయః । పయః ।

జీమూతాః । ఆసన్ । సత్వానః ।

తై ః । ఇదమ్ । స్వ ఽః । ఆ ఽభృతమ్ ॥ 14 ॥

అనువాదం :

ఆచార్యుడే మృత్యువు
ఆయనే వరుణుడు ఆయనే సోముడు
వ్రీహి యవాదులు కూడా ఆయనే
క్షీరం ఆయనే ఈ ఆచార్యరూపుడైన
వరుణునికి చెందిన ఏ సత్త్వములైతే ఉన్నవో,
అవి జీమూతములుగా పరిణమించినవి
ఆ మేఘములచే ఈ ఉదకం ఆహృతమైనది ॥ 14 ॥

మంత్రము

అమా ఘృతం కృణుతే కేవల మాచార్యో ఽ
భూత్వా వరుణో యద్య దైచ్ఛత్ ప్రజాపతౌ ।
తద్ బ్రహ్మచారీ ప్రాయచ్ఛత్
స్వాన్ మిత్రో అధ్యాత్మనః ॥ 15 ॥

పదము :

అమా । ఘృతమ్ । కృణుతే । కేవలమ్ । ఆ ఽచార్యః ఽః ।
భూత్వా । వరుణః । యత్ ఽయత్ । ఐచ్ఛత్ । ప్రజా ఽపతౌ ।
తత్ । బ్రహ్మ ఽచారీ । ప్ర । అయచ్ఛత్ ।
స్వాన్ । మిత్రః । అధి । ఆత్మనః ॥ 15 ॥

అనువాదం :

వరుణుడు ఆచార్యుడై ఘృతమును
స్వాత్మసహితంగా చేస్తున్నాడు
ఆ వరుణుడు స్వజనకుడైన బ్రహ్మయందు
ఏ ఫలమును కోరెనో, మిత్రుడు బ్రహ్మచారి అయి
తన శరీరం నుంచి ఆ అపేక్షిత ఫలాన్ని సమర్పించినాడు
॥ 15 ॥

మంత్రము

ఆచార్యో౽ బ్రహ్మచారీ బ్రహ్మచారీ ప్రజాపతిః ।
ప్రజాపతి ర్వి రాజతి విరా డిన్ద్రో౽భవద్ వశీ ॥ 16 ॥

పదము,

ఆ౽చార్య౽ః । బ్రహ్మ౽చారీ । బ్రహ్మ౽చారీ । ప్రజా౽పతిః ।
ప్రజా౽పతిః । వి । రాజతి । వి౽రాట్ । ఇన్ద్రః । అభవత్ । వశీ
॥ 16 ॥

అనువాదం

ఆచార్యుడు బ్రహ్మచారిగా అవతరించినాడు
ఆ బ్రహ్మచారి తపస్సుతో ప్రజాపతి అయినాడు
ప్రజాపత విరాట్టు అవుతాడు
స్వతంత్రుడైన ఆయన ఇంద్రుడైనాడు ॥ 16 ॥

మంత్రము :

బ్రహ్మచర్యేణ తపసా రాజా రాష్ట్రం వి రక్షతి ।
ఆచార్యో౽ బ్రహ్మచర్యేణ బ్రహ్మచారిణ మిచ్ఛతే ॥ 17 ॥

పదము :

బ్రహ్మఽచర్యేణ । తపసా । రాజా । రాష్ట్రమ్ । వి । రక్షతి ।
ఆఽచార్యఽః । బ్రహ్మఽచర్యేణ । బ్రహ్మఽచారిణమ్ । ఇచ్ఛతే
॥ 17 ॥

అనువాదం :

బ్రహ్మచర్యంతో, తపస్సుతో రాజు
రాజ్యాన్ని విశేషించి పాలిస్తాడు
ఆచార్యుడు బ్రహ్మచర్యంతో
శిష్యుని లభింపజేసుకుంటాడు ॥ 17 ॥

మంత్రము

బ్రహ్మచర్యేణ కన్యా౩ యువానం విన్దతే పతిమ్ ।
అనడ్వాన్ బ్రహ్మచర్యేణాశ్వో ఘాసం జిగీర్షతి ॥ 18 ॥

పదము :

బ్రహ్మఽచర్యేణ । కన్యాఽ । యువానమ్ । విన్దతే । పతిమ్ ।
అనడ్వాన్ । బ్రహ్మఽచర్యేణ । అశ్వః । ఘాసమ్ । జిగీర్షతి ॥ 18 ॥

అనువాదం :

బ్రహ్మచర్యంతో కన్య యువకుని
పతిగా పొందుతుంది
వృషభం బ్రహ్మచర్యంతో ఉత్కృష్టపతిని
( యజమానుని పొందుతుంది )
అలాగే అశ్వమునకు బ్రహ్మచర్యంతో
తృణాదికము లభ్యమౌతుంది ॥ 18 ॥

మంత్రము :

బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యు మపాఘ్నత ।

ఇన్ద్రో హ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వ1 రాభరత్ ॥ 19 ॥

పదము

బ్రహ్మఽచర్యేణ । తపసా । దేవాః । మృత్యుమ్ । అప । అఘ్నత ।

ఇన్ద్రః । హ । బ్రహ్మఽచర్యేణ । దేవేభ్యః । స్వఽః । ఆ । అభరత్ ॥ 19 ॥

అనువాదం :

బ్రహ్మచర్యరూపమైన తపస్సుతో
అగ్న్యాది దేవతలు మృత్యువును నిర్జించినారు
ఇంద్రుడు బ్రహ్మచర్యంతోనే దేవతలకై
స్వర్గాన్ని అహరించినాడు ॥ 19 ॥

మంత్రము

ఓషధయో భూతభవ్య మహోరాత్రే వనస్పతిః ।

సంవత్సరః సహర్తుభి స్తే జాతా బ్రహ్మచారిణః ॥ 20 ॥

పదము :

ఓషధయః । భూతఽభవ్యమ్ । అహోరాత్రే ఇతి । వనస్పతిః ।

సమ్ఽవత్సరః । సహ । ఋతుఽభిః । తే । జాతాః । బ్రహ్మఽచారిణః ॥ 20 ॥

అనువాదం:

ఓషధులు, భూత భవిష్యత్తులు, అహోరాత్రులు
వనస్పతి, సంవత్సరకాలం,
ఋతువులతో పాటు ఇవన్నీ కూడా
బ్రహ్మచర్య మాహాత్మ్యం వల్ల ఉత్పన్నమైనవే. ॥ 20 ॥

మంత్రము:

పార్థివా దివ్యాః పశవ
ఆరణ్యా గ్రామ్యాశ్చ యే।
అపక్షాః పక్షిణశ్చ యే
తే జాతా బ్రహ్మచారిణః ॥ 21 ॥

పదము:

పార్థివాః। దివ్యాః। పశవః।
ఆరణ్యాః। గ్రామ్యాః। చ। యే।
అపక్షాః। పక్షిణః। చ। యే।
తే। జాతాః। బ్రహ్మ౽చారిణః ॥ 21 ॥

అనువాదం:

భూలోకంలోని జనులు, దివిలోని దేవతలు
అరణ్యంలోని సింహశార్దూల హరిణాది జంతువులు,
గ్రామీణములైన గవాశ్వమహిషాదులు-

ఇలాంటి పశువులన్నీ పక్షరహితములైన ప్రాణులు
ఇలాంటి పక్షరహితములైన ప్రాణులు
పక్షవంతములైన ప్రాణులు-ఇవన్నీ కూడా
బ్రహ్మచర్యమహిమ వల్ల ఉత్పన్నమైనవే। ॥ 21 ॥

మంత్రము

పృథక్ సర్వే ప్రాజాపత్యాః
ప్రాణా నాత్మను బిభ్రతి ।
తా న్త్సర్వాన్ బ్రహ్మ రక్షతి
బ్రహ్మచారి ణ్యాభృతమ్ ॥ 22 ॥

పదము

పృథక్ । సర్వే । ప్రాజాఽపత్యాః ।
ప్రాణాన్ । ఆత్మఽసు । బిభ్రతి ।
తాన్ । సర్వాన్ । బ్రహ్మ । రక్షతి ।
బ్రహ్మఽచారిణి । ఆఽభృతమ్ ॥ 22 ॥

అనువాదం :

ప్రజాపతి సృష్టించిన దేవమనుష్యాదులు సర్వులూ
తమలోనే ప్రాణములను వేరు వేరుగా నిలుపుకుంటారు
ఆ ప్రాణము లన్నింటినీ బ్రహ్మచారిలో
ఆచార్యముఖం నుంచి ఆహృతమైన,
వేదాత్మకమైన బ్రహ్మ పరిపాలిస్తుంది ॥ 22 ॥

మంత్రము :

దేవానా మేతత్ పరిషూత

మనభ్యారూఢం చరతి రోచమానమ్ ।

తస్మా జ్జాతం బ్రాహ్మణం బ్రహ్మ జ్యేష్ఠం

దేవాశ్చ సర్వే అమృతేన సాకమ్ ॥ 23 ॥

పదము :

దేవానామ్ । ఏతత్ । పరిఽసూతమ్ ।

అనభిఽఆరూఢమ్ । చరతి । రోచమానమ్ ।

తస్మాత్ । జాతమ్ । బ్రాహ్మణమ్ । బ్రహ్మ । జ్యేష్ఠమ్ ।

దేవాః । చ । సర్వే । అమృతేన । సాకమ్ ॥ 23 ॥

అనువాదం :

ఈ సర్వాపరోక్ష పరబ్రహ్మ దేవతలచే పరిగృహీతమైనది
ఈ స్వయంప్రకాశమానమైన బ్రహ్మ
పరాక్రాంతం కాక వర్తిస్తుంది
దాని సకాశం నుంచి బ్రహ్మసంబంధమైన
ప్రశస్త వేదాత్మక బ్రహ్మ ప్రాదుర్భవించింది
అగ్న్యాది దేవతలందరూ అమృతంతో పాటు జనించినారు ॥23॥

మంత్రము :

బ్రహ్మచారీ బ్రహ్మ భ్రాజద్ బిభర్తి

తస్మిన్ దేవా అధి విశ్వే సమోతాః ।

ప్రాణాపానౌ జనయ న్నాద్ వ్యానం

వాచం మనో హృదయం బ్రహ్మ మేధామ్ ॥ 24 ॥

పదము :

బ్రహ్మఽచారీ । బ్రహ్మ । భ్రాజత్ । బిభర్తి ।

తస్మిన్ । దేవాః । అధి । విశ్వే । సమ్ఽఓతాః ।

ప్రాణాపానౌ । జనయన్ । ఆత్ । విఽఅనమ్ ।

వాచమ్ । మనః । హృదయమ్ । బ్రహ్మ । మేధామ్ ॥ 24 ॥

అనువాదం

బ్రహ్మచారి దీప్యమానమైన వేదాత్మక బ్రహ్మను భరిస్తున్నాడు
ఆయనపై సర్వదేవతలు సంబద్ధులై ఉన్నారు
అతడే సర్వ ప్రాణాపానములను ఉత్పన్నం చేసి
ఆ తర్వాత వ్యానాన్ని, వాక్కును, మనస్సును,
హృదయాన్ని, బ్రహ్మను, మేధస్సును
ఈ సర్వాన్ని సృష్టించి భరిస్తున్నాడు ॥ 24 ॥

మంత్రము

చక్షుః శ్రోత్రం యశో అస్మాసు ధే

హ్యన్నం రేతో లోహిత ముదరమ్ ॥ 25 ॥

పదము

చక్షుః । శ్రోత్రమ్ । యశః । అస్మాసు । ధేహి ।

అన్నమ్ । రేతః । లోహితమ్ । ఉదరమ్ ॥ 25 ॥

అనువాదం :

ఓ బ్రహ్మ! స్తోతలమైన మాలో నేత్రములను, శ్రోత్రములను,
సర్వేంద్రియములను, కీర్తిని ప్రసవరిల్లజెయ్యి
అలాగే అన్నము, రేతస్సు, రక్తము, ఉదరము- ॥ 25 ॥

మంత్రము

తాని కల్పద్ బ్రహ్మచారీ సలిలస్య పృష్ఠే
తపో௨తిష్ఠత్ తప్యమానః సముద్రే ।
స స్నాతో బభ్రుః పిఙ్గలః
పృథివ్యాం బహు రోచతే ॥ 26 ॥

పదము :

తాని । కల్పత్ । బ్రహ్మ௨చారీ । సలిలస్య । పృష్ఠే ।
తపః । అతిష్ఠత్ । తప్యమానః । సముద్రే ।
సః । స్నాతః । బభ్రుః । పిఙ్గలః ।
పృథివ్యామ్ । బహు । రోచతే ॥ 26 ॥

అనువాదం :

ఇవన్నీ బ్రహ్మచారి కల్పించి, ఉదకమధ్యంలో
తపస్సు చేస్తూ సముద్రంలో ఉన్నాడు
ఆ తపస్వి అయిన బ్రహ్మచారి ఎల్లవేళలా
స్నానంతో పవిత్రీకృతుడై, బభ్రువర్ణుడై,
పింగళవర్ణుడై భూమిపై అత్యధికంగా ప్రకాశిస్తున్నాడు ॥26॥

ఇది ఐదవ సూక్తం

## సూక్తం-6

ఋషి: శన్తాతి॥ దేవతలు మంత్రములలో పేర్కొన్న అగ్ని మొదలగువారు॥ ఛందస్సు 1-22 అనుష్టుప్ 23 బృహతీ గర్భానుష్టుప్: మంత్రములు ॥ 23 ॥

వినియోగం - ఈ సూక్తం అర్ధసూక్తం బృహద్గణంలో లఘుగణంలో దీనిని పఠించడం వల్ల శాంత్యుదకాభిమంత్రణాదులలో దీనికి వినియోగం ఇందులో 'భవాశర్వావిదం', 'యా దేవీ పఞ్చ 'యన్మాతలీ రథక్రీతం' అనే నాలుగు ఋక్కులు కాక మిగతవాటిని అంహోలింగ గణంలో పఠించడం వల్ల సర్వభైషజ్యాది కర్మలలో దీనికి వినియోగం

మంత్రము:

అగ్నిం బ్రూమో వనస్పతీ-

నోషధీ రుత వీరుధః ।

ఇన్ద్రం బృహస్పతిం సూర్యం

తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 1 ॥

పదము,

అగ్నిమ్ । బ్రూమః । వనస్పతీన్ ।

ఓషధీః । ఉత । వీరుధః ।

ఇన్ద్రమ్ । బృహస్పతిమ్ । సూర్యమ్ ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 1 ॥

అనువాదం :

అగ్నిని స్తుతిస్తున్నాము.
వనస్పతులను, ఓషధులను,
అరణ్య లతాదులను స్తుతిస్తున్నాము.
అలాగే ఇంద్రుని, బృహస్పతిని, సూర్యుని స్తుతిస్తున్నాము.
వారందరూ మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 1 ॥

మంత్రము :

బ్రూమో రాజానం వరుణం
మిత్రం విష్ణు మథో భగమ్ ।
అంశం వివస్వన్తం బ్రూమ-
స్తే నో ముఞ్చ స్త్వంహసః ॥ 2 ॥

పదము :

బ్రూమః । రాజానమ్ । వరుణమ్ ।
మిత్రమ్ । విష్ణుమ్ । అథో ఇతి । భగమ్ ।
అంశమ్ । వివస్వన్తమ్ । బ్రూమః ।
తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 2 ॥

అనువాదం :

ప్రభువైన వరుణదేవుని స్తుతిస్తున్నాము.
మిత్రుని, విష్ణువును, భగుని, అంశుని,

వివస్వంతుని స్తుతిస్తున్నాము
వీరందరూ మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 2 ॥

మంత్రము :

బ్రూమో దేవం సవితారం
ధాతార ముత పూషణమ్ ।
త్వష్టార మగ్రియం బ్రూమ-
స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 3 ॥

పదము

బ్రూమః । దేవమ్ । సవితారమ్ ।
ధాతారమ్ । ఉత । పూషణమ్ ।
త్వష్టారమ్ । అగ్రియమ్ । బ్రూమః ।
తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 3 ॥

అనువాదం :

దేవుడై, సర్వప్రేరకుడైన సవితను స్తుతిస్తున్నాము
ధాతను, పూషను స్తుతిస్తున్నాము
ప్రథమగణ్యుడైన త్వష్టను స్తుతిస్తున్నాము
వారందరూ మమ్ము పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 3 ॥

మంత్రము

గన్ధర్వాప్సరసో బ్రూమో

అశ్వినా బ్రహ్మణ స్పతిమ్ ।

అర్యమా నామ యో దేవ-

స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 4 ॥

పదము,

గన్ధర్వ౨అప్సరసః । బ్రూమః ।

అశ్వినా । బ్రహ్మణః । పతిమ్ ।

అర్యమా । నామ । యః । దేవః ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 4 ॥

అనువాదం

గంధర్వులను, అప్సరసలను స్తుతిస్తున్నాము
అశ్వినీదేవతలను స్తుతిస్తున్నాము
వేదరాశికి స్వామి అయిన అర్యముడనే దేవుని స్తుతిస్తున్నాము
వారందరూ మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 4 ॥

మంత్రము

అహోరాత్రే ఇదం బ్రూమః

సూర్యాచన్ద్రమసా వుభా ।

విశ్వా నాదిత్యాన్ బ్రూమ-
స్తే నో ముఞ్చన్త్వంహసః ॥ 5 ॥

పదము :

అహోరాత్రే ఇతి । ఇదమ్ । బ్రూమః ।
సూర్యాచన్ద్రమసౌ । ఉభా ।
విశ్వాన్ । ఆదిత్యాన్ । బ్రూమః ।
తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 5 ॥

అనువాదం :

అహోరాత్రులను గూర్చి ఈ స్తుతి చేస్తున్నాము.
సూర్యచంద్రులను ఇరువురను స్తుతిస్తున్నాము. ॥ 5 ॥

మంత్రము :

వాతం బ్రూమః పర్జన్య-
మన్తరిక్ష మథో దిశః ।
ఆశాశ్చ సర్వా బ్రూమ-
స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 6 ॥

పదము :

వాతమ్ । బ్రూమః । పర్జన్యమ్ ।
అన్తరిక్షమ్ । అథో ఇతి । దిశః ।

ఆశాః । చ । సర్వాః । బ్రూమః ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 6 ॥

అనువాదం :

వాయుదేవుని స్తుతిస్తున్నాము.
పర్జన్యుని స్తుతిస్తున్నాము.
అంతరిక్షాన్ని స్తుతిస్తున్నాము.
దిగ్దేవతలను, విదిశలను-వీరందరినీ స్తుతిస్తున్నాము.
వారందరూ మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 6 ॥

మంత్రము :

ముఞ్చన్తు మా శపథ్యా౨-

దహోరాత్రే అథో ఉషాః ।

సోమో మా దేవో ముఞ్చన్తు

య మాహు శ్చన్ద్రమా ఇతి ॥ 7 ॥

పదము :

ముఞ్చన్తు । మా । శపథ్యా౨త్ ।

అహోరాత్రే ఇతి । అథోఇతి । ఉషాః ।

సోమః । మా । దేవః । ముఞ్చన్తు ।

యమ్ । ఆహుః । చన్ద్రమాః । ఇతి ॥ 7 ॥

**అనువాదం :**

శపథ ప్రభవ పాపం నుంచి
అహోరాత్రులు, ఉషఃకాలాలు, సోమదేవుడు
నిన్ను విముక్తి చెందింతురు గాక!
ఆ సోమునే 'చంద్రమాః' అని
అభిజ్ఞులు అంటారు. ॥ 7 ॥

**మంత్రము :**

పార్థివా దివ్యాః పశవ
ఆరణ్యా ఉత యే మృగాః ।
శకున్తాన్ పక్షిణో బ్రూమ-
స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 8 ॥

**పదము :**

పార్థివాః । దివ్యాః । పశవః ।
ఆరణ్యాః । ఉత । యే । మృగాః ।
శకున్తాన్ । పక్షిణః । బ్రూమః ।
తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 8 ॥

**అనువాదం :**

భూలోకమునకు చెందిన, ద్యులోకమునకు చెందిన
పశువులు, అరణ్యంలోని మృగాదులు
శకునభూతములైన పక్షులు

మొదలగు వానిని స్తుతిస్తున్నాము.
అవి మమ్ములను పాపం నుంచి
విముక్తి చెందించు గాక! ॥ 8

మంత్రము:

భవాశర్వా విదం బ్రూమో
రుద్రం పశుపతిశ్చ యః ।
ఇషూ ర్యా ఏషాం సంవిద్మ
తా నః సన్తు సదా శివాః ॥ 9 ॥

పదము:

భవాశర్వౌ । ఇదమ్ బ్రూమః ।
రుద్రమ్ । పశుఽపతిః । చ । యః ।
ఇషూః । యాః । ఏషామ్ । సమ్ఽవిద్మ ।
తాః । నః । సన్తు । సదా । శివాః ॥ 9 ॥

అనువాదం:

భవాశర్వులను గూర్చి
ఈ స్తుతివాక్యాన్ని పలుకుతున్నాము.
అలాగే రుద్రుని స్తుతిస్తున్నాము.
పశుపతిని స్తుతిస్తున్నాము.
ఈ దేవతల బాణములు మాకు తెలియును.
అవి మాకు సర్వదా సుఖహేతువులగు గాక! ॥ 9 ॥

మంత్రము :

దివం బ్రూమో నక్షత్రాణి

భూమిం యక్షాణి పర్వతాన్ ।

సముద్రా నద్యోవేశన్తా-

స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 10 ॥

పదము :

దివమ్ । బ్రూమః । నక్షత్రాణి ।

భూమిమ్ । యక్షాణి । పర్వతాన్ ।

సముద్రాః । నద్యః । వేశన్తాః ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 10 ॥

అనువాదం :

ద్యులోకాన్ని స్తుతిస్తున్నాము
దానినాశ్రయించి ఉన్న నక్షత్రాలను స్తుతిస్తున్నాము
అలాగే భూమిని స్తుతిస్తున్నాము
అందలి పుణ్య క్షేత్రాలను స్తుతిస్తున్నాము
అలాగే పర్వతాలను స్తుతిస్తున్నాము
సముద్రాలను స్తుతిస్తున్నాము
నదులను స్తుతిస్తున్నాము
సరోవరాదులను స్తుతిస్తున్నాము
అవన్నీ మమ్ములను పాపం నుంచి
విముక్తి చెందించు గాక ! ॥ 10 ॥

మంత్రము :

సప్తర్షీన్ వా ఇదం బ్రూమో౽-

పో దేవీః ప్రజాపతిమ్ ।

పితౄన్ యమశ్రేష్ఠాన్ బ్రూమ-

స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 11 ॥

పదము:

సప్త౽ఋషీన్ । వై । ఇదమ్ । బ్రూమః ।

అపః । దేవీః । ప్రజా౽పతిమ్ ।

పితౄన్ । యమ౽శ్రేష్ఠాన్ । బ్రూమః ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 11 ॥

అనువాదం :

సప్తర్షులను గూర్చే కదా ఈ స్తోత్రం చేస్తున్నాము
అలాగే ఈ ఆపోదేవతలను స్తుతిస్తున్నాము
ప్రజాపతిని స్తుతిస్తున్నాము
యమాధిష్ఠితులైన పితరులను అలాగే స్తుతిస్తున్నాము
వారు మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక ! ॥ 11 ॥

మంత్రము :

యే దేవా దివిషదో

అన్తరిక్షసదశ్చ యే ।

పృథివ్యాం శక్రా యే శ్రితా-

స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 12 ॥

పదము

యే । దేవాః । దివిఽసదః ।

అన్తరిక్షఽసదః । చ । యే ।

పృథివ్యామ్ । శక్రాః । యే । శ్రితాః ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 12 ॥

అనువాదం

ద్యులోకంలో ఉపవిష్టులై ఉన్న దేవతలు,
అంతరిక్షంలో ఉపవిష్టులై ఉన్న దేవతలు,
భూలోకంలో శక్తులై ఉన్న దేవతలు,
దాని నాశ్రయించి ఉన్న దేవతలు-
వీరందరూ మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 12 ॥

మంత్రము :

ఆదిత్యా రుద్రా వసవో

దివి దేవా అథర్వాణః ।

అఙ్గిరసో మనీషిణ

స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 13 ॥

పదము :

ఆదిత్యాః । రుద్రాః । వసవః ॥
దివి । దేవాః । అథర్వాణః ।
అఙ్గిరసః । మనీషిణః ।
తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 13 ॥

అనువాదం :

ద్వాదశాదిత్యులు, ఏకాదశ రుద్రులు,
అష్టవసువులు, దివిలోనున్న దేవతలు-
వీరిని, అథర్వవేదద్రష్టలైన అథర్వాణులను,
అంగిరసులను మనీషులైన వారందరిని
మేము స్తుతిస్తున్నాము.
వారు మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 13 ॥

మంత్రము :

యజ్ఞం బ్రూమో యజమాన-
మృచః సామాని భేషజా ।
యజూంషి హోత్రా బ్రూమ-
స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 14 ॥

**పదము :**

**యజ్ఞమ్ । బ్రూమః । యజమానమ్ ।**

**ఋచః । సామాని । భేషజా ।**

**యజూంషి । హోత్రాః । బ్రూమః ।**

**తే । నః । ముఞ్చన్తు । అంహసః** ॥ 14 ॥

**అనువాదం :**

యజ్ఞాన్ని స్తుతిస్తున్నాము.
యజమానుని స్తుతిస్తున్నాము.
ఋక్కులను, సామములను, శాంతికరములైన
వామదేవ్యాది భేషజములను, యజస్సులను,
హోతలైన వారిని స్తుతిస్తున్నాము.
వారు మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 14 ॥

**మంత్రము :**

**పఞ్చ రాజ్యాని వీరుధాం**

**సోమశ్రేష్ఠాని బ్రూమః ।**

**దర్భో భఙ్గో యవః సహ-**

**స్తే నో ముఞ్చ న్త్వంహసః** ॥ 15 ॥

పదము :

పళ్ళ । రాజ్ఞ్యాని । వీరుధామ్ ।

సోమ౨శ్రేష్ఠాని । బ్రూమః ।

దర్భః । భఙ్గః । యవః । సహః ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 15 ॥

అనువాదం:

ఓషధులకు చెందిన పత్ర, కాండ, పుష్ప, ఫల,
మూలాత్మకములైన ఐదింటిని స్తుతిస్తున్నాము.
దర్భ, భంగ, యవాది ఓషధీవిశేషములను
మేము స్తుతిస్తున్నాము.
అవి మమ్ములను పాపం నుంచి విముక్తులను చేయు గాక! ॥15॥

మంత్రము :

అరాయాన్ బ్రూమో రక్షాంసి

సర్పాన్ పుణ్యజనాన్ పితౄన్ ।

మృత్యూ నేకశతం బ్రూమ

స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 16 ॥

పదము :

అరాయాన్ । బ్రూమః । రక్షాంసి ।

సర్పాన్ । పుణ్య౨జనాన్ । పితౄన్ ।

మృత్యూన్ । ఏక౽శతమ్ । బ్రూమః ।
తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 16 ॥

**అనువాదం :**

దానప్రతిబంధకులను స్తుతిస్తున్నాము.
అలాగే రాక్షసులను, సర్పములను,
యాతుధానులను, పితరులను, మృత్యుదేవతలను.
ఏకోత్తర శతసంఖ్యాకులను స్తుతిస్తున్నాము.
వారు మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 16 ॥

**మంత్రము :**

ఋతూన్ బ్రూమ ఋతుపతీ-
నార్తవా నుత హాయనాన్ ।
సమాః సంవత్సరాన్ మాసాం-
స్తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 17 ॥

**పదము :**

ఋతూన్ । బ్రూమః । ఋతు౽పతీన్ ।
ఆర్తవాన్ । ఉత । హాయనాన్ ।
సమాః । సమ్౽వత్సరాన్ । మాసాన్ ।
తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 17 ॥

అనువాదం :

ఋతువులను స్తుతిస్తున్నాము.

*ఋతుపతులను స్తుతిస్తున్నాము.

అలాగే ఋతుసంబంధ పదార్థములను,

'చంద్ర, సౌర, సావన' నామములతో

త్రివిధములైన సంవత్సరములను,

చైత్రాది మాసములను – వీటి నన్నిటినీ స్తుతిస్తున్నాము.

అవి మమ్ములను పాపం నుంచి

విముక్తులను చేయు గాక! ॥ 17 ॥

మంత్రము :

ఏత దేవా దక్షిణతః

పశ్చాత్ ప్రాఞ్చ ఉదేత ।

పురస్తా దుత్తరా చ్ఛక్రా

విశ్వే దేవాః సమేత్య

తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 18 ॥

---

* వసంత ఋతువుకు వసువులు అధిపతులు.

గ్రీష్మమునకు రుద్రులు అధిపతులు.

వర్ష ఋతువుకు ఆదిత్యులు అధిపతులు.

శరత్తునకు ఋభువులు అధిపతులు.

హేమంతమునకు, శిశిరమునకు మరుత్తులు అధిపతులు.

**పదము :**

**ఆ । ఇత । దేవాః । దక్షిణతః ।**

**పశ్చాత్ । ప్రాఞ్చః । ఉత్ఽఏత ।**

**పురస్తాత్ । ఉత్తరాత్ । శక్రాః ।**

**విశ్వే । దేవాః । సమ్ఽఏత్య ।**

**తే । నః । ముఞ్చన్తు । అంహసః** ॥ 18 ॥

**అనువాదం :**

ఓ దేవతలారా ! దక్షిణదిశలో నున్న మీరు దయచేయండి.
పశ్చిమ దిశలో నున్న మీరు దయచేయండి.
ప్రాగ్దిశలో నున్న మీరు దయచేయండి.
మాముందు, ఉత్తరదిశయందున్న మీరంతా
సమాగతులై మమ్ములను
పాపం నుంచి విముక్తి చెందించండి. ॥ 18 ॥

మంత్రము :

**విశ్వాన్ దేవా నిదం బ్రూమః**

**సత్యసంధా నృతావృధః ।**

**విశ్వాభిః పత్నీభిః సహ**

**తే నో ముఞ్చ న్త్వంహసః** ॥ 19 ॥

పదము :

విశ్వాన్ । దేవాన్ । ఇదమ్ । బ్రూమః ।

సత్య౽సంధాన్ । ఋత౽వృధః ।

విశ్వాభిః । పత్నీభిః । సహ ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 19 ॥

అనువాదం :

విశ్వేదేవతలను ఉద్దేశించి
ఈ స్తుతివచనాన్ని పలుకుతున్నాము.
వారు సత్యసంధులు. ఋతవర్ధకులు.
విశ్వాఖ్యలైన దేవీగణంతో పాటు వారందరినీ స్తుతిస్తున్నాము.
వారు మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 19 ॥

మంత్రము :

సర్వాన్ దేవా నిదం బ్రూమః

సత్యసంధా నృతావృధః ।

సర్వాభిః పత్నీభిః సహ

తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 20 ॥

పదము :

సర్వాన్ । దేవాన్ । ఇదమ్ । బ్రూమః ।

సత్య౽సంధాన్ । ఋత౽వృధః ।

సర్వాభిః । పత్నీభిః । సహ ।

తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 20 ॥

అనువాదం :

సర్వదేవతలను దీనితో స్తుతిస్తున్నాము.
వారు సత్యసంధులు.
ఋతవర్ధకులు, సర్వపత్నీసహితులు
అయిన వారిని స్తుతిస్తున్నాము.
వారు మమ్ములను పాపం నుంచి
విముక్తులను చేయుదురు గాక! ॥ 20 ॥

మంత్రము :

భూతం బ్రూమో భూతపతిం
భూతానా ముత యో వశీ ।
భూతాని సర్వా సంగత్య
తే నో ముఞ్చ న్త్వంహసః ॥ 21 ॥

పదము :

భూతమ్ । బ్రూమః । భూతఽపతిమ్ ।
భూతానామ్ । ఉత । యః । వశీ ।
భూతాని । సర్వా । సమ్ఽగత్య ।
తే । నః । ముఞ్చన్తు । అంహసః ॥ 21 ॥

**అనువాదం :**

భూతకాలమును స్తుతిస్తున్నాము.
భూతపతిని స్తుతిస్తున్నాము.
మరిన్ని ఆ భూతములన్నింటికీ నియంత
అయిన వానిని స్తుతిస్తున్నాము.
ఆ సర్వభూతములు సమాగతములై
మమ్ములను పాపం నుంచి విముక్తులను చేయు గాక! ॥21॥

**మంత్రము :**

యా దేవీః పఞ్చ ప్రదిశో
యే దేవా ద్వాదశర్తవః ।
సంవత్సరస్య యే దంష్ట్రా-
స్తే నః సన్తు సదా శివాః ॥ 22 ॥

**పదము :**

యాః । దేవీః । పఞ్చ । ప్రఽదిశః ।
యే । దేవాః । ద్వాదశ । ఋతవః ।
సమ్ఽవత్సరస్య । యే । దంష్ట్రాః ।
తే । నః । సన్తు । సదా । శివాః ॥ 22 ॥

**అనువాదం :**

పంచ సంఖ్యాకములైన ప్రధాన దిక్కులు దేవీరూపములు.
అలాగే ద్వాదశ సంఖ్యాకములైన

ఋతుదేవతలు, సంవత్సరాత్మకమైన
ప్రజాపతి, ఆయన దంతవిశేషములు-
ఇవన్నీ మాకు సర్వదా శివంకరములగు గాక ! ॥ 22 ॥

మంత్రము :

య న్మాతలీ రథక్రీత-

మమృతం వేద భేషజమ్ ।

త దిన్ద్రో అప్సు ప్రావేశయత్

త దాపో దత్త భేషజమ్ ॥ 23 ॥

పదము :

యత్ । మాతలీ । రథఽక్రీతమ్ ।

అమృతమ్ । వేద । భేషజమ్ ।

తత్ । ఇన్ద్రః । అప్ఽసు । ప్ర । అవేశయత్ ।

తత్ । ఆపః । దత్త । భేషజమ్ ॥ 23 ॥

అనువాదం :

మాతలి రథక్రయంతో లభించిన
అమరణసాధనమైన ఔషధాన్ని ఎరుగును.
ఆ ఔషధాన్ని ఇంద్రుడు ఉదకములలో ప్రక్షేపం చేసినాడు.
ఓ ఉదకములారా ! మీరు ఆ ఔషధాన్ని
మాకు ప్రసాదించండి, ॥ 23 ॥

ఇది ఆరవ సూక్తం.

ఇది మూడవ అనువాకం.

## అనువాకం : 4

### సూక్తం _7

ఋషిః అథర్వుడు ॥ దేవతలు ఉచ్ఛిష్టము, అధ్యాత్మము ఛందస్సుః 1_5, 7_20, 18_27 అనుష్టుప్ 6 పురఉష్ణిగ్ బార్హతపరాఽనుష్టుప్ 21 స్వరాడనుష్టుప్ 22 విరాట్ పథ్యా బృహతీ॥ మంత్రములు ॥ 27 ॥

వినియోగం :_ ఈ సూక్తంలో బ్రహ్మౌదనమనే సవయజ్ఞంలో హుతశిష్టమైన ఓదనమునకు సర్వజగత్కారణభూతమైన బ్రహ్మతో అభేదాన్ని సూచిస్తూ స్తుతి కలదు

మంత్రము

ఉచ్ఛిష్టే నామ రూపం
చోచ్ఛిష్టే లోక ఆహితః ।
ఉచ్ఛిష్ట ఇన్ద్ర శ్చాగ్నిశ్చ
విశ్వ మన్తః సమాహితమ్ ॥ 1 ॥

పదము ॥

ఉత్ఽశిష్టే । నామ । రూపమ్ । చ ।
ఉత్ఽశిష్టే । లోకః । ఆఽహితః ।
ఉత్ఽశిష్టే । ఇన్ద్రః । చ । అగ్నిః । చ ।
। అన్తః । సమ్ఽఆహితమ్ ॥ 1 ॥

అనువాదం.

* ఉచ్ఛిష్టంలో నామధేయాత్మకమైన
శబ్దప్రపంచము, దానితో నిరూపణీయమైన
అర్థప్రపంచము ఆహితములై ఉన్నవి.
ఆ ఓదనంలో లోకం ఆహితమై ఉన్నది.
అందులోనే ద్యులోకాధిపతి ఇంద్రుడు,
అగ్ని-వీరిరువురు సమాహితులై ఉన్నారు.
విశ్వమంతా దాని నడుమ సమాహితమై ఉన్నది. ॥ 1 ॥

మంత్రము :

ఉచ్ఛిష్టే ద్యావాపృథివీ
విశ్వం భూతం సమాహితమ్ ।
ఆపః సముద్ర ఉచ్ఛిష్టే
చన్ద్రమా వాత ఆహితః ॥ 2 ॥

పదము :

ఉత్ఽశిష్టే । ద్యావాపృథివీ ఇతి ।
విశ్వమ్ । భూతమ్ । సమ్ఽఆహితమ్ ।
ఆపః । సముద్రః । ఉత్ఽశిష్టే ।
చన్ద్రమాః । వాతః । ఆఽహితః ॥ 2 ॥

---

*హోమం తరువాత మిగిలినది హుతావశిష్టము. అది భోజనానికై ఉద్దేశించిన ఓదనము.

అథర్వ. V 13

అనువాదం

ద్యావాపృథువులు ఉచ్ఛిష్టము నందు సమాహితమై ఉన్నవి
అందలి భూతజాతం సర్వమూ
ఆ ఉచ్ఛిష్టంలోనే సమాహితమై ఉన్నది
మరి ఉదకములు, వాటి సముదాయరూపమైన సముద్రము
ఆ ఉచ్ఛిష్టమునందే సమాహితమై ఉన్నవి
చంద్రుడు, వాయువు దానినే
ఆశ్రయించుకొని ఉన్నారు. ॥ 2 ॥

మంత్రము।

స న్నుచ్ఛిష్టే అసం శ్చోభౌ
మృత్యు ర్వాజః ప్రజాపతిః ।
లౌక్యా ఉచ్ఛిష్ట ఆయత్తా
వ్రశ్చ ద్రశ్చాపి శ్రీ ర్మయి ॥ 3 ॥

పదము :

సన్ । ఉత్ఽశిష్టే । అసన్ । చ । ఉభౌ ।
మృత్యుః । వాజః । ప్రజాఽపతిః ।
లౌక్యాః । ఉత్ఽశిష్టే । ఆఽయత్తాః ।
వ్రః । చ । ద్రః । చ । అపి । శ్రీః । మయి ॥ 3 ॥

అనువాదం :

సదసత్తులు రెండూ ఆ ఉచ్ఛిష్టము నందే ఉన్నవి,
మృత్యువు, దాని బలము,

వానిని సృష్టించిన ప్రజాపతి
అందులోనే సమాహితులై ఉన్నారు.
లోకంలోని ప్రజలు అందులోనే ఉన్నారు.
వరుణుడు, సోముడు కూడా
అందే అహితులై ఉన్నారు.
వారి అనుగ్రహం వల్ల సంపద
నాలో అహితమై ఉండు గాక! ॥ 3 ॥

మంత్రము:

దృఢో ద్రృంహస్థిరో న్యో
బ్రహ్మ విశ్వసృజో దశ ।
నాభి మివ సర్వత శ్చక్ర-
ముచ్ఛిష్టే దేవతాః శ్రితాః ॥ 4 ॥

పదము:

దృఢః । ద్రృంహఽస్థిరః । న్యః ।
బ్రహ్మ । విశ్వఽసృజః । దశ ।
నాభిమ్ఽఇవ । సర్వతః । చక్రమ్ ।
ఉత్ఽశిష్టే । దేవతాః । శ్రితాః ॥ 4 ॥

అనువాదం:

దృఢాంగము, ద్రృంహస్థిరము అయిన లోకం,
అందలి ప్రాణులు, బ్రహ్మ,

విశ్వస్రష్టలైన నవబ్రహ్మలు, వానిని సృష్టించిన దశబ్రహ్మలు-
వీరంతా ఉచ్ఛిష్టములో సమాహితులై ఉన్నారు.
మరిన్ని ఇంద్రాది దేవతలందరూ
చక్రమధ్యస్థమైన నాభి ( బండికుండ ) వలె
సర్వత్రా ఉన్న ఉచ్ఛిష్టాన్ని ఆశ్రయించి ఉన్నారు. ॥ 4 ॥

మంత్రము :

ఋక్ సామ యజు రుచ్ఛిష్ట
ఉద్గీథః ప్రస్తుతం స్తుతమ్ ।
హిఙ్కార ఉచ్ఛిష్టే స్వరః
సామ్నో మేడిశ్చ త న్మయి ॥ 5 ॥

పదము :

ఋక్ । సామ । యజుః । ఉత్ఽశిష్టే ।
ఉత్ఽగీథః । ప్రఽస్తుతమ్ । స్తుతమ్ ।
హిఙ్ఽకారః । ఉత్ఽశిష్టే । స్వరః ।
సామ్నః । మేడిః । చ । తత్ । మయి ॥ 5 ॥

అనువాదం :

ఋక్, సామ, యజుర్వేదములు ఉచ్ఛిష్టమునందు
సమాశ్రితములై ఉన్నవి.
అందులో *ఉద్గీథము, **ప్రస్తుతము,

---

* ఉద్గాత గానం చేసే భాగము.
** ప్రస్తోత గానం చేసే భాగము.

స్తుతము, *** హింకారము, **** స్వరము
సామవేదమునకు సంబంధించిన స్తోత్ర విశేషము
ఇవన్నీ ఉచ్ఛిష్టమును ఆశ్రయించే ఉన్నవి. ॥ 5 ॥

మంత్రము.

ఐన్ద్రాగ్నం పావమానం
మహానామ్నీ ర్మహావ్రతమ్ ।
ఉచ్ఛిష్టే యజ్ఞస్యాఙ్గా-
న్యన్త ర్గర్భ ఇవ మాతరి ॥ 6 ॥

పదము:

ఐన్ద్రాగ్నమ్ । పావమానమ్ ।
మహాఽనామ్నీః । మహాఽవ్రతమ్ ।
ఉత్ఽశిష్టే । యజ్ఞస్య । అఙ్గాని ।
అన్తః । గర్భఃఽఇవ । మాతరి ॥ 6 ॥

అనువాదం:

ఇంద్రాగ్నులను స్తుతించే సామము,
మూడు రకాల సవనములలో గానం చేసే సామము,
మహానామ్నములు అను ఋక్కులు,

---

*** సర్వ ఉద్గాతలు మొదలు హింకారాన్ని ప్రయోగిస్తారు.

**** క్రిష్ట, ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, మంద్ర, అతిమంద్ర అను సవి సప్తస్వరములు.

*మహావ్రతము - ఇవన్నీ యజ్ఞమునకు
అంగములైన ఉచ్ఛిష్టమధ్యంలో
మాతృగర్భంలో వలె వర్తిస్తుంటాయి. ॥ 6 ॥

మంత్రము

రాజసూయం వాజపేయ-
మగ్నిష్టోమ స్తదధ్వరః ।
అర్కాశ్వమేధా వుచ్ఛిష్టే
జీవబర్హి ర్మదిన్తమః ॥ 7 ॥

పదము

రాజ౽సూయమ్ । వాజ౽పేయమ్ ।
అగ్ని౽స్తోమః । తత్ । అధ్వరః ।
అర్క౽అశ్వమేధౌ । ఉత్౽శిష్టే ।
జీవ౽బర్హిః । మదిన్౽తమః ॥ 7 ॥

అనువాదం

రాజసూయము, వాజపేయము, అగ్నిష్టోమము,
అధ్వరము, అర్కాశ్వమేధములు-
ఇవన్నీ ఉచ్ఛిష్టంలో సమాశ్రితములై ఉన్నవి

---

* రాజన, గాయత్ర, బృహత్, రథంతర, భద్ర అను పంచసామములతో చేసే స్తోత్రము

జీవబర్హి, మదిన్తమ అనే సోమయాగాదులన్నీ
ఉచ్ఛిష్టంలో సమాశ్రితములై ఉన్నవి ॥ 7 ॥

మంత్రము:

అగ్న్యాధేయ మథో దీక్షా
కామప్ర శ్ఛన్దసా సహ ।
ఉత్పన్నా యజ్ఞాః సత్రా-
ణ్యుచ్ఛిష్టేఽధి సమాహితాః ॥ 8 ॥

పదము.

అగ్నిఽఆధేయమ్ । అథో ఇతి । దీక్షా ।
కామఽప్రః । ఛన్దసా । సహ ।
ఉత్ఽసన్నాః । యజ్ఞాః । సత్రాణి ।
ఉత్ఽశిష్టే । అధి । సమ్ఽఆహితాః ॥ 8 ॥

అనువాదం:

అగ్న్యాధేయము, తర్వాత తీసుకునే దీక్ష,
కామప్రశ్ఛన్దస్సు,
ఇందుతోపాటు ఉత్పన్న యజ్ఞములు, సత్రములు
మొదలైన ఈ విధములైన యాగములన్నీ
ఉచ్ఛిష్టమందు సమాశ్రితములై ఉన్నవి ॥ 8 ॥

మంత్రము :

అగ్నిహోత్రం చ శ్రద్ధా చ

వషట్కారో వ్రతం తపః ।

దక్షిణేష్టం పూర్తం-

చోచ్ఛిష్టేఽధి సమాహితాః ॥ 9 ॥

పదము :

అగ్నిఽహోత్రమ్ । చ । శ్రద్ధా । చ ।

వషట్ఽకారః । వ్రతమ్ । తపః ।

దక్షిణా । ఇష్టమ్ । పూర్తమ్ । చ ।

ఉత్ఽశిష్టే । అధి । సమ్ఽఆహితాః ॥ 9 ॥

అనువాదం :

అగ్నిహోత్రము, శ్రద్ధ, వషట్కారము,
వ్రతము, తపస్సు, దక్షిణ,
ఇష్టము, పూర్తము - ఇవన్నీ
ఉచ్ఛిష్టమునందు సమాహితములై ఉన్నవి ॥ 9 ॥

మంత్రము :

ఏకరాత్రో ద్విరాత్రః

సద్యః క్రీః ప్రక్రీ రుక్థ్యః ।

ఉతం నిహిత ముచ్ఛిష్టే

యజ్ఞస్యాణూని విద్యయా ॥ 10 ॥

పదము.

ఏకఽరాత్రః । ద్విఽరాత్రః ।

సద్యఃఽక్రీః । ప్రఽక్రీః । ఉక్థ్యః ।

ఆఽఉతమ్ । నిఽహితమ్ । ఉత్ఽశిష్టే ।

యజ్ఞస్య । అణూని । విద్యయా ॥ 10 ॥

అనువాదం.

ఏకరాత్రము, ద్విరాత్రము మొదలైన
అహీన సోమయాగములు,
సద్యఃక్రీ, ప్రక్రీ (ఏకాహసోమయాగ విశేషములు),
ఉక్థములు ఉచ్ఛిష్టమునందు
అబద్ధములై, నిక్షిప్తములై ఉన్నవి.
ఈ యజ్ఞసంబంధమైన సూక్ష్మరూపములు
భావనతో బ్రహ్మయందు నిహితములై ఉన్నవి. ॥ 10 ॥

మంత్రము.

చతూరాత్రః పఞ్చరాత్రః

షడ్రాత్ర శ్చోభయః సహ ।

షోడశీ సప్తరాత్ర

శ్చోచ్ఛిష్టా జజ్ఞిరే సర్వే

యే యజ్ఞా అమృతే హితాః ॥ 11 ॥

పదము

చతుఃఽరాత్రః । పఞ్చఽరాత్రః ।

షట్ఽరాత్రః । చ । ఉభయః । సహ ।

షోడశీ । సప్తఽరాత్రః । చ ।

ఉత్ఽశిష్టాత్ । జజ్ఞిరే । సర్వే ।

యే । యజ్ఞాః । అమృతే । హితాః ॥ 11 ॥

అనువాదం :

చతూరాత్రము, పంచరాత్రము, షడ్రాత్రము-
ఇవన్నీ, వీటిని ద్విగుణంగా చేసినవన్నీ,
షోడశీ, ఇతరము లు అయిన యజ్ఞములన్నీ-
అమృతత్వాన్ని ప్రసాదించే ఈ యజ్ఞములన్నీ
ఉచ్ఛిష్టమునుంచి సముద్భవించినవి ॥ 11 ॥

మంత్రము :

ప్రతీహారో నిధనం

విశ్వజి చ్చాభిజి చ్చ యః ।

సాహ్నాతిరాత్రా వుచ్ఛిష్టే

ద్వాదశాహోఽపి తన్మయి ॥ 12 ॥

పదము :

ప్రతి౽హారః । ని౽ధనమ్ ।
విశ్వ౽జిత్ । చ । అభి౽జిత్ । చ । యః ।
సాహ్న౽అతిరాత్రౌ । ఉత్౽శిష్టే ।
ద్వాదశ౽అహః । అపి । తత్ । మయి ॥ 12 ॥

అనువాదం :

ప్రతిహారము, నిధనము, విశ్వజిత్తు, అభిజిత్తు,
సాహ్నాతిరాత్రములు ఉచ్ఛిష్టమునందే
పరికల్పితములై ఉన్నవి.
ద్వాదశాహం కూడా అందే ఉన్నది.
ఇవన్నీ నాయందు ఆవేశించు గాక! ॥ 12 ॥

మంత్రము

సూనృతా సంనతిః క్షేమః
స్వధోర్జామృతం సహః ।
ఉచ్ఛిష్టే సర్వే ప్రత్యఞ్చః
కామాః కామేన తాతృపుః ॥ 13 ॥

పదము :

సూనృతా । సమ్౽నతిః । క్షేమః ।
స్వధా । ఊర్జా । అమృతమ్ । సహః ।

ఉత్ఽశిష్టే । సర్వే । ప్రత్యఞ్చః ।

కామాః । కామేన । తతృపుః ॥ 13 ॥

అనువాదం

సూనృతము (సత్యవాక్కు), సంనతి, క్షేమము,
స్వధా, ఊర్జస్సు (బలవర్ధకమైన అన్నము),
అమృతము, సహము - ఈ సర్వకామ్యమాన
ఫలవిశేషములు ఉచ్ఛిష్టమునందే
సమాశ్రితములై ఉన్నవి
ఆత్మాభిముఖంగా ఉన్న కామ్యమాన
ఫలంతో యజమానిని తృప్తిచెందిస్తున్నవి ॥ 13 ॥

మంత్రము :

నవ భూమీః సముద్రా

ఉచ్ఛిష్టేఽధి శ్రితా దివః ।

ఆ సూర్యో భాత్యుచ్ఛిష్టేఽ-

హోరాత్రే అపి తన్మయి ॥ 14 ॥

పదము :

నవ । భూమీః । సముద్రాః । ఉత్ఽశిష్టే ।

అధి । శ్రితాః । దివః ।

ఆ । సూర్యః । భాతి । ఉత్ఽశిష్టే ।

అహోరాత్రే ఇతి । అపి । తత్ । మయి ॥ 14 ॥

అనువాదం :

నవఖండాత్మకమైన భూమి,
సప్తసముద్రములు, ద్యులోకంలో ఉన్న
ఉచ్ఛిష్టమునందు ఆశ్రితములై ఉన్నవి.
సూర్యుడు ఉచ్ఛిష్టము నుండి సర్వత్ర ప్రకాశిస్తున్నాడు.
అహోరాత్రులు కూడా దాని నాశ్రయించే ఉన్నవి.
ఈ చెప్పినవన్నీ నాలో భాసించు గాక! ॥ 14 ॥

మంత్రము :

ఉపహవ్యం విషూవన్తం
యే చ యజ్ఞా గుహా హితాః ।
బిభర్తి భర్తా విశ్వస్యో-
చ్ఛిష్టో జనితుః పితా ॥ 15 ॥

పదము :

ఉపఽహవ్యమ్ । విషుఽవన్తమ్ ।
యే । చ । యజ్ఞాః । గుహా । హితాః ।
బిభర్తి । భర్తా । విశ్వస్య ।
ఉత్ఽశిష్టః । జనితుః । పితా ॥ 15 ॥

అనువాదం :

ఉపహవ్యము, షూవ *విన్తము అనే సోమయాగాలను,
ఇతర యజ్ఞాలను, గుహాంతరగతములై ఉన్న
యజ్ఞములను, ఈ ఉచ్ఛిష్టం భరిస్తున్నది
విశ్వభర్త, తజ్జనకుడు పుణ్యలోకములందు
దాని పిత - వీరందరూ ఆ ఓదనమే అయి ఉన్నారు ॥ 15 ॥

మంత్రము :

పితా జనితురుచ్ఛిష్టోఽ-
సోః పౌత్రః పితామహః ।
స క్షియతి విశ్వస్యేశానో
వృషా భూమ్యా మతిఘ్న్యఽః ॥ 16 ॥

పదము :

పితా । జనితుః । ఉత్ఽశిష్టః ।
అసోః । పౌత్రః । పితామహః ।
సః । క్షియతి । విశ్వస్య । ఈశానః ।
వృషా । భూమ్యామ్ । అతిఽఘ్న్యఽః ॥ 16 ॥

---

* సంవత్సరానికి చెందిన పూర్వోత్తర పక్షమధ్యంలో ఏకవింశస్తోమకంగా అనుష్ఠేయమైన సోమయాగము

అనువాదం.

ఉచ్ఛిష్టం సోత్పాదకునకు పిత.
ప్రాణమునకు పౌత్రుడు, పితామహుడు.
ఆ హుతావశిష్ట ఓదనం విశ్వమునకు ప్రభువై,
కామవర్షి అయి, మృత్యువును అతిక్రమించినదై,
పృథివియందు నివసిస్తున్నది. ॥ 16 ॥

మంత్రము:

ఋతం సత్యం తపో రాష్ట్రం
శ్రమో ధర్మశ్చ కర్మ చ।
భూతం భవిష్య దుచ్ఛిష్టే
వీర్యం లక్ష్మీ ర్బలం బలే ॥ 17 ॥

పదము:

ఋతమ్। సత్యమ్। తపః। రాష్ట్రమ్।
శ్రమః। ధర్మః। చ। కర్మ। చ।
భూతమ్। భవిష్యత్। ఉత్ఽశిష్టే।
వీర్యఽమ్। లక్ష్మీః। బలమ్। బలే ॥ 17 ॥

అనువాదం:

ఋతము, సత్యము, తపస్సు, రాష్ట్రము, శ్రమ,
ధర్మము, కర్మ, ఉత్పన్నమైన జగత్తు,
ఉత్పన్నం కానున్న జగత్తు - ఈ సర్వమూ
ఉచ్ఛిష్టము నందే ఆశ్రితములై ఉన్నవి.

అలాగే వీర్యము, లక్ష్మి, బలము,
బలవత్తరమైన ఆ ఓదనావశేషమునందు
సమాశ్రితములై ఉన్నవి ॥ 17 ॥

మంత్రము

సమృద్ధి రోజ ఆకూతిః

క్షత్రం రాష్ట్రం షడుర్వ్యః ।

సంవత్సరో ధ్యుచ్ఛిష్ట

ఇడా ప్రైషా గ్రహా హవిః ॥ 18 ॥

పదము:

సమ్ఽఋద్ధిః । ఓజః । ఆఽకూతిః ।

క్షత్రమ్ । రాష్ట్రమ్ । షట్ । ఉర్వ్యః ।

సమ్ఽవత్సరః । అధి । ఉత్ఽశిష్టే ।

ఇడా । ప్రఽఏషాః । గ్రహాః హవిః ॥ 18 ॥

అనువాదం:

సమృద్ధి, ఓజస్సు, సంకల్పం, క్షాత్రతేజం,
రాజ్యం, * షడ్విధాలైన భూములు,
సంవత్సరము, ఇడానామ దేవత,
ఋత్విక్కులను ప్రేరేపించే మంత్రములు,
గ్రహములు, హవిస్సు ఈ ఉచ్ఛిష్టము పైనే
ఆధారపడి ఉన్నవి ॥ 18 ॥

---

* ద్యులోకము, పృథివి, అహోరాత్రులు, ఉదకములు, ఓషధులు

మంత్రము.

చతుర్హోతార ఆప్రియ-

శ్చాతుర్మాస్యాని నివిదః ।

ఉచ్ఛిష్టే యజ్ఞా హోత్రాః

పశుబన్ధా స్తదిష్టయః ॥ 19 ॥

పదము :

చతుఃఽహోతారః । ఆప్రియః ।

చాతుఃఽమాస్యాని । నిఽవిదః ।

ఉత్ఽశిష్టే । యజ్ఞాః । హోత్రాః ।

పశుఽబన్ధాః । తత్ । ఇష్టయః ॥ 19 ॥

అనువాదం :

* 'చతుర్హోతలు' అనే మంత్రములు,
పశుయాగ సంబంధమైన ప్రయాజలు,
చతుర్మాస్యములు, స్తోతవ్యగుణప్రకర్ష
నివేదన పరములైన మంత్రములు,
యాగములు, హోతలు, పశుయాగములు,
ఇష్టులు - ఇవన్నీ ఉచ్ఛిష్టము నందే
సమాశ్రితములై ఉన్నవి. ॥ 19 ॥

* తైత్తరీయకంలో పంచానువాకములుగా సమామ్నాతములైనవి. దశహోత, చతుర్హోత, పంచహోత, షడ్ఢోత, సప్తహోత అని క్రమంగా వీని పేర్లు ఉన్నప్పటికీ సామూహికంగా చతుర్హోతలనే పేరుతో వ్యవహరిస్తారు.

మంత్రము:

అర్ధమాసాశ్చ మాసా-

శ్చార్తవా ఋతుభిః సహ ।

ఉచ్ఛిష్టే ఘోషిణీ రాపః

స్తనయిత్నుః శ్రుతి ర్మహీ ॥ 20 ॥

పదము:

అర్ధ౽మాసాః । చ । మాసాః । చ ।

ఆర్తవాః । ఋతు౽భిః । సహ ।

ఉత్౽శిష్టే । ఘోషిణీః । అపః ।

స్తనయిత్నుః । శ్రుతిః । మహీ ॥ 20 ॥

అనువాదం:

పక్షములు, మాసములు, ఋతుసంబంధమైన
పదార్థవిశేషములు, ఋతువులు-
ఈ సర్వమూ ఉచ్ఛిష్టాన్ని ఆశ్రయించే ఉన్నవి.
పోషించే జలము, ఉరమే మబ్బులు,
పరిశుద్ధమైన భూమి - ఇవన్నీ కూడా
ఉచ్ఛిష్టమునందే సమాశ్రితములై ఉన్నవి. ॥ 20 ॥

మంత్రము:

శర్కరాః సికతా అశ్మాన

ఓషధయో వీరుధ స్తృణా ।

అభ్రాణి విద్యుతో వర్ష-
ముచ్ఛిష్టే సంశ్రితా శ్రితా ॥ 21 ॥

పదము :

శర్కరాః । సికతాః । అశ్మానః ।
ఓషధయః । వీరుధః । తృణా ।
అభ్రాణి । వి౽ద్యుతః । వర్షమ్ ।
ఉత్౽శిష్టే । సమ్౽శ్రితా । శ్రితా ॥ 21 ॥

అనువాదం :

గులకరాళ్ళు, ఇసుక, పాషాణములు, ఓషధులు,
లతలు, తృణములు, మేఘములు, మెఱపులు,
వర్షము - ఇవన్నీ ఉచ్ఛిష్టమునందే
సమవస్థితములై ఉన్నవి. ॥ 21 ॥

మంత్రము :

రాద్ధిః ప్రాప్తిః సమాప్తి-
ర్వ్యా౽ప్తి ర్మహ ఏధతుః ।
అత్యాప్తి రుచ్ఛిష్టే భూతి-
శ్చాహితా నిహితా హితా ॥ 22 ॥

పదము,

రాద్ధిః । ప్ర౽ఆప్తిః । సమ్౽ఆప్తిః ।

వి౽ఆప్తిః । మహః । ఏధతుః ।

అతి౽ఆప్తిః । ఉత్౽శిష్టే ।

భూతిః । చ । ఆ౽హితా । ని౽హితా । హితా ॥ 22 ॥

అనువాదం :

సంసిద్ధి, ప్రాప్తి, సమాప్తి, వ్యాప్తి,
తేజస్సు, అభివృద్ధి, అవ్యాప్తి,
సమృద్ధి, ఆహితములు, నిక్షిప్తములు-
ఇవన్నీ ఉచ్ఛిష్టమునందే స్థితములై ఉన్నవి. ॥ 22 ॥

మంత్రము :

యచ్చ ప్రాణతి ప్రాణేన
యచ్చ పశ్యతి చక్షుషా ।
ఉచ్ఛిష్టా జజ్ఞిరే సర్వే
దివి దేవా దివిశ్రితః ॥ 23 ॥

పదము :

యత్ । చ । ప్రాణతి । ప్రాణేన ।

యత్ । చ । పశ్యతి । చక్షుషా ।

ఉత్ఽశిష్టాత్ । జజ్ఞిరే । సర్వే ।

దివి । దేవాః । దివిఽశ్రితః ॥ 23 ॥

అనువాదం :

చైతన్యవంతమైనది, ప్రాణంతో
సంచలిస్తున్నది, ప్రాణిజాతమును
చక్షురింద్రియంతో చూచునది - ఇవన్నీ
ఉచ్ఛిష్టము నుండే జనించినవి.
సర్వదేవతలు, ద్యులోకస్థితులైన దేవతలు
ఉచ్ఛిష్టమునుండే జనించినారు. । 23 ।

మంత్రము

ఋచః సామాని ఛన్దాంసి

పురాణం యజుషా సహ ।

ఉచ్ఛిష్టా జ్జజ్ఞిరే సర్వే

దివి దేవా దివిశ్రితః ॥ 24 ॥

పదము.

ఋచః । సామాని । ఛన్దాంసి ।

పురాణమ్ । యజుషా । సహ ।

ఉత్ఽశిష్టాత్ । జజ్ఞిరే । సర్వే ।

దివి । దేవాః । దివిఽశ్రితః ॥ 24 ॥

అనువాదం

ఋక్కులు, సామములు, ఛందస్సులు,
పురాణములు, యజుస్సుతో పాటు ఇవన్నీ
ఉచ్ఛిష్టమునుండే జనించినవి
సర్వదేవతలు, ద్యులోకస్థితులైన దేవతలు
ఉచ్ఛిష్టమునుండే జనించినారు ॥ 24 ॥

మంత్రము

ప్రాణాపానౌ చక్షుః శ్రోత్ర
మక్షితిశ్చ క్షితిశ్చ యా ।
ఉచ్ఛిష్టా జ్జజ్ఞిరే సర్వే
దివి దేవా దివిశ్రితః ॥ 25 ॥

పదము

ప్రాణాపానౌ । చక్షుః । శ్రోత్రమ్ ।
అక్షితిః । చ । క్షితిః । చ । యా ।
ఉత్ఽశిష్టాత్ । జజ్ఞిరే । సర్వే ।
దివి । దేవాః । దివిఽశ్రితః ॥ 25 ॥

అనువాదం

ప్రాణాపానములు, చక్షురింద్రియం,
శ్రోత్రేంద్రియం, క్షయము,
క్షయాభావము – ఈ సర్వపదార్థములు

ఉచ్ఛిష్టమునుండే జనించినవి.
సర్వదేవతలు, ద్యులోకస్థితులైన
దేవతలు ఉచ్ఛిష్టమునుండే జనించినవి. ॥ 25 ॥

మంత్రము :

ఆనన్దా మోదాః ప్రముదో-

భీమోదముదశ్చ యే ।

ఉచ్ఛిష్టా జజ్ఞిరే సర్వే

దివి దేవా దివిశ్రితః ॥ 26 ॥

పదము :

ఆఽనన్దాః । మోదాః । ప్రఽముదః ।

అభిమోదఽముదః । చ । యే ।

ఉత్ఽశిష్టాత్ । జజ్ఞిరే । సర్వే ।

దివి । దేవాః । దివిఽశ్రితః ॥ 26 ॥

అనువాదం.

ఆనంద మోదములు, ప్రమోదములు,
అభిమోదములు – ఇవన్నీ ఉచ్ఛిష్టమునుండే జనించినవి.
సర్వదేవతలు, ద్యులోకస్థితులైన దేవతలు
ఉచ్ఛిష్టమునుండే జనించినారు ॥ 26 ॥

మంత్రము

దేవాః పితరో మనుష్యా॒ఽ

గన్ధర్వాప్సరసశ్చ యే ।

ఉచ్ఛిష్టా జజ్ఞిరే సర్వే

దివి దేవా దివిశ్రితః ॥ 27 ॥

పదము।

దేవాః । పితరః । మనుష్యాః ।

గన్ధర్వఽఅప్సరసః । చ । యే ।

ఉత్ఽశిష్టాత్ । జజ్ఞిరే । సర్వే ।

దివి । దేవాః । దివిఽశ్రితః ॥ 27 ॥

అనువాదం:

దేవతలు, పితరులు, మనుష్యులు, గంధర్వులు,
అప్సరసలు - వీరంతా ఉచ్ఛిష్టమునుండే జనించినారు.
అలాగే ద్యులోకమునందున్న సర్వదేవతలు
ఉచ్ఛిష్టమునుండే జనించినారు ॥ 27 ॥

ఇది ఏడవ సూక్తం

## సూక్తం-8

ఋషిః కౌరుపథి ॥ దేవతలుః మన్యువు, అధ్యాత్మము ॥ ఛందస్సు. 1-32,34 అనుష్టుప్, 33 పథ్యాపంక్తి ॥ మంత్రములు. ॥ 34 ॥

వినియోగం :- ఇది అర్థసూక్తం. బ్రహ్మయజ్ఞజపంలో దీనికి వినియోగం. శరీర మధ్యంలో ఆత్మగా ప్రతిష్ఠితుడైన బ్రహ్మను గూర్చి ఉపదేశించడం కోసం ఆ శరీరానికి, దానికి సాధన భూతాలైన ఇంద్రియాలకు అధిష్ఠాతలైన దేవతల ప్రశ్న - ప్రతివచనరూపంలో ఉత్పత్తిని చెప్పదలచి, ఉపాయభూతమైన సృష్టిని ఉపదేశింపదలచి ఇలా ప్రారంభిస్తున్నారు.

మంత్రము.

యన్మన్యుర్జాయా మావహత్

సంకల్పస్య గృహా దధి ।

క ఆసం జన్యాః కే వరాః

క ఉ జ్యేష్ఠవరోఽభవత్ ॥ 1 ॥

పదము.

యత్ । మన్యుః । జాయామ్ । ఆఽఅవహత్ ।

సమ్ఽకల్పస్య । గృహాత్ । అధి ।

కే । ఆసన్ । జన్యాః । కే । వరాః ।

కః । ఓం ఇతి । జ్యేష్ఠఽవరః । అభవత్ ॥ 1 ॥

అనువాదం :

సర్వజగత్తుకు మూలమైన మాయాశక్తిని అభిముఖం చేసుకున్నాడు.

సంకల్పమునకు అవాసమైన చోటు నుంచి
వధూవర పరీక్ష జరిగినది.
వరుడెవరు ? కన్య ఎవరు ?
వారికి తగిన సమయమేమిటి ?
ఆ సమయంలో ఎవడు ముఖ్యవరుడైనాడు? ॥ 1 ॥

మంత్రము :

తపశ్చైవాస్తాం కర్మ
చాన్తర్మహత్యర్ణవే ।
త ఆసం జన్యాస్తే వరా
బ్రహ్మ జ్యేష్ఠవరోఽభవత్ ॥ 2 ॥

పదము :

తపః । చ । ఏవ । ఆస్తామ్ । కర్మ । చ ।
అన్తః । మహతి । అర్ణవే ।
తే । ఆసన్ । జన్యాః । తే । వరాః ।
బ్రహ్మ । జ్యేష్ఠఽవరః । అభవత్ ॥ 2 ॥

అనువాదం :

సృష్టిసమయంలో ఆ పరమేశ్వరుని
తపస్సు, కర్మ ఏర్పడినవి.
ప్రభూతమైన సముద్రమధ్యంలో
తొలుత ఉదకములున్నవి.

అవి జన్యములైనవి.
అవి వివాహ ప్రవృత్తులైన బంధుజనులైనవి.
అవే వరులుగా కూడా అయినవి.
జగత్కారణమైన బ్రహ్మ జ్యేష్ఠవరుడైనాడు. ॥ 2 ॥

మంత్రము

దశ సాక మజాయన్త
దేవా దేవేభ్యః పురా ।
యో వై తాన్ విద్యాత్ ప్రత్యక్షం ।
స వా అద్య మహద్ వదేత్ ॥ 3 ॥

పదము :

దశ । సాకమ్ । అజాయన్త ।
దేవాః । దేవేభ్యః । పురా ।
యః । వై । తాన్ । విద్యాత్ । ప్రతిఒఅక్షమ్ ।
సః । వై । అద్య । మహత్ । వదేత్ ॥ 3 ॥

అనువాదం :

దేవతలకంటె ముందే పదుగురు
సుప్రకాశమానులైన దేవతలు ఉద్భవించినారు.
ఉపాసకుడు ఆ దేవతలను ప్రత్యక్షంగా తెలుసుకుంటాడు.
ఆ విద్వాంసుడు ఇప్పుడు సర్వగతమైన
బ్రహ్మను గూర్చి ప్రవచనం చేస్తాడు. ॥ 3 ॥

మంత్రము :

ప్రాణాపానౌ చక్షుః శ్రోత్ర-

మక్షితిశ్చ క్షితిశ్చ యా ।

వ్యానోదానౌ వాఙ్ మన

స్తే వా ఆకూతి మావహన్ ॥ 4 ॥

పదము:

ప్రాణాపానౌ । చక్షుః । శ్రోత్రమ్ ।

చ । యా ।

। వాక్ । మనః ।

ఆ । అవహన్ ॥ 4 ॥

భావము :

హృదయమధ్యంలో నున్న క్రియాశక్త్యాత్మక
ప్రాణమునకు ప్రాణాపానములు వృత్తులు
నేత్రము, శ్రోత్రము, అక్షితి ( జ్ఞానశక్తి ),
క్షితి ( క్రియాశక్తి ) కలవు
సర్వనాడులలో తిరుగుతూ ప్రేరేపించే
ఉదానం, వాక్కు, మనస్సు - ఇవన్నీ
ప్రాణాపానాదులకు వెంటన దశదేవతలు
పురుష సంకల్పాన్ని వీరు
అభిముఖ్యాన్ని చెందస్తారు ॥ 4 ॥

మంత్రము.

అజాతా అసన్నృతవో౽-

థో ధాతా బృహస్పతిః ।

ఇన్ద్రాగ్నీ అశ్వినా తర్హి

కం తే జ్యేష్ఠముపాసత ॥ 5 ॥

పదము:

అజాతాః । అసన్ । ఋతవః ।

అథో ఇతి । ధాతా । బృహస్పతిః ।

ఇన్ద్రాగ్నీ ఇతి । అశ్వినా । తర్హి ।

కమ్ । తే । జ్యేష్ఠమ్ । ఉప । అసత ॥ 5 ॥

అనువాదం:

ఋతువులు సృష్టి సమయంలో ఉత్పన్నములు కాలేదు.
మరిన్ని అదితి పుత్రుడైన ధాత, బృహస్పతి,
ఇంద్రాగ్నులు, అశ్వినీదేవతలు - ఈ అరుగురు
అరు ఋతువులకు అధిపతులు.
వారు కూడా అప్పటికి జనించలేదు.
ఆ కాలంలో ధాత్రాదులు తమజన్మార్థమై
వృద్ధతముడైన ఏ కారణభూతుని అభ్యర్థించినారు? ॥ 5 ॥

మంత్రము:

తపశ్చైవాస్తాం కర్మ

చాన్తర్మహత్యర్ణవే ।

తపో హ జజ్ఞే కర్మణ-

స్తత్ తే జ్యేష్ఠ ముపాసత ॥ ౬ ॥

పదము

తపః । చ । ఏవ । ఆస్తామ్ । కర్మ ।

చ । అన్తః । మహతి । అర్ణవే ।

తపః । హ । జజ్ఞే । కర్మణః ।

తత్ । తే । జ్యేష్ఠమ్ । ఉప । ఆసత ॥ 6 ॥

అనువాదం।

సృష్టి సమయంలో ఆ పరమేశ్వరుని
తపస్సు కర్మ ఏర్పడినవి
ప్రభూతమైన సముద్రమధ్యంలో
తొలుత ఉదకములున్నవి
తపస్సు కర్మనుంచి కలిగినది
ఆ ధాత్రాదులు వృద్ధతముడైన
సృష్టికర్తను స్వోత్పాదనమునకై ప్రార్థించినారు ॥ 6 ॥

మంత్రము।

యేత ఆసీద్ భూమిః పూర్వా

యామద్ధాతయ ఇద్ విదుః ।

యో వై తాం విద్యా న్నామథా

స మన్యేత పురాణవిత్ ॥ 7 ॥

పదము

యా । ఇతః । ఆసీత్ । భూమిః । పూర్వా ।

యామ్ । అద్ధాతయః । ఇత్ । విదుః ।

యః । వై । తామ్ । విద్యాత్ । నామఽథా ।

సః । మన్యేత । పురాణఽవిత్ ॥ 7 ॥

అనువాదం :

ఈ పురోవర్తి అయిన భూమికంటె ముందున్న
పృథివి ఏది కలదో, దానిని ప్రత్యక్షంగా
మహర్షులు వ్యాపించి ఉన్నారు.
ఆ సంగతి వారికి మాత్రమే తెలియును.
అతీత కల్పస్థమైన ఆ భూమిని
ఎవరైతే తెలుసుకొన్నారో,
వారు పురాతనమైన అర్థాన్ని ఎరిగినవారు. ॥ 7 ॥

మంత్రము :

కుత ఇన్ద్రః కుతః సోమః

కుతో అగ్ని రజాయత ।

కుత స్త్వష్టా సమభవత్

కుతో ధాతాజాయత ॥ 8 ॥

పదము

కుతః । ఇన్ద్రః । కుతః । సోమః ।

కుతః । అగ్నిః । అజాయత ।

**అనువాదం :**

ఈ భూమిపై మనుష్యులు అలంకృతులై ఉన్నారు.
హవ్యమును, యజ్ఞమును దేవతలకై
సమర్పణం చేస్తున్నారు.
'స్వధా' అంటూ అన్నంతో మర్త్యులు జీవిస్తున్నారు.
ఈ భూమి మాకు బలమును, ప్రాణమును
ఆయుస్సును ప్రసాదించు గాక!
నాకు ఉన్నతిని కల్పించు గాక! ॥ 22 ॥

**మంత్రము :**

యస్తే గన్ధః పృథివి సంబభూవ
యం బిభ్రత్యోషధయో యమాపః ।
యం గన్ధర్వా అప్సరసశ్చ భేజిరే
తేన మా సురభిం కృణు
మా నో ద్విక్షత కశ్చన ॥ 23 ॥

**పదము :**

యః । తే । గన్ధః । పృథివి । సమ్ఽబభూవ ।
యమ్ । బిభ్రతి । ఓషధయః । యమ్ । ఆపః ।
యమ్ । గన్ధర్వాః । అప్సరసః । చ । భేజిరే ।
తేన । మా । సురభిమ్ । కృణు । మా । నః । ద్విక్షత । కః । చన
॥ 23 ॥

అనువాదం :

(పూర్వ ప్రశ్నలకు ప్రత్యుత్తరంగా చెప్తున్నాడు.)
పూర్వకల్పంలోని ఇంద్రుని నుంచి
ఈ ఇంద్రుడు జనించినాడు.
అలాగే సోముని నుంచి సోముడు,
అగ్ని నుంచి అగ్ని ప్రభవించినారు.
త్వష్ట త్వష్ట నుంచి జనించినాడు.
ధాత ధాత నుంచి జనించినాడు. ॥ 9 ॥

మంత్రము :

యే త ఆసన్ దశ జాతా
దేవా దేవేభ్యః పురా ।
పుత్రేభ్యో లోకం దత్వా
కస్మిం స్తే లోక ఆసతే ॥ 10 ॥

పదము

యే । తే । ఆసన్ । దశ । జాతాః ।
దేవాః । దేవేభ్యః । పురా ।
పుత్రేభ్యః । లోకమ్ । దత్వా ।
కస్మిన్ । తే । లోకే । ఆసతే ॥ 10 ॥

అనువాదం :

ఈ అగ్న్యాది అధిష్ఠాతల నుంచి
పూర్వం ప్రాణాపానాది దశదేవతలు కలిగినారు.

వారి పుత్రులకు స్వకీయ స్థానమిచ్చి
ఈలోకంలో వీరు ఉపవిష్టులై ఉన్నారు ॥ 10 ॥

మంత్రము :

యదా కేశా నస్థి స్నావ

మాంసం మజ్జాన మాభరత్ ।

శరీరం కృత్వా పాదవత్

కం లోక మను ప్రావిశత్ ॥ 11 ॥

పదము :

యదా । కేశాన్ । అస్థి । స్నావ ।

మాంసమ్ । మజ్జానమ్ । ఆఽఅభరత్ ।

శరీరమ్ । కృత్వా । పాదఽవత్ ।

కమ్ । లోకమ్ । అను । ప్ర । అవిశత్ ॥ 11 ॥

అనువాదం :

సృష్టికాలంలో శిరోరుహాది శరీరావయవములను
ఒకచోట చేర్చినారు
అలా చేర్చిన హస్తపాదాదియుతమైన
శరీరాన్ని నిర్మించి ఇంకొక లోకాన్ని
ప్రవేశించినారు ॥ 11 ॥

మంత్రము :

కుతః కేశాన్ కుతః స్నావ

కుతో అస్థీ న్యాభరత్ ।

అఙ్గా పర్వాణి మజ్జానం

కో మాంసం కుత ఆభరత్ ॥ 12 ॥

పదము

కుతః । కేశాన్ । కుతః । స్నావ ।

కుతః । అస్థీని । ఆ । అభరత్ ।

అఙ్గా । పర్వాణి । మజ్జానమ్ ।

కః । మాంసమ్ । కుతః । ఆ । అభరత్ ॥ 12 ॥

అనువాదం :

శిరోరుహములను ఎక్కడి నుంచి కొనివచ్చి
శరీర నిర్మాణం చేసినాడు?
ఎక్కడ నుంచి స్రావమనేది ఉత్పన్నమైనది?
అంగములెక్కడ నుంచి ఉత్పన్నములైనవి?
కీళ్ళెక్కడ నుంచి ఉత్పన్నములైనవి?
అస్థ్యంతర్గతమైన రసం (మజ్జ) ఎక్కడ నుంచి వచ్చినది?
వీటిని మరొకరెవరు కొనివచ్చినారు?
మాంసాన్ని ఎక్కడ నుంచి కొనివచ్చినారు? ॥ 12 ॥

మంత్రము :

సం సిచో నామ తే దేవా

యే సంభారా స్త్వమభరన్ ।

సర్వం సంసిచ్య మర్త్యం

దేవాః పురుష మావిశన్ ॥ 13 ॥

పదము

సమ్ఽసిచః । నామ । తే । దేవాః ।

యే । సమ్ఽభారాన్ । సమ్ఽఅభరన్ ।

సర్వమ్ । సమ్ఽసిచ్య । మర్త్యమ్ ।

దేవాః । పురుషమ్ । ఆ । అవిశన్ ॥ 13 ॥

అనువాదం :

ఏ దేవతలు ఈ సంభారములను
సమీకరించినారో, వారిని సంధాయకులంటారు
మరణధర్మంగల సర్వశరీరమును
అర్ద్రీకృతం చేసి పురుషాకృతిని నిర్మించి
అందులో ప్రవేశించినారు ॥ 13 ॥

మంత్రము:

ఊరూ పాదా వష్ఠీవన్తౌ

శిరో హస్తా వథో ముఖమ్ ।

పృష్ఠీ ర్బర్జహ్యౌ౽ పార్శ్వే

క స్తత్ స మదధా దృషిః ॥ 14 ॥

పదము

ఊరూ ఇతి । పాదౌ । అష్ఠీవన్తౌ ।

శిరః । హస్తౌ । అథో ఇతి । ముఖమ్ ।

పృష్టీః । బర్జహ్యేతి ఇతి । పార్శ్వే ఇతి ।

కః । తత్ । సమ్ । అదధాత్ । ఋషిః ॥ 14 ॥

అనువాదం.

తొడలు, పాదములు, మోకాళ్ళు, శిరస్సు,
హస్తములు మరిన్ని ముఖము,
పృష్ఠములు మరిన్ని వర్జహములనే అవయవములు,
రెండు పార్శ్వములు - ఈ అంగజాతమునంతా
ఏ ఋషి ఒకచోట చేర్చి సృష్టించినాడు? ॥ 14 ॥

మంత్రము

శిరో హస్తా వథో ముఖం

జిహ్వాం గ్రీవాశ్చ కీకసాః ।

త్వచా ప్రావృత్య సర్వం తత్

సంధా స మదధా న్మహీ ॥ 15 ॥

పదము :

శిరః । హస్తౌ । అథో ఇతి । ముఖమ్ ।

జిహ్వామ్ । గ్రీవాః । చ । కీకసాః ।

త్వచా । ప్ర౽ఆవృత్య । సర్వమ్ । తత్ ।

సమ్౽ధా । సమ్ । అదధాత్ । మహీ ॥ 15 ॥

అనువాదం :

శిరస్సు, హస్తములు, ముఖము, జిహ్వా,
గ్రీవము, అస్థులు - ఈ అంగములన్నింటినీ
చర్మంతో ఆచ్ఛన్నం చేసి, ఆ సర్వాంగ
జాతమును సర్వాంగకర్త్రి అయిన దేవత
స్వస్వవ్యాపారక్షమంగా సృష్టించినది ॥ 15 ॥

మంత్రము :

య త్త చ్ఛరీర మశయత్

సంధయా సంహితం మహత్ ।

యేనేద మద్య రోచతే

కో అస్మిన్ వర్ణ మాభరత్ ॥ 16 ॥

పదము :

యత్ । తత్ । శరీరమ్ । అశయత్ ।

సమ్౽ధయా । సమ్౽హితమ్ । మహత్ ।

యేన । ఇదమ్ । అద్య । రోచతే ।

కః । అస్మిన్ । వర్ణమ్ । ఆ । అభరత్ ॥ 16 ॥

అనువాదం.

సంధాత్రి అయిన దేవత
అవయవసంధానం చేయగా
ఈ శరీరం ప్రవృద్ధమైనది.
ఈ శరీరం ఇప్పుడు ఏ వర్ణములో
ప్రకాశిస్తున్నది? ఈ శరీరంలో ఏ దేవుడు
ఆ వర్ణాన్ని సంపాదించి పెట్టినాడు? ॥ 16 ॥

మంత్రము :

సర్వే దేవా ఉపాశిక్షన్
త దజానాద్ వధూః సతీ ।
ఈశా వశస్య యా జాయా
సాస్మిన్ వర్ణ మాభరత్ ॥ 17 ॥

పదము

సర్వే । దేవాః । ఉప । అశిక్షన్ ।

తత్ । అజానాత్ । వధూః । సతీ ।

ఈశా । వశస్య । యా । జాయా ।

సా । అస్మిన్ । వర్ణమ్ । ఆ । అభరత్ ॥ 17 ॥

అనువాదం :

ఇంద్రాది దేవతలందరూ, శక్తిమంతులు
కావలెనని అపేక్షించినారు
పరమేశ్వరుని వివాహమాడిన
చిద్రూపి అయిన శక్తి
ఆ దేవతలు చేసిన దానిని గ్రహించుకున్నది
సర్వజగత్తునకు నియంత అయిన
ఆ శక్తి ఈ శరీరంలో
గౌర, పీత, నీలాది వర్ణములను సృష్టించినది ॥ 17 ॥

మంత్రము :

యదా త్వష్టా వ్యతృణత్
పితా త్వష్టుర్య ఉత్తరః ।
గృహం కృత్వా మర్త్యం
దేవాః పురుష మావిశన్ ॥ 18 ॥

పదము

యదా । త్వష్టా । వి౨అతృణత్ ।
పితా । త్వష్టుః । యః । ఉత్తరః ।
గృహమ్ । కృత్వా । మర్త్యమ్ ।
దేవాః । పురుషమ్ । ఆ । అవిశన్ ॥ 18 ॥

అనువాదం।

ఏ త్వష్ట, అతనిని సృష్టించిన పిత,
ఏ కాలంలో ఈ చక్షుశ్శ్రోత్రాది అవయువములను
కలిపి మర్త్యుని సృష్టించినారో,
ఆ దేవతలు ఆ పురుషునిలో ప్రవేశించినారు. ॥ 18 ॥

మంత్రము।

స్వప్నో వై తన్ద్రీ ర్నిరృతిః
పాప్మానో నామ దేవతాః।
జరా ఖాలత్యం పాలిత్యం
శరీర మను ప్రావిశన్ ॥ 19 ॥

పదము

స్వప్నః। వై। తన్ద్రీః। నిఃఋతిః।
పాప్మానః। నామ। దేవతాః।
జరా। ఖాలత్యమ్। పాలిత్యమ్।
శరీరమ్। అను। ప్ర। అవిశన్ ॥ 19 ॥

అనువాదం.

నిద్ర, అలసత, నిరఋతి, పాపములు-
ఈ సర్వం పురుషశరీరంలో ప్రవేశించినవి.
వృద్ధాప్యం, చిత్తస్ఖలనం, వెంట్రుకలు నెరవడం-

వీని అభిమాన దేవతలు
శరీరంలో ప్రవేశించినారు ॥ 19 ॥

మంత్రము

స్తేయం దుష్కృతం వృజినం
సత్యం యజ్ఞో యశో బృహత్ ।
బలం చ క్షత్రమోజశ్చ
శరీర మను ప్రావిశన్ ॥ 20 ॥

పదము :

స్తేయమ్ । దుఃఽకృతమ్ । వృజినమ్ ।
సత్యమ్ । యజ్ఞః । యశః । బృహత్ ।
బలమ్ । చ । క్షత్రమ్ । ఓజః । చ ।
శరీరమ్ । అను । ప్ర । అవిశన్ ॥ 20 ॥

అనువాదం

స్తేయము (దొంగతనము), దుష్కృతము,
తజ్జనితపాపము, యథార్థకథనము,
యజ్ఞము, కీర్తి, బలము, క్షాత్రతేజము,
ఓజస్సు - ఇవన్నీ పురుషునిలో
వాని ననుగమించి ప్రవేశించినవి ॥ 20 ॥

మంత్రము.

భూతిశ్చ వా అభూతిశ్చ

రాతయోఽ రాతయశ్చ యాః ।

క్షుధశ్చ సర్వా స్తృష్ణా శ్చ

శరీర మను ప్రావిశన్ ॥ 21 ॥

పదము:

భూతిః । చ । వై । అభూతిః । చ ।

రాతయః । అరాతయః । చ । యాః ।

క్షుధః । చ । సర్వాః । తృష్ణాః । చ ।

శరీరమ్ । అను । ప్ర । అవిశన్ ॥ 21 ॥

అనువాదం:

సమృద్ధి, అసమృద్ధి, మిత్రులు, శత్రువులు-
ఇవన్నీ, ఆకలి, దప్పి మొదలైనవన్నీ
పురుషుని శరీరంలో ఒకదానివెంట ఒకటి ప్రవేశించినవి. ॥21॥

మంత్రము:

నిన్దాశ్చ వా అనిన్దాశ్చ

యచ్చ హ న్తేతి నేతి చ ।

శరీరం శ్రద్ధా దక్షిణా-

శ్రద్ధా చాను ప్రావిశన్ ॥ 22 ॥

పదము :

నిన్దాః । చ । వై । అనిన్దాః । చ ।

యత్ । చ । హన్త । ఇతి । న । ఇతి । చ ।

శరీరమ్ । శ్రద్ధా । దక్షిణా ।

అశ్రద్ధా । చ । అను । ప్ర । అవిశన్ ॥ 22 ॥

అనువాదం :

నిందానిందలు, హర్షజనకమైనది,
హర్షజనకం కానిది, శ్రద్ధ, దక్షిణ, అశ్రద్ధ-
ఇవన్నీ పురుషుని శరీరంలో దాని
నాశ్రయించి ప్రాదుర్భవించినవి ॥ 22 ॥

మంత్రము

విద్యాశ్చ వా అవిద్యాశ్చ

యచ్చాన్య దుపదేశ్యమ్ ।

శరీరం బ్రహ్మ ప్రావిశ-

దృచః సామాథో యజుః ॥ 23 ॥

పదము :

విద్యాః । చ । వై । అవిద్యాః । చ ।

యత్ । చ । అన్యత్ । ఉపఽదేశ్యమ్ ।

శరీరమ్ । బ్రహ్మ । ప్ర । అవిశత్ ।

ఋచః । సామ । అథో ఇతి । యజుః ॥ 23 ॥

అనువాదం :

విద్యలు, అవిద్యలు, ఇతరములు,
ఉపదేశ సమధిగమ్యమైన బ్రహ్మ
శరీరంలో ప్రవేశించినవి.
మరిన్ని ఋక్సామ యజుర్వేదములు
అందులో ప్రవేశించినవి. ॥ 23 ॥

మంత్రము :

ఆనన్దా మోదాః ప్రముదో౽-

భీమోదముదశ్చ యే ।

హసో నరిష్టా నృత్తాని

శరీర మను ప్రావిశన్ ॥ 24 ॥

పదము :

ఆ౽నన్దాః । మోదాః । ప్ర౽ముదః ।

అభిమోద౽ముదః । చ । యే ।

హసః । నరిష్టా । నృత్తాని ।

శరీరమ్ । అను । ప్ర । అవిశన్ ॥ 24 ॥

అనువాదం,

అనంద మోదములు, ప్రమోదము,
అభిమోదము, ముదము, హాసము,
మనుష్యునకు గోచరించే శబ్దస్పర్శాది
విషయములు, నృత్యములు-ఇవన్నీ
ఆ శరీరాన్ననుసరించే ప్రవేశించినవి

మంత్రము :

ఆలాపాశ్చ ప్రలాపా-
శ్చాభిలాప లపశ్చ యే ।
శరీరం సర్వే ప్రావిశ-
న్నాయుజః ప్రయుజో యుజః

పదము ;

ఆఽలాపాః । చ । ప్రఽలాపాః । చ ।
అభిలాపఽలపః । చ । యే ।
శరీరమ్ । సర్వే । ప్ర । అవిశన్ ।
ఆఽయుజః । ప్రఽయుజః । యుజః ।

అనువాదం ;

అలాపములు, ప్రలాపములు, అభిలాపములు-
ఇవన్నీ పురుషశరీరంలో ప్రవేశించినవి.
ఆయోజనములు, ప్రయోజనములు
యోజనములు-ఇవన్నీ శరీరంలో ప్రవేశించినవి

మంత్రము :

ప్రాణాపానౌ చక్షుః శ్రోత్ర-
మక్షితిశ్చ క్షితిశ్చ యా ।
వ్యానోదానౌ వాఙ్ మనః
శరీరేణ త ఈయన్తే ॥ 26 ॥

పదము :

ప్రాణాపానౌ । చక్షుః । శ్రోత్రమ్ ।
అక్షితిః । చ । క్షితిః । చ । యా ।
వ్యానఽఉదానౌ । వాక్ । మనః ।
శరీరేణ । తే । ఈయన్తే ॥ 26 ॥

అనువాదం :

ప్రాణాపానములు, చక్షురింద్రియం, శ్రోత్రేంద్రియం,
అక్షితి, క్షితి ( క్షయాభావము, క్షయము ),
వ్యానోదానములు, వాక్కు, మనస్సు
శరీరంలో ప్రవేశించినవి. ॥ 26 ॥

మంత్రము :

ఆశిషశ్చ ప్రశిషశ్చ
సంశిషో విశిషశ్చ యాః ।

చిత్తాని సర్వే సంకల్పాః
శరీర మను ప్రావిశన్ ॥ 27 ॥

పదము :

ఆఽశిషః । చ । ప్రఽశిషః । చ ।
సమ్ఽశిషః । విఽశిషః । చ । యాః ।
చిత్తాని । సర్వే । సమ్ఽకల్పాః ।
శరీరమ్ । అను । ప్ర । అవిశన్ ॥ 27 ॥

అనువాదం :

ఆశాసనములు, ప్రశాసనములు, సంశాసనములు,
వివిధశాసనములు,
మనోబుద్ధ్యహంకారాలు, సంకల్పాదులు-
ఇవన్నీ పురుషుని శరీరంలో ప్రవేశించినవి. ॥ 27

మంత్రము :

అ స్తేయాశ్చ వా స్తేయాశ్చ
త్వరణాః కృపణాశ్చ యాః ।
గుహ్యాః శుక్రా స్థూలా అప-
స్తా బీభత్సా వసాదయన్ ॥ 28 ॥

పదము :

ఆస్తేయీః । చ । వాస్తేయీః । చ ।

త్వరణాః । కృపణాః । చ । యాః ।

గుహ్యాః । శుక్రాః । స్థూలాః । అపః ।

తాః । బీభత్సౌ । అసాదయన్ ॥ 28 ॥

అనువాదం :

ఆస్నేయములు (సమంత స్నానములకు
సంబంధించిన ఉదకములు),
వాస్నేయములు (శరీరములకు సంబంధించిన ఉదకములు),
త్వరణములు (త్వరగా పోవునవి)
కృపణములు మొదలైన ఉదకములు-
గుహ్యములై, శుక్లవర్ణములై, స్థూలములై
ఉన్న ఉదకములు-ఇవన్నీ బీభత్స్యమానమైన
పురుషశరీరమునందు ఉన్నవి. ॥ 28 ॥

మంత్రము :

అస్థి కృత్వా సమిధం

తదష్టాపో అసాదయన్ ।

రేతః కృత్వాజ్యం

దేవాః పురుష మావిశన్ ॥ 29 ॥

అథర్వ. V 16

పదము :

అస్థి । కృత్వా । సమ్ఽఇధమ్ ।

తత్ । అష్ట । ఆపః । అసాదయన్ ।

రేతః । కృత్వా । ఆజ్యమ్ ।

దేవాః । పురుషమ్ । ఆ । అవిశన్ ॥ 29 ॥

అనువాదం :

శరీరసంబంధమైన అస్థిజాతము
శరీర పరిపాక నిమిత్తమైన దానినిగా చేసి,
ఈ శరీరంలో అష్టసంఖ్యాకములైన ద్రవములుగా ఉన్నవి.
ఆజ్యము, వీర్యముగా పరికల్పించి
ఇంద్రియాది దేవతలు
పురుషుని శరీరంలో ప్రవేశించినారు. ॥ 29 ॥

మంత్రము :

యా ఆపో యాశ్చ దేవతా

యా విరాడ్ బ్రహ్మణా సహ ।

శరీరం బ్రహ్మ ప్రావిశ-

చ్ఛరీరేఽధి ప్రజాపతిః ॥ 30 ॥

పదము :

యాః । ఆపః । యాః । చ । దేవతాః ।

యా । విఽరాట్ । బ్రహ్మణా । సహ ।

శరీరమ్ । బ్రహ్మ । ప్ర । అవిశత్ ।

శరీరే । అధి । ప్రజాఽపతిః ॥ 30 ॥

**అనువాదం:**

తొలుత చెప్పిన ఉదకములు, దేవతలు,
విరాట్టు, బ్రహ్మతేజస్సుతోపాటు
ఉన్న అవన్ని శరీరంలో ప్రవేశించినవి.
తరువాత బ్రహ్మ కూడ ఆ శరీరంలో ప్రవేశించెను.
అందులో ప్రజాపతి ( సంతానకారకుడు ) ఉన్నాడు. ॥ 30 ॥

మంత్రము :

సూర్య శ్చక్షు ర్వాతః ప్రాణం

పురుషస్య వి భేజిరే ।

అథా స్యేతర మాత్మానం

దేవాః ప్రాయచ్ఛ న్నగ్నయే ॥ 31 ॥

పదము :

సూర్యః । చక్షుః । వాతః । ప్రాణమ్ ।

పురుషస్య । వి । భేజిరే ।

అథ । అస్య । ఇతరమ్ । ఆత్మానమ్ ।

దేవాః । ప్ర । అయచ్ఛన్ । అగ్నయే ॥ 31 ॥

అనువాదం :

సూర్యుడు పురుష నేత్రేంద్రియాన్ని
ఆత్మీయ భాగంగా స్వీకరించినాడు.
వాయువు ప్రాణాన్ని తన భాగంగా స్వీకరించినాడు.
ఇలా ఆయా ఇంద్రియాధిదేవతలు విభజించుకుని,
వారి వారి భాగాలుగా స్వీకరించినారు.
పిదప ఇంద్రియ వ్యతిరేకమైన
స్థూల శరీరాన్ని అగ్నికై
దేవతలు, తమ భాగంగా స్వీకరించినారు. ॥ 31 ॥

మంత్రము :

తస్మాద్ వై విద్వాన్ పురుష-
మిదం బ్రహ్మేతి మన్యతే ।
సర్వా హ్యఽస్మిన్ దేవతా
గావో గోష్ఠ ఇవాసతే ॥ 32 ॥

పదము :

తస్మాత్ । వై । విద్వాన్ । పురుషమ్ ।
ఇదమ్ । బ్రహ్మ । ఇతి । మన్యతే ।
సర్వాః । హి । అస్మిన్ । దేవతాః ।
గావః । గోష్ఠేఽఇవ । ఆసతే ॥ 32 ॥

**అనువాదం :**

అందువల్ల విద్వాంసుడైన పురుషుని శరీరాన్ని
అపరోక్షబ్రహ్మగా భావిస్తాడు.
సర్వదేవతలు ఈ శరీరంలోనే
గోష్ఠంలో గోవులున్నట్లుగా ఉంటారు. ॥ 32 ॥

**మంత్రము :**

ప్రథమేన ప్రమారేణ
త్రేధా విష్వఙ్ వి గచ్ఛతి ।
అద ఏకేన గచ్ఛ
త్యద ఏకేన గచ్ఛ
తీహైకేన ని షేవతే ॥ 33 ॥

**పదము :**

ప్రథమేన । ప్రఽమారేణ ।
త్రేధా । విష్వఙ్ । వి । గచ్ఛతి ।
అదః । ఏకేన । గచ్ఛతి ।
అదః । ఏకేన । గచ్ఛతి ।
ఇహ । ఏకేన । ని । సేవతే ॥ 33 ॥

**అనువాదం :**

ప్రథమభావి అయిన శరీరంతో మృతుడై
జీవాత్మ, మూడువిధాలుగా

నానా నియమాలతో వెడతాడు.
స్వర్గస్థితిని పుణ్యకర్మతో పొందుతాడు.
నరకస్థితిని పాపకర్మతో పొందుతాడు.
ఈ భూలోకంలో పుణ్యపాపాత్మకమైన కర్మతో
సుఖదుఃఖాత్మకమైన భోగములను అనుభవిస్తాడు. ॥ 33 ॥

మంత్రము :

అప్సు స్తీమాసు వృద్ధాసు
శరీర మన్తరా హితమ్ ।
తస్మిం ఛ్వో ధ్యన్తరా
తస్మా చ్ఛ్వో ధ్యుచ్యతే ॥ 34 ॥

పదము :

అప్ఽసు । స్తీమాసు । వృద్ధాసు ।
శరీరమ్ । అన్తరా । హితమ్ ।
తస్మిన్ । శవః । అధి । అన్తరా ।
తస్మాత్ । శవః । అధి । ఉచ్యతే ॥ 34 ॥

అనువాదం :

అనార్ద్రమైన సర్వజగత్తును ఆర్ద్రించేసే
ప్రవృద్ధములైన ఉదకముల మధ్యంలో
శరీరం నిహితమై ఉన్నది.
అందులో దానిపై మధ్యలో

సర్వాధారభూతుడైన పరమేశ్వరుడున్నాడు.
ఆ శరీరం నుంచి ఆ సూత్రాత్మ పలుకుతాడు. ॥ 34 ॥

ఇది ఎనిమిదవ సూక్తం.

ఇది నాల్గవ అనువాకం.

# అనువాకం: 5

## సూక్తం - 9

ఋషి: కాంకాయనుడు ॥ దేవత : అర్బుది॥ ఛందస్సు: 1 సప్తపదా విరాట్ శక్వరీ 2,5-8,10,12,13,18-21 అనుష్టుప్; 3 పరోష్ణిక్; 4 ఉష్ణిగ్ బృహతీ గర్భా పరాత్రిష్టుప్ షట్పదాఽతిజగతీ; 2,11,14,23,26 పథ్యాపంక్తి; 15,22,24,25 సప్తపదా శక్వరీ; 16 పంచపదా విరాడుపరిష్టాజ్జ్యోతి త్రిష్టుప్; 17 త్రిపదా గాయత్రీ ॥ మంత్రములు; ॥ 26 ॥

వినియోగం :- ఈ సూక్తం అర్ధసూక్తం. జయకాముడైన రాజు యుద్ధకాలంలో తన భటులను ప్రేరేపిస్తూ దీనిని జపం చేస్తాడు.

అలాగే శత్రుజయ కర్మలో ఈ అనువాకంతో *పృషదాజ్యమును, ఆటుకులను హోమం చేస్తాడు.

అలాగే ఈ అనువాకంతో ధనురిధ్మాగ్నిలో పృషదాజ్యంతో తడిపిన ధనుస్సమిధలతో హోమం చేస్తాడు.

అందులో ఆజ్యసిక్తములైన బాణసమిధలను కూడా వేస్తాడు.

అలాగే ఈ అనువాకంతో పృషదాజ్యంలో ధనుస్సును వేసి, తీసి, అభిమంత్రించి, యోధుడైన, జయకాముడైన రాజునకు ప్రదానం చెయ్యాలి.

ఈ అనువాకంతో ఖాంగపాశములను పృషదాజ్యంలో పడవేసి పరసేనాక్రమణ స్థానములలో ప్రక్షేపించాలి.

---

* దధిబిందుయుక్తమైన ఘృతము.

అలాగే ఈ అనువాకంతో మౌంజీపాశములను (దర్భత్రాడులను), ఆమపాత్రములను, మూడు అతుకులు గల లోహమయ పాత్రలను, వజ్రరూపములు, అర్బుదరూపములు అయిన వానిని పృషదాజ్యంలో పడవేసి, అభిమంత్రించి యుద్ధస్థలంలో ఉంచాలి.

అలాగే దీనితో శ్వేతపాదములు గల గోవును అభిమంత్రించి రాజచిహ్నమైన కేతుదండమునకు రహస్యంగా కట్టివేయాలి.

మరొక దానిని ఇలానే చేసి శత్రుసేనా మధ్యంలో వదలాలి. ఆ తర్వాత యుద్ధార్థమై సేనానాయకుని పంపించాలి.

మంత్రము :

యే బాహవో యా ఇషవో

ధన్వనాం వీర్యాఽణి చ ।

అసీన్ పరశూ నాయుధం

చిత్తాకూతం చ యద్ధృది ।

సర్వం త దర్బుదే త్వ మమిత్రేభ్యో

దృశే కురూదారాంశ్చ ప్ర దర్శయ ॥ 1 ॥

పదము :

యే । బాహవః । యాః । ఇషవః ।

ధన్వనామ్ । వీర్యాఽణి । చ ।

అసీన్ । పరశూన్ । ఆయుధమ్ ।

చిత్తఽఆకూతమ్ । చ । యత్ । హృది ।

సర్వమ్ । తత్ । అర్బుదే । త్వమ్ । అమిత్రేభ్యః ।
దృశే । కురు । ఉత్ఽఆరాన్ । చ । ప్ర । దర్శయ ॥ 1 ॥

**అనువాదం :**

మా యుద్ధభటుల హస్తములు, బాణములు,
మా ధానుష్కుల వీర కర్మలు, ఖడ్గములు,
కుఠారములు, ఇతరాయుధములు - ఇవన్నీ,
మా వీరుల హృదయంలో ఉన్న
శత్రుమారణ సంకల్పం - అదంతా
ఓ * అర్బుదా! (అర్బుద పుత్రుడవైన సర్పమా!) నీవు
మా శత్రువుల దృష్టికి తీసుకుని రా.
మరిన్ని ఉద్గతములైన వానిని ప్రదర్శించు. ॥ 1 ॥

మంత్రము :

ఉత్తిష్ఠత సం నహ్యధ్వం
మిత్రా దేవజనా యూయమ్ ।
సందృష్టా గుప్తా వః సన్తు
యా నో మిత్రాణ్యర్బుదే ॥ 2 ॥

పదము :

ఉత్ । తిష్ఠత । సమ్ । నహ్యధ్వమ్ ।
మిత్రాః । దేవఽజనాః । యూయమ్ ।

* ఆ పేరుగల సర్పఋషి.

సమ్ఽదృష్టా । గుప్తా । వః । సన్తు ।

యా । నః । మిత్రాణి । అర్బుదే ॥ 2 ॥

**అనువాదం:**

మిత్రులైన దేవజనులారా! మీరు లేవండి.
యుద్ధసన్నద్ధులు కండు.
మీకు కనిపించిన మా భటులు రక్షితులగుదురు గాక!
ఓ సర్పమా! మా శత్రువులతో
యుద్ధం చేయడానికి వచ్చిన మా సైన్యం
రక్షితమగు గాక! ॥ 2 ॥

**మంత్రము:**

ఉత్తిష్ఠత మా రభేథా-

మాదానసందానాభ్యామ్ ।

అమిత్రాణాం సేనా

అభి ధత్త మర్బుదే ॥ 3 ॥

**పదము:**

ఉత్ । తిష్ఠతమ్ । ఆ । రభేథామ్ ।

ఆదానఽసందానాభ్యామ్ ।

అమిత్రాణామ్ । సేనాః ।

అభి । ధత్తమ్ । అర్బుదే ॥ 3 ॥

అనువాదం :

ఓ అర్బుదమా! నీవు, నీ పుత్రుడు
ఉత్తిష్ఠులగుదురు గాక!
పిదప ఆదాన సందానములతో
అమిత్రసేనను బంధింతురు గాక! ॥ 3 ॥

మంత్రము.

అర్బుది ర్నామ యో దేవ

ఈశానశ్చ న్య౨ర్బుదిః ।

యాభ్యా మన్తరిక్ష మావృత-

మియం చ పృథివీ మహీ ।

తాభ్యా మిన్ద్రమేదిభ్యా మహం

జిత మన్వేమి సేనయా ॥ 4 ॥

పదము :

అర్బుదిః । నామ । యః । దేవః ।

ఈశానః । చ । ని౨అర్బుదిః ।

యాభ్యామ్ । అన్తరిక్షమ్ । ఆ౨వృతమ్ ।

ఇయమ్ । చ । పృథివీ । మహీ ।

తాభ్యామ్ । ఇన్ద్రమేది౨భ్యామ్ । అహమ్ ।

జితమ్ । అను । ఏమి । సేనయా ॥ 4 ॥

అనువాదం :

అర్బుదిగా ప్రసిద్ధమైన సర్వాత్మకదేవుడు
ఎవడైతే ఉన్నాడో, ఆ ప్రభువు,
అర్బుదపుత్రుడైన సర్వము - వీరిరువురితో
ఆవృతమైన అంతరిక్షమంతా,
వారిచే ఆవృతమైన విశాలమైన పృథివి,
వారు వ్యాపించిన ఇంద్రమేదుల
అర్బుది, అర్బుదులతో విజితమైన
శత్రుబలం - వెనుకగా నేను వెడతాను. ॥ 4 ॥

మంత్రము :

ఉత్తిష్ఠ త్వం దేవజనా-
ర్బుదే సేనయా సహ ।
భఞ్జన్నమిత్రాణాం సేనాం
భోగేభిః పరి వారయ ॥ 5 ॥

పదము :

ఉత్ । తిష్ఠ । త్వమ్ । దేవఽజన ।
అర్బుదే । సేనయా । సహ ।
భఞ్జన్ । అమిత్రాణామ్ । సేనామ్ ।
భోగేభిః । పరి । వారయ ॥ 5 ॥

అనువాదం:

ఓ దేవజనా! అర్బుదా!
నీవు సేనతోపాటు సిద్ధం కమ్ము.
శత్రువుల సేనను భంగం చెందించి
నిజ సర్పశరీరంతో వారిని చుట్టి వెయ్యి. ॥ 5 ॥

మంత్రము:

సప్త జాతాన్ న్యర్బుద
ఉదారాణాం సమీక్షయన్ ।
తేభిష్ట్వ మాజ్యే హుతే
సర్వై రుత్తిష్ఠ సేనయా ॥ 6 ॥

పదము.

సప్త । జాతాన్ । ని౨అర్బుదే ।
ఉత్౨ఆరాణామ్ । సమ్౨ఈక్షయన్ ।
తేభిః । త్వమ్ । ఆజ్యే । హుతే ।
సర్వైః । ఉత్ । తిష్ఠ । సేనయా ॥ 6 ॥

అనువాదం:

ఓ న్యర్బుదా! ప్రాగుక్త లక్షణములుగల వాని
మధ్యలో సప్తసంఖ్యాకులుగా ఉత్పన్నులైన
వారిని శత్రువులకు చూపిస్తూ నీవు
ఆజ్యోపలక్షితమైన హుతంలో
వారందరితో పాటు మా సేనతోపాటు బయలుదేరు. ॥ 6 ॥

మంత్రము :

ప్రతిఘ్నానాశ్రుముఖీ

కృధుకర్ణీ చ క్రోశతు ।

వికేశీ పురుషే హతే

రదితే అర్బుదే తవ ॥ 7 ॥

పదము .

ప్రతిఽఘ్నానా । అశ్రుఽముఖీ ।

కృధుఽకర్ణీ । చ । క్రోశతు ।

విఽకేశీ । పురుషే । హతే ।

రదితే । అర్బుదే । తవ ॥ 7 ॥

**అనువాదం:**

ఓ అర్బుదమా! పండ్లతో కాటు వేసి
శత్రువు మృతుడుకాగా
అతని భార్య నెత్తి నోరూ కొట్టుకుంటూ
అశ్రుముఖి అయి కర్ణాభరణములు తీసివేసి
వెంట్రుకలు విరబోసుకుని రోదనం చేయుగాక! ॥ 7 ॥

మంత్రము :

సంకర్షన్తీ కరూకరం

మనసా పుత్ర మిచ్ఛన్తీ ।

పతిం భ్రాతర మాత్స్వాన్

రదితే అర్బుదే తవ ॥ 8 ॥

పదము :

సమ్ఽకర్షన్తీ। కరూకరమ్।

మనసా। పుత్రమ్। ఇచ్ఛన్తీ।

పతిమ్। భ్రాతరమ్। ఆత్। స్వాన్।

రదితే। అర్బుదే। తవ ॥ 8 ॥

అనువాదం :

ఓ అర్బుదమా! నీ దంతవిలేఖనంతో
పటపటలాడే అస్థిజాతాన్ని లాగుతూ,
మనస్సుతో ఆత్మీయ పుత్రుని
అభిలషిస్తూ, భర్తను కోరుతూ,
సోదరుని, బంధుజనులను పిలుస్తూ
రోదించు గాక! ॥ 8 ॥

మంత్రము :

అలిక్లవా జాష్కమదా

గృధ్రాః శ్యేనాః పతత్రిణః।

ధ్వాఙ్క్షాః శకునయ స్తృప్య

న్త్వమిత్రేషు సమీక్షయన్

రదితే అర్బుదే తవ ॥ 9 ॥

పదము :

అలిక్లవాః । జాష్కమదాః ।

గృధ్రాః । శ్యేనాః । పతత్రిణః ।

ధ్వాఙ్క్షాః । శకునయః । తృప్యన్తు ।

అమిత్రేషు । సమ్ఽఈక్షయన్ ।

రదితే । అర్బుదే । తవ ॥ 9 ॥

అనువాదం :

దృష్టులైన పక్షులు, పక్షిజాతులు ఏవైతే ఉన్నవో,
శరీరశ్రమను కల్పించే ఆ గృధ్రముల వంటి
పక్షులు, డేగలు, ఇతర మాంసభక్షకములైన పక్షులు,
కాకులు - ఇవన్నీ ఓ అర్బుదమా !
నీ విషదంత విలేఖనంతో మా శత్రువులను నిరీక్షిస్తూ
తదనంతరం తద్భక్షణంతో సంతృప్తాలగును గాక ! ॥ 9 ॥

మంత్రము :

అథో సర్వం శ్వాపదం

మక్షికా తృప్యతు క్రిమిః ।

పౌరుషేయేఽధి కుణపే

రదితే అర్బుదే తవ ॥ 10 ॥

పదము :

అథో ఇతి । సర్వమ్ । శ్వాపదమ్ ।

మక్షికా । తృప్యతు । క్రిమిః ।

పౌరుషేయే । అధి । కుణపే ।

రదితే । అర్బుదే । తవ ॥ 10 ॥

అనువాదం :

మరిన్ని సర్వశునకముల వంటి
సృగాల, వ్యాఘ్రాదు లన్నీ, నీలమక్షికములన్నీ,
(చెడిన మాంసంలో పుట్టే) క్రిములన్నీ,
శవంపై పడి సంతృప్తి చెందు గాక! ॥ 10 ॥

మంత్రము :

ఆ గృహ్ణీతం సం బృహతం

ప్రాణాపానాన్ న్యర్బుదే ।

నివాశా ఘోషాః సం య

న్త్వమిత్రేషు సమీక్షయన్

రదితే అర్బుదే తవ ॥ 11 ॥

పదము :

ఆ । గృహ్ణీతమ్ । సమ్ । బృహతమ్ ।

ప్రాణాపానాన్ । ని౨అర్బుదే ।

నిఽవాశాః । ఘోషాః । సమ్ । యన్తు ।
అమిత్రేషు । సమ్ఽఈక్షయన్ ।
రదితే । అర్బుదే । తవ ॥ 11 ॥

అనువాదం.

ఓ న్యర్బుదా! నీవు, అర్బుది కలిసి
శత్రువుల ప్రాణాపానములను పరిగ్రహించండి.
సమూలంగా వానిని లాగి వేయండి.
ఓ అర్బుదా! నీవు పళ్ళుకొరకగా
అమిత్రులైన శత్రువులయందు
ఆ శబ్దం సమీక్షితమగు గాక!
సమీక్షిస్తున్న వారి వినాశం, ఏడుపులు
కావలసినన్ని పొడచూపు గాక! ॥ 11

మంత్రము:

ఉద్ వేపయ సం విజన్తాం
భియా మిత్రా త్వం సృజ ।
ఉరుగ్రాహై ర్బాహ్వఙ్కై-
ర్విధ్యామిత్రాన్ న్యర్బుదే ॥ 12 ॥

పదము:

ఉత్ । వేపయ । సమ్ । విజన్తామ్ ।
భియా । అమిత్రాన్ । సమ్ । సృజ ।

ఉరుఽగ్రాహైః । బాహుఽఅజ్కైః ।

విధ్య । అమిత్రాన్ । నిఽఅర్బుదే ॥ 12 ॥

అనువాదం :

ఓ న్యర్బుద దేవా! మా శత్రువులను గడగడలాడించు.
వారు భయంతో బయలుదేరి
ఉద్విగ్నులగుదురు గాక!
భయంతో వారిని సంయోగింప జెయ్యి.
ఉరుగ్రాహములతో, బాహ్వంకబంధనములతో
మా శత్రువులకు బాధించు. ॥ 12 ॥

మంత్రము :

ముహ్య న్త్వేషాం బాహవ
శ్చిత్తాకూతం చ యద్ధృది ।
మైషా ముచ్ఛేషి కిం చన
రదితే అర్బుదే తవ ॥ 13 ॥

పదము :

ముహ్యన్తు । ఏషామ్ । బాహవః ।
చిత్తఽఆకూతమ్ । చ । యత్ । హృది ।
మా । ఏషామ్ । ఉత్ । శేషి । కిమ్ । చన ।
రదితే । అర్బుదే । తవ । ॥ 13 ॥

**అనువాదం :**

ఓ అర్బుదా ! నీవు కాటువేయగా
శత్రు బాహువులు క్రియామూఢములగు గాక !
శత్రు హృదయంలో ఏ సంకల్పం ఉన్నదో,
అది కూడా విస్మృతమగు గాక !
మరిన్ని శత్రు సంబంధమైన
చతురంగబలం నిశ్శేషమగు గాక ! ॥ 13 ॥

**మంత్రము :**

**ప్రతిఘ్నానాః సం ధావ-**
**న్తూరః పటూరా వాఘ్నానాః ।**
**అఘారిణీ ర్వికేశ్యో౽ రుదత్యః**
**పురుషే హతే రదితే అర్బుదే తవ ॥ 14 ॥**

**పదము :**

**ప్రతి౽ఘ్నానాః । సమ్ । ధావన్తు ।**
**ఉరః । పటూరౌ । ఆ౽ఘ్నానాః ।**
**అఘారిణీః । వి౽కేశ్య౽ః । రుదత్య౽ః ।**
**పురుషే । హతే । రదితే । అర్బుదే । తవ ॥ 14 ॥**

**అనువాదం :**

ఓ అర్బుదా ! నీ కోరలకాటుతో
పురుషుడు హతుడు కాగా,

అతని స్త్రీలు తమ శరీరాన్ని కొట్టుకుంటూ
వక్షస్థలాన్ని, తొడలను తమచేతులతో
కొట్టుకుంటూ, వెంట్రుకలు విరబోసుకుని
దుఃఖార్తలై రోదిస్తూ (మృతపురుషుని వద్దకు)
పరువెత్తుదురు గాక! ॥ 14 ॥

మంత్రము:

శ్వఽన్వతీ రప్సరసో
రూపకా ఉతార్బుదే ।
అన్తఃపాత్రే రేరిహతీం
రిశాం దుర్ణిహితైషిణీమ్ ।
సర్వా స్తా అర్బుదే త్వ
మమిత్రేభ్యో దృశే కు
రూదారాంశ్చ ప్ర దర్శయ ॥ 15 ॥

పదము.

శ్వఽన్ఽవతీః । అప్సరసః ।
రూపకాః । ఉత । అర్బుదే ।
అన్తఃఽపాత్రే । రేరిహతీమ్ ।
రిశామ్ । దుర్నిహితఽఏషిణీమ్ ।
సర్వాః । తాః । అర్బుదే । త్వమ్ ।

అమిత్రేభ్యః । దృశే । కురు ।

ఉత్ఽఆరాన్ । చ । ప్ర । దర్శయ ॥ 5 ॥

**అనువాదం :**

క్రీడార్థం శునకసహితలైన అప్సరసలు,
కేవల రూపమాత్రోపమాన లభ్యములైన సేనలు-
ఓ అర్బుదమా! వీటిసన్నిటినీ శత్రువులకు చూపించు.
పాత్రమధ్యాన్ని నాకుతూ,
దృష్టినిక్షిప్తాన్ని కోరుతున్న గోవును
ఓ అర్బుదమా! నీవు మొదట చెప్పినవన్నీ
శత్రువులకు చూపించు.
అలాగే అద్భుతరూపులు, వికృతదర్శనులు
అయిన రాక్షసాదులను కూడా చూపించు. 15 ॥

**మంత్రము :**

ఖడూరేఽధిచఙ్క్రమాం

ఖర్వికాం ఖర్వవాసినీమ్ ।

య ఉదారా అన్తర్హితా

గన్ధర్వాప్సరసశ్చ యే ।

సర్పా ఇతరజనా రక్షాంసి ॥ 16 ॥

**పదము :**

ఖడూరే । అధిఽచఙ్క్రమామ్ ।

ఖర్వికామ్ । ఖర్వఽవాసినీమ్ ।

యే । ఉత్ఽఆరాః । అన్తఃఽహితాః ।

గన్ధర్వఽఅప్సరసః । చ । యే ।

సర్పాః । ఇతరఽజనాః । రక్షాంసి ॥ 16 ॥

అనువాదం :

దూరంలో నున్న ఆకాశంనందుండి
సంక్రమణశీలమైన, కొద్దిగా కురచగానున్న,
కొద్దిగా శబ్దిస్తున్న దానిని ఓ అర్బుదమా!
శత్రువులకు చూపించు.
యక్షరాక్షసాదులు, మాయతో కన్పించకుండా ఉన్న
గంధర్వాప్సరసలు - వీరందరిని
శత్రువులకు చూపించు.
సర్పస్వరూపులు, ఇతరజనసంజ్ఞకులు-
అయిన దేవతలు, రాక్షసులు- ॥ 16 ॥

మంత్రము :

చతుర్దంష్ట్రాం ఛ్యావదతః

కుమ్భముష్కాం అసృఙ్ముఖాన్ ।

స్వభ్యసా యే చోద్భ్యసాః ॥ 17 ॥

పదము :

చతుఃఽదంష్ట్రాన్ । శ్యావఽదతః ।

కుమ్భఽముష్కాన్ । అసృక్ఽముఖాన్ ।

స్వఽభ్యసాః । యే । చ । ఉత్ఽభ్యసాః ॥ 17 ॥

అనువాదం :

నాలుగు కోరలు కలవారు,
నల్లని పండ్లు కలవారు,
ఈ మాయామయులైన వారినందరిని
శత్రువులకు చూపించు.
కుంభముష్కయుక్తులు, రక్తాస్యులు,
స్వాయత్తభీతులు అయిన రాక్షసులు,
ఉద్గతభీతులైన రాక్షసులు,
ఇలాంటి వారినందరినీ శత్రువులకు
మాయతో కన్పింపజెయ్యి. ॥ 17 ॥

మంత్రము :

ఉద్ వేపయ త్వ మర్బుదేఽ-
మిత్రాణా మమూః సిచః ।
జయాంశ్చ జిష్ణు శ్చామిత్రాం
జయతా మిన్ద్రమేదినౌ ॥ 18 ॥

పదము.

ఉత్ । వేపయ । త్వమ్ । అర్బుదే ।
అమిత్రాణామ్ । అమూః । సిచః ।
జయన్ । చ । జిష్ణుః । చ । అమిత్రాన్ ।
జయతామ్ । ఇన్ద్రఽమేదినౌ ॥ 18 ॥

అనువాదం :

ఓ అర్బుదా! నీవు శత్రువుల సేనలు
శోకార్తులై గడగడలాడునట్లు చెయ్యి.
అలాగే శత్రువులను పరాభవించి,
జయశీలురైన అర్బుద, న్యర్బుదులు
ఇంద్రసహితులు మాకు జయం చేకూర్చుదురు గాక! ॥ 18 ॥

మంత్రము .

ప్రబ్లీనో మృదితః శయాం
హతో౽మిత్రో న్యర్బుదే ।
అగ్నిజిహ్వా ధూమశిఖా
జయన్తీ ర్యన్తు సేనయా ॥ 19 ॥

పదము .

ప్రఽబ్లీనః । మృదితః । శయామ్ ।
హతః । అమిత్రః । నిఽఅర్బుదే ।
అగ్నిఽజిహ్వాః । ధూమఽశిఖాః ।
జయన్తీః । యన్తు । సేనయా ॥ 19 ॥

అనువాదం :

ఓ న్యర్బుదా! మా శత్రువు భీతచేతస్కుడు,
సంపిష్టగాత్రుడు, గతాశువు అయి పడుకొను గాక!
నివు మాయతో సృష్టించిన అగ్నిజిహ్వలు,

ధూమశిఖులు శత్రుబలాన్ని జయించే
మా సేనలతో ఎటు వెళ్ళుదురు గాక! ॥ 19 ॥

మంత్రము

తయార్బుదే ప్రణుత్తానా-
మిన్ద్రో హన్తు వరంవరమ్ ।
అమిత్రాణాం శచీపతి-
ర్మామీషాం మోచి కశ్చన ॥ 20 ॥

పదము

తయా । అర్బుదే । ప్రఽనుత్తానామ్ ।
ఇన్ద్రః । హన్తు । వరమ్ఽవరమ్ ।
అమిత్రాణామ్ । శచీఽపతిః ।
మా । అమీషామ్ । మోచి । కః । చన ॥ 20 ॥

అనువాదం

ఓ అర్బుదా! నీవు యుద్ధరంగం నుంచి
తరిమివేసిన శత్రువులను శచీపతి అయిన
ఇంద్రుడు మరిమరీ వధించు గాక!
ఈ శత్రువుల మధ్యలో ఒకడు కూడా
తప్పించుకొనకుండు గాక! ॥ 20 ॥

మంత్రము :

ఉత్కసన్తు హృదయా-
న్యూర్ధ్వః ప్రాణ ఉదీషతు ।

శౌష్కాస్య మను వర్తతా-
మమిత్రాన్ మోత మిత్రిణః ॥ 21 ॥

పదము

ఉత్ । తసన్తు । హృదయాని ।
ఊర్ధ్వః । ప్రాణః । ఉత్ । ఈషతు ।
శౌష్క౽ఆస్యమ్ । అను । వర్తతామ్ ।
అమిత్రాన్ । మా । ఉత । మిత్రిణః ॥ 21 ॥

అనువాదం

శత్రుహృదయములు
వారిలో నుంచి ఎగిరిపోవు గాక !
ప్రాణవాయువు పైకి ఎగిరిపోవు గాక !
శత్రువులు నోరెండిపోయి మరణింతురు గాక !
మాకు మిత్రులైన జనులు అట్లు కాకుందురు గాక ! ॥ 21

మంత్రము

యే చ ధీరా యే చాధీరాః
పరాఞ్చో బధిరాశ్చ యే ।
తమసా యే చ తూపరా
అథో బస్తాభివాసినః ।

సర్వాం స్తాం అర్బుదే త్వ

మమిత్రేభ్యో దృశే కు

రూదారాంశ్చ ప్ర దర్శయ ॥ 22 ॥

పదము

యే । చ । ధీరాః । యే । చ । అధీరాః ।

పరాఞ్చః । బధిరాః । చ । యే ।

తమసాః । యే । చ । తూపరాః ।

అథో ఇతి । బస్త ఽఅభివాసినః ।

సర్వాన్ । తాన్ । అర్బుదే । త్వమ్ ।

అమిత్రేభ్యః । దృశే । కురు ।

ఉత్ ఽఆరాన్ । చ । ప్ర । దర్శయ ॥ 22 ॥

అనువాదం :

ధీరులు, కాతరులు, పరాఙ్ముఖులు, బధిరులు,
తమోభ్రాంతులు, మరిన్ని
బస్తాభిధ్వనిని చేయువారు—
ఓ అర్బుదా ! నీవు నీ మాయతో
సృష్టించిన వారినందరిని శత్రువులకు దర్శింపజెయ్యి
అలాగే అద్భుతరూపులు, వికృతదర్శనులు
అయిన రాక్షసాదులను కూడా చూపించు ॥ 22 ॥

మంత్రము:

అర్బుదిశ్చ త్రిషన్ధిశ్చా-

మిత్రాన్ నో వి విధ్యతామ్।

యథైషా మిన్ద్ర వృత్రహన్ హనామ

శచీపతేఽమిత్రాణాం సహస్రశః ॥ 23 ॥

పదము

అర్బుదిః । చ । త్రిఽసంధిః । చ ।

అమిత్రాన్ । నః । వి । విధ్యతామ్ ।

యథా । ఏషామ్ । ఇన్ద్ర । వృత్రఽహన్ । హనామ ।

శచీఽపతే । అమిత్రాణామ్ । సహస్రఽశః ॥ 23 ॥

అనువాదం.

సేనామోహకులైన దేవుడు,
అర్బుది కలిసి మా శత్రువులను
బాగుగా కొట్టుదురు గాక!
ఓ వృత్రహంతా! ఇంద్రా! శచీపతీ!
ఏ విధంగా ఈ శత్రువులను వేలాదిగా
చంపగలమో అలా చెయ్యి. ॥ 23 ।

మంత్రము:

వనస్పతీన్ వానస్పత్యా-

నోషధీ రుత వీరుధః ।

గన్ధర్వాప్సరసః సర్పాన్

దేవాన్ పుణ్యజనాన్ పితౄన్ ।

సర్వాం స్తాం అర్బుదే త్వ

మమిత్రేభ్యో దృశే కు

రూదారాంశ్చ ప్ర దర్శయ ॥ 24 ॥

పదము

వనస్పతీన్ । వానస్పత్యాన్ ।

ఓషధీః । ఉత । వీరుధః ।

గన్ధర్వ౨అప్సరసః । సర్పాన్ ।

దేవాన్ । పుణ్య౨జనాన్ । పితౄన్ ।

సర్వాన్ । తాన్ । అర్బుదే । త్వమ్ ।

అమిత్రేభ్యః । దృశే । కురు ।

ఉత్౨ఆరాన్ । చ । ప్ర । దర్శయ ॥ 24 ॥

అనువాదం ॥

వృక్షములను, తద్వికారములైన వానిని,
ఓషధులను, తీవెలను, గంధర్వాప్సరసలను,
సర్పములను, దేవతలను, పుణ్యజనులను,
పితరులను, వీరందరినీ ఓ అర్బుదా!

నీవు శత్రువులకు కనపడునట్లు చెయ్యి.
అలాగే అద్భుతరూపులు, వికృతదర్శనులు
అయిన రాక్షసాదులను కూడా చూపించు. ॥ 24 ॥

మంత్రము ।

ఏషాం వో మరుతో దేవ
ఆదిత్యో బ్రహ్మణస్పతిః ।
ఏషాం వ ఇన్ద్ర శ్చాగ్నిశ్చ
ధాతా మిత్రః ప్రజాపతిః ।
ఏషాం వ ఋషయ శ్చక్రు-
రమిత్రేషు సమీక్షయన్
రదితే అర్బుదే తవ ॥ 25 ॥

పదము.

ఏషామ్ । వః । మరుతః । దేవః ।
ఆదిత్యః । బ్రహ్మణః । పతిః ।
ఏషామ్ । వః । ఇన్ద్రః । చ । అగ్నిః । చ ।
ధాతా । మిత్రః । ప్రజాఽపతిః ।
ఏషామ్ । వః । ఋషయః । చక్రుః ।

అమిత్రేషు । సమ్ఽఈక్షయన్ ।

రదితే । అర్బుదే । తవ ॥ 25 ॥

అనువాదం

ఓ శత్రువులారా! మీకు మరుత్తులు
మొదలైన దేవతలు శిక్షకులగుదురు గాక!
అలాగే ఇంద్రుడు, అగ్ని మీకు నియంతలగుదురు గాక!
ఋషులు శిక్షకులగుదురు గాక!
ఓ అర్బుదా! శత్రువులలో నీవు
దంతవిలేఖనం చేసినట్లయితే,
చూస్తున్న దేవాదులు శిక్షకులగుదురు గాక!
అట్టి ధాత, మిత్రుడు, ప్రజాపతి శిక్షకులగుదురు గాక! ॥25॥

మంత్రము

తేషాం సర్వేషా మీశానా
ఉత్తిష్ఠత సం నహ్యధ్వం
మిత్రా దేవజనా యూయమ్ ।
ఇమం సంగ్రామం సంజిత్య
యథాలోకం వి తిష్ఠధ్వమ్ ॥ 26 ॥

పదము

తేషామ్ । సర్వేషామ్ । ఈశానాః ।

ఉత్ । తిష్ఠత । సమ్ । నహ్యధ్వమ్ ।

మిత్రాః । దేవ౨జనాః । యూయమ్ ।

ఇమమ్ । సమ్౨గ్రామమ్ । సమ్౨జిత్య ।

యథా౨లోకమ్ । వి । తిష్ఠధ్వమ్ ॥ 26 ॥

అనువాదం.

ఆ మా సర్వశత్రువులకు శిక్షకులై,
లేచి సన్నద్ధులగుదురు గాక!
ఓ మిత్రులారా! దేవజనులారా!
మీరు మా ఈ సంగ్రామాన్ని బాగా
జయించి యథాలోకాలకు వెళ్ళిపొండి. ॥ 26 ॥

ఇది తొమ్మిదవ సూక్తం.

## సూక్తం - 10

ఋషులు: భృగ్వంగిరసులు॥ దేవత: త్రిషంధి॥ ఛందస్సు-1 విరాట్ పథ్యా బృహతీ; 2 షట్పదా త్రిష్టుబ్గర్భాతిజగతీ: 3 విరాడాస్తార పంక్తి: 4 విరాడనుష్టుప్, 5-7,10,11,14,15,18-20,23,24 అనుష్టుప్: 8 విరాట్ త్రిష్టుప్. 9 పురోవిరాడ్ త్రిష్టుప్, 9 పురోవిరాడ్ పురస్తాజ్జ్యోతిష్త్రిష్టుప్. 12 పఞ్చపదా పథ్యాపంక్తి: 13 షట్పదా జగతీ: 16 షట్పదా కకుమ్మత్యనుష్టుప్ త్రిష్టుబ్గర్భా శక్వరీ, 17 పథ్యాపంక్తి: 21 త్రిపదాగాయత్రీ. 22 విరాట్ పురస్తాద్ బృహతీ: 25 కకుప్ (ఉష్ణిక్), 26 ప్రస్తారపంక్తి॥ మంత్రములు ॥ 27 ॥

వినియోగం:- పూర్వ సూక్తంలో వలెనే దీనికి కూడా వినియోగం.

మంత్రము

ఉత్తిష్ఠత సం నహ్యధ్వ-

ముదారాః కేతుభిః సహ ।

సర్పా ఇతరజనా రక్షాం-

స్యమిత్రా నను ధావత ॥ 1 ॥

పదము :

ఉత్ । తిష్ఠత । సమ్ । నహ్యధ్వమ్ ।

ఉత్ఽఆరాః । కేతుఽభిః । సహ ।

సర్పాః । ఇతరఽజనాః । రక్షాంసి ।

అమిత్రాన్ । అను । ధావత ॥ 1 ॥

అనువాదం :

ఉదారులైన సేనానాయకులారా !
మీ మీ ధ్వజాలతో పాటు లేవండి
సన్నద్ధులై యుద్ధోద్యుక్తులు కండి
ఓ సర్పములారా ! మీరు కూడా మా శత్రువులను
వెన్నంటి పరువెత్తండి. ॥ 1 ॥

మంత్రము :

ఈశాం వో వేద రాజ్యం త్రిషన్ధే

అరుణైః కేతుభిః సహ ।

యే అన్తరిక్షే యే దివి

పృథివ్యాం యే చ మానవాః ।

త్రిషన్ధే స్తే చేతసి దుర్ణామాన ఉపాసతామ్ ॥ 2 ॥

పదము

ఈశామ్ । వః । వేద । రాజ్యమ్ । త్రిఽసన్ధే ।

అరుణైః । కేతుఽభిః । సహ ।

యే । అన్తరిక్షే । యే । దివి ।

పృథివ్యామ్ । యే । చ । మానవాః ।

త్రిఽసంధేః । తే । చేతసి ।

దుఃఽనామానః । ఉప । ఆసతామ్ ॥ 2 ॥

అనువాదం:

ఓ శత్రువులారా ! మీ రాష్ట్రాన్ని త్రిసంధిదేవుడు
ఈశ్వరుడై తెలుసుకొనుగాక !
ఓ వజ్రాత్మకదేవా ! అరుణవర్ణములైన
ఆత్మీయ ధ్వజములతో పాటు ఉద్గమించు.
అంతరిక్షంలో ప్రాదుర్భవించేవి,
ద్యులోకంలో ప్రాదుర్భవించేవి,
భూలోకంలో ప్రాదుర్భవించేవి,
అయిన ధ్వజములతో ఉద్గమించు.
ఓ త్రిసంధీ ! నీ మనస్సులో నున్న
మా దుష్టశత్రువును గ్రహించుదువు గాక ! ॥ 2 ॥

మంత్రము :

అయోముఖాః సూచీముఖా

అథో వికఙ్కతీముఖాః ।

క్రవ్యాదో వాతరంహస

ఆ సజన్త్వమిత్రాన్

వజ్రేణ త్రిషన్ధినా ॥ 3 ॥

పదము :

అయఃఽముఖాః । సూచీఽముఖాః ।

అథో ఇతి । వికఙ్కతీఽముఖాః ।

క్రవ్యఽఅదః । వాతఽరంహసః ।

ఆ । సజన్తు । అమిత్రాన్ ।

వజ్రేణ । త్రిఽసంధినా ॥ 3 ॥

అనువాదం :

అయోముఖులు, సూచీముఖులు అయిన పక్షులు,
మరిన్ని కంటకమయములైన వృక్షవిశేషములు,
వాయువేగంతో వెళ్ళేవి,
త్రిసంధినామక వజ్రాయుధంతో
ప్రేరితములై శత్రువులపై అనక్తములగు గాక! ॥ 3 ॥

మంత్రము.

అన్తర్ధేహి జాతవేద

ఆదిత్య కుణపం బహు ।

త్రిషన్ధే రియం సేనా

సుహితాస్తు మే వశే ॥ 4 ॥

పదము

అన్తః । ధేహి । జాత౽వేదః ।

ఆదిత్య । కుణపమ్ । బహు ।

త్రి౽సంధేః । ఇయమ్ । సేనా ।

సు౽హితా । అస్తు । మే । వశే ॥ 4 ॥

అనువాదం,

ఓ జాతవేదా! ఆదిత్యా! బహుళ శవశరీరంతో
అంతరిక్షంలో అచ్ఛాదించు.
త్రిషంధిదేవునకు చెందిన ఈ సేన
నా వశంలో నిహితమగు గాక! ॥ 4 ॥

మంత్రము

ఉత్తిష్ఠ త్వం దేవజనా-

ర్బుదే సేనయా సహ ।

అయం బలి ర్వ ఆహుత-
స్త్రిషన్ధే రాహుతిః ప్రియా ॥ 5 ॥

పదము :

ఉత్ । తిష్ఠ । త్వమ్ । దేవఽజన ।
అర్బుది । సేనయా । సహ ।
అయమ్ । బలిః । వః । ఆఽహుతః ।
త్రిఽసంధేః । ఆఽహుతిః । ప్రియా ॥ 5 ॥

అనువాదం :

ఓ దేవజనా! అర్బుదా! నీవు నీ సేనతో పాటు బయలుదేరు
ఆహుతి ఇస్తున్న నీకు ఈ బలి తృప్తికరమగు గాక!
త్రిషంధిదేవుని సేన కూడా ఆహుతితో ప్రీతిచెంది
శత్రువులను వధించు గాక! ॥ 5 ॥

మంత్రము

శితిపదీ సం ద్యతు
శరవ్యేయం చతుష్పదీ ।
కృత్యే మిత్రేభ్యో భవ
త్రిషన్ధేః సహ సేనయా ॥ 6 ॥

పదము.

శితిఽపదీ । సమ్ । ద్యతు ।

శరవ్యా౭ ఇయమ్ । చతుఃఽపదీ ।

కృత్యే । అమిత్రేభ్యః । భవ ।

త్రిఽసంధేః । సహ । సేనయా ॥ 6 ॥

అనువాదం:

శ్వేతవర్ణపాదములు గల గోవు
పాదచతుష్టయోపేతమైనది,
శరసంహతిరూపమై శత్రువుల మీద పడు గాక!
కృత్యారూపంలో నున్న ఓ గోవా!
శత్రు సంహారిణివి కమ్ము.
త్రిసంధి సేనకూడా నీ వైపున్నది. ॥ 6 ॥

మంత్రము.

ధూమాక్షీ సం పతతు

కృధుకర్ణీ చ క్రోశతు ।

త్రిషన్ధేః సేనయా జితే

అరుణాః సన్తు కేతవః ॥ 7 ॥

పదము.

ధూమఽఅక్షీ । సమ్ । పతతు ।

కృధుఽకర్ణీ । చ । క్రోశతు ।

త్రిషన్ధేః । సేనయా । జితే ।

అరుణాః । సన్తు । కేతవః ॥ 7 ॥

అనువాదం :

శత్రుసేన ధూమాక్షి అయి వచ్చిపడు గాక !
పటుహాధ్వనితో చెవులు దిమ్ముపడి
ఆ పరసేన ఆక్రోశించు గాక !
ఈ విధంగా త్రిసంధిసేన పరసేనను జయించగా
వారి ధ్వజములు రక్తముతో తడిసినవై
అరుణవర్ణములగు గాక ! ॥ 7 ॥

మంత్రము

అవాయన్తాం పక్షిణో యే
వయాం స్యన్తరిక్షే దివి యే చరన్తి ।
శ్వాపదో మక్షికాః సం రభన్తా-
మామాదో గృధ్రాః కుణపే రదన్తామ్ ॥ 8 ॥

పదము :

అవ । అయన్తామ్ । పక్షిణః । యే ।
వయాంసి । అన్తరిక్షే । దివి । యే । చరన్తి ।
శ్వాపదః । మక్షికాః । సమ్ । రభన్తామ్ ।
ఆమ౽అదః । గృధ్రాః । కుణపే । రదన్తామ్ ॥ 8 ॥

**అనువాదం।**

అంతరిక్షంలో తిరుగుతున్న పక్షులు
శత్రుబలం నశింపగా వారిపై వాలుగాక।
ద్యులోకంలో తిరుగుతున్న పక్షులు,
మృగములు, మక్షికములు - ఇవన్నీ
శవభక్షణార్థమై ఉప్రకమించు గాక।
గ్రద్దలు శవశరీరాలను తమ ముక్కులతో,
కాళ్ళతో ఛిన్నాభిన్నం చేయుగాక। ॥ 8 ॥

మంత్రము

యా మిన్ద్రేణ సంధాం సమధత్థా
బ్రహ్మణా చ బృహస్పతే।
తయాఽహ మిన్ద్రసంధయా
సర్వాన్ దేవానిహ హువ
ఇతో జయత మా ముతః ॥ 9 ॥

పదము

యామ్। ఇన్ద్రేణ। సమ్ఽధామ్। సమ్ఽఅధత్థాః।
బ్రహ్మణా। చ। బృహస్పతే।
తయా। అహమ్। ఇన్ద్రఽసంధయా।
సర్వాన్। దేవాన్। ఇహ। హువే।
ఇతః। జయత। మా। అముతః ॥ 9 ॥

అనువాదం:

ఓ బృహస్పతీ ! ఇంద్రునితో, బ్రహ్మతో కలిసి
ప్రతిజ్ఞారూపమైన ఏ సంధానక్రియను చేసినావో,
ఓ ఇంద్రా ! ఆ ప్రతిజ్ఞారూపమైన
సంధానక్రియతో సర్వదేవతలను
ఈ సంగ్రామరంగంలోనికి ఆహ్వానిస్తున్నాను
ఓ ఆహూతులైన దేవతలారా !
ఈ మా సేనలకు జయాన్ని చేకూర్చండి
పరసేనలను గెలవనీయకండి ॥ 9 ॥

మంత్రము:

బృహస్పతి రాఙ్గిరస

ఋషయో బ్రహ్మసంశితాః ।

అసురక్షయణం వధం

త్రిషంధిం దివ్యాశ్రయన్ ॥ 10 ॥

పదము:

బృహస్పతిః । ఆఙ్గిరసః ।

ఋషయః । బ్రహ్మఽసంశితాః ।

అసురఽక్షయణమ్ । వధమ్ ।

త్రిఽసంధిమ్ । దివి । ఆ । అశ్రయన్ ॥ 10 ॥

అనువాదం

అంగిరసుని పుత్రుడైన బృహస్పతి,
మంత్రంతో తీక్ష్ణీకృతులైన ఇతర ఋషులు

అసురనాశకమైన వజ్రాయుధాన్ని
ద్యులోకంలో ఉన్న త్రిషంధిదేవుని సేవించినారు. ॥ 10 ॥

మంత్రము.

యేనాగ్ని గుప్త ఆదిత్య
ఉభా విన్ద్రశ్చ తిష్ఠతః ।
త్రిషంధిం దేవా అభజ-
న్తౌజసే చ బలాయ చ ॥ 11 ॥

పదము:

యేన । అగ్ని । గుప్తః । ఆదిత్యః ।
ఉభౌ । ఇన్ద్రః । చ । తిష్ఠతః ।
త్రిఽసంధిమ్ । దేవాః । అభజన్త ।
ఓజసే । చ । బలాయ । చ ॥ 11 ॥

అనువాదం.

ఎవరితో ఆకసంలో కనబడే ఆదిత్యులు రక్షితులౌతున్నారో,
ఆ ఆదిత్యుడు, ఇంద్రుడు - ఇరువురు
ఎవరి బలంతో స్వస్థానంలో ఉండగలుగుతున్నారో,
ఆ త్రిషంధిని ( ఆయుధభూతుడైన దేవుని )
సర్వదేవతలు ఓజస్సు కోసమై
బలం కోసమై సేవించినారు. ॥ 11 ॥

మంత్రము:

సర్వాం ల్లోకా త్సమజయన్

దేవా ఆహుత్యానయా ।

బృహస్పతి రాఙ్గిరసో

వజ్రం యమసిఞ్చతా

సురక్షయణం వధమ్ ॥ 12 ॥

పదము:

సర్వాన్ । లోకాన్ । సమ్ । అజయన్ ।

దేవాః । ఆఽహుత్యా । అనయా ।

బృహస్పతిః । ఆఙ్గిరసః ।

వజ్రమ్ । యమ్ । అసిఞ్చత ।

అసురఽక్షయణమ్ । వధమ్ ॥ 12 ॥

అనువాదం:

ఇంద్రాదులు ఈ ఆహుతితో
సర్వలోకములను జయించినారు
అంగిరఃపుత్రుడైన బృహస్పతి
అసురక్షయకరమైన
ఆయుధాన్ని ఆహుతితో
సేచనం చేసినాడు ॥ 12 ॥

మంత్రము :

బృహస్పతి రాఙ్గిరసో

వజ్రం యమసిఞ్చత

సురక్షయణం వధమ్ ।

తేనాహ మమూం సేనాం

ని లిమ్పామి బృహస్పతే

మిత్రాన్ హ న్మ్యోజసా ॥ 13 ॥

పదము:

బృహస్పతిః । ఆఙ్గిరసః ।

వజ్రమ్ । యమ్ । అసిఞ్చత ।

అసురఽక్షయణమ్ । వధమ్ ।

తేన । అహమ్ । అమూమ్ । సేనామ్ ।

ని । లిమ్పామి । బృహస్పతే ।

అమిత్రాన్ । హన్మి । ఓజసా ॥ 13 ॥

అనువాదం :

అంగిరఃపుత్రుడైన బృహస్పతి
అసురక్షయకరమైన ఆయుధాన్ని

అహుతితో సేచనం చేసినాడు
ఆ దేవుని ఆహ్వానిస్తున్నాము
ఓ బృహస్పతీ! నీవు నిర్మించిన ఆయుధంతో
నేను ఈ శత్రుసేనను విచ్ఛిన్నం చేస్తున్నాను
శత్రువులను ఆత్మీయబలంతో వధిస్తున్నాను ॥ 13 ॥

మంత్రము :

సర్వే దేవా అత్యాయన్తి

యే అశ్నన్తి వషట్ కృతమ్ ।

ఇమాం జుషధ్వ మాహుతి-

మితో జయత మాముతః ॥ 14 ॥

పదము

సర్వే । దేవాః । అతిఽఆయన్తి ।

యే । అశ్నన్తి । వషట్ఽకృతమ్ ।

ఇమామ్ । జుషధ్వమ్ । ఆఽహుతిమ్ ।

ఇతః । జయత । మా । అముతః ॥ 14 ॥

అనువాదం :

సర్వదేవతలు శత్రువులను దాటి
మాకు అభిముఖంగా వస్తున్నారు.
వషట్కారంతో ఇచ్చిన హవిస్సును, వారు భక్షిస్తున్నారు.
మీరంతా ఈ అహుతిని సేవించండి

మా సేనలను విజేతలను చేయండి.
పరకీయ సేనలను విజేతలను చేయకండి. ॥ 14 ॥

మంత్రము :

సర్వే దేవా అత్యాయన్తు
త్రిషన్ధే రాహుతిః ప్రియా ।
సంధాం మహతీం రక్షత
యయాగ్రే అసురా జితాః ॥ 15 ॥

పదము :

సర్వే । దేవాః । అతిఽఆయన్తు ।
త్రిఽసంధేః । ఆఽహుతిః । ప్రియా ।
సమ్ఽధామ్ । మహతీమ్ । రక్షత ।
యయా । అగ్రే । అసురాః । జితాః ॥ 15 ॥

అనువాదం :

శత్రువులను దాటి మాకు అభిముఖంగా
దేవతలు వత్తురు గాక!
త్రిషంధి అను పేరుగల సేనామోహకుడైన
దేవునకు మా ఆహుతి ప్రియమగు గాక!
ఓ దేవతలారా! జయవిషయమైన
మహాప్రతిజ్ఞను కాపాడండి.
దానితో పూర్వం అసురులు పరాజితులైనారు. ॥ 15 ॥

మంత్రము

వాయు రమిత్రాణా మిష్వగ్రా ణ్యాఞ్చతు
ఇన్ద్ర ఏషాం బాహూన్ ప్రతి భనక్తు
మా శకన్ ప్రతిధా మిషుమ్ ।
ఆదిత్య ఏషా మస్త్రం వి నాశయతు
చన్ద్రమా యుతా మగతస్య పన్థామ్ ॥ 16 ॥

పదము

వాయుః । అమిత్రాణామ్ । ఇషుఽఅగ్రాణి । ఆ । అఞ్చతు ।
ఇన్ద్రః । ఏషామ్ । బాహూన్ । ప్రతి । భనక్తు ।
మా । శకన్ । ప్రతిఽధామ్ । ఇషుమ్ ।
ఆదిత్యః । ఏషామ్ । అస్త్రమ్ । వి । నాశయతు ।
చన్ద్రమాః । యుతామ్ । అగతస్య । పన్థామ్ ॥ 16 ॥

అనువాదం

వాయుదేవుడు శత్రువుల బాణాగ్రములకు ఎదురువెళ్ళుగాక!
ఇంద్రుడు ఈ శత్రువుల బాహువులను భగ్నంచేయుగాక!
తమ బాణాన్ని తిరిగి
అనుసంధించుటకు అశక్తులగుదురుగాక!
ఈ ఆయుధజాతాన్ని సూర్యుడు వినష్టం చేయుగాక!
చంద్రుడు శత్రుమార్గాన్ని వేరుపరచు గాక! ॥ 16 ॥

మంత్రము :

యది ప్రేయు ర్దేవపురా

బ్రహ్మ వర్మాణి చక్రిరే ।

తనూపానం పరిపాణం కృణ్వానా య

దుపోచిరే సర్వం త దరసం కృధి ॥ 17 ॥

పదము :

యది । ప్రఽఈయుః । దేవఽపురాః ।

బ్రహ్మ । వర్మాణి । చక్రిరే ।

తనూఽపానమ్ । పరిఽపానమ్ । కృణ్వానాః । యత్ ।

ఉపఽఊచిరే । సర్వమ్ । తత్ । అరసమ్ । కృధి ॥ 17 ॥

అనువాదం :

శత్రుసేనలు దేవతల నగరాలపై దాడివెడలితే,
జ్ఞానులను కవచాలుగా చేసుకుంటే,
శరీర రక్షక సాధనాలను తయారుచేసుకుంటే
వాటి నన్నిటిని నీరసంగా చెయ్యి. ॥ 17 ॥

మంత్రము :

క్రవ్యాదానువర్తయన్

మృత్యునా చ పురోహితమ్ ।

త్రిషన్ధే ప్రేహి సేనయా
జయామిత్రాన్ ప్ర పద్యస్వ ॥ 18 ॥

పదము,

త్రవ్యఽఅదా । అనుఽప్రవర్తయన్ ।
మృత్యునా । చ । పురఃఽహితమ్ ।
త్రిఽసంధే । ప్ర । ఇహి । సేనయా ।
జయ । అమిత్రాన్ । ప్ర । పద్యస్వ ॥ 18 ॥

అనువాదం

ఓ త్రిషంధీ! నీ ముందున్న శత్రువును
మాంసాశితో అనువర్తింపజెయ్యి
మృత్యువును అనుగమించునట్లు చెయ్యి
ఆత్మీయసేనతో వెళ్ళు శత్రువులను జయించు
శత్రుమధ్యంలోనికి ప్రవేశించు. ॥ 18 ॥

మంత్రము ।

త్రిషన్ధే తమసా త్వ-
మమిత్రాన్ పరి వారయ ।
పృషదాజ్యప్రణుత్తానాం
మామీషాం మోచి కశ్చన ॥ 19 ॥

పదము :

త్రి౽సంధే । తమసా । త్వమ్ ।

అమిత్రాన్ । పరి । వారయ ।

పృషదాజ్య౽ప్రనుత్తానామ్ ।

మా । అమీషామ్ । మోచి । కః । చన ॥ 19 ॥

అనువాదం :

ఓ త్రిషంధీ! నీవు మాయామయమైన
అంధకారంతో శత్రువులను చుట్టుముట్టు.
పృషదాజ్య (దధిమిశ్రమైన ఆజ్యము) హోమంతో
ప్రక్షిప్తులైన ఈ శత్రువుల మధ్యలో
ఒక్కడు కూడా బయటపడకుండు గాక! ॥ 19 ॥

మంత్రము :

శితిపదీ సం పత

త్వమిత్రాణా మమూః సిచః ।

ముహ్య న్త్వ ద్యామూః సేనా

అమిత్రాణాం న్యర్బుదే ॥ 20 ॥

పదము :

శితి౽పదీ । సమ్ । పతతు ।

అమిత్రాణామ్ । అమూః । సిచః ।

ముహ్యన్తు । అద్య । అమూః । సేనాః ।

అమిత్రాణామ్ । నిఽఅర్బుదే ॥ 20 ॥

అనువాదం :

శితిపది అయిన గోవు పరసేనా మధ్యంలో విడువబడి,
దుఃఖితులైన శత్రువులపై పడుగాక !
ఓ న్యర్బుదమా ! ఆ దూరంగా కన్పించే శత్రుసేనలను
ఇప్పుడు మోహింప జెయ్యి ॥ 20 ॥

మంత్రము :

మూఢా అమిత్రా న్యర్బుదే

జహ్యేఽషాం వరంవరమ్ ।

అనయా జహి సేనయా ॥ 21 ॥

పదము :

మూఢాః । అమిత్రాః । నిఽఅర్బుదే ।

జహి । ఏషామ్ । వరమ్ఽవరమ్ ।

అనయా । జహి । సేనయా ॥ 21 ॥

అనువాదం :

ఓ న్యర్బుదా ! అమిత్రులను నీ మాయతో
సమ్మోహితులనుగా చెయ్యి
ఈ శత్రువులలో ఉన్నతోన్నతులైన వారిని
వరుసబెట్టి సంహరించు

మా సేన నీ అనుగ్రహం వల్ల
శత్రుసేనను జయించు గాక! ॥ 21 ॥

మంత్రము।

యశ్చ కవచీ యశ్చాకవచో-

ఽమిత్రో యశ్చాజ్మని ।

జ్యాపాశైః కవచపాశై-

రజ్మనాభిహతః శయామ్ ॥ 22 ॥

పదము

యః । చ । కవచీ । యః । చ । అకవచః ।

అమిత్రః । యః । చ । అజ్మని ।

జ్యాఽపాశైః । కవచఽపాశైః ।

అజ్మనా । అభిఽహతః । శయామ్ ॥ 22 ॥

అనువాదం.

కవచధారుడైన శత్రువు,
కవచరహితుడైన శత్రువు,
రథాన్ని అధిరోహించిన శత్రువు,
వీరందరూ తమతమ మౌర్వీపాశముల చేత,
కవచపాశముల చేత, రథాదులచేత
బద్ధులై నేలపై పడును గాక! ॥ 22 ॥

మంత్రము :

యే వర్మిణో యేఽవర్మాణో

అమిత్రా యే చ వర్మిణః ।

సర్వాం స్తాం అర్బుదే హతాం-

శ్వానోఽదన్తు భూమ్యామ్ ॥ 23 ॥

పదము

యే । వర్మిణః । యే । అవర్మాణః ।

అమిత్రాః । యే । చ । వర్మిణః ।

సర్వాన్ । తాన్ । అర్బుదే । హతాన్ ।

శ్వానః । అదన్తు । భూమ్యామ్ ॥ 23 ॥

అనువాదం,

ఏ శత్రువులు కవచధారులై ఉన్నారో,
ఎవరు కవచరహితులై ఉన్నారో,
ఎవరు కవచవ్యతిరిక్తమైన ఇతరములతో
ఆచ్ఛాదితులై ఉన్నారో,
వారందరినీ ఓ అర్బుదా! నీవు
హతం చేయగా, భూమిపై పడిఉన్నవారిని
కుక్కలు, నక్కలు మొదలైనవి తిను గాక! ॥ 23 ॥

మంత్రము :

యే రథినో యే అరథా

అసాదా యే చ సాదినః ।

సర్వా నదన్తు తాన్ హతాన్
గృధ్రాః శ్యేనాః పతత్రిణః ॥ 24 ॥

పదము

యే । రథినః । యే । అరథాః ।
అసాదాః । యే । చ । సాదినః ।
సర్వాన్ । అదన్తు । తాన్ । హతాన్ ।
గృధ్రాః । శ్యేనాః । పతత్రిణః ॥ 24 ॥

అనువాదం.

రథారూఢులైన వారిని, రథరహితులను
అశ్వాది వాహనరహితులను,
అశ్వికులైన వారిని, ఓ అర్బుదా!
నీ అనుగ్రహంతో మేము వధింతుముగాక!
అలా వధితులైన శత్రువులందరిని
గ్రద్దలు, డేగలు మొదలైన పక్షులు
తమ గోళ్ళతో చీల్చి తిను గాక! ॥ 24 ॥

మంత్రము.

సహస్రకుణపా శేతా-
మమిత్రీ సేనా
సమరే వధానామ్ ।
వివిద్ధా కకజాకృతా ॥ 25 ॥

పదము :

సహస్ర౽కుణపా । శేతామ్ ।

అమిత్రీ । సేనా ।

సమ్౽అరే । వధానామ్ ।

వి౽వీద్ధా । కకజా౽కృతా ॥ 25 ॥

అనువాదం :

శత్రుసైనికులు మా సేనపైపడి యుద్ధంలో
వివిధ శస్త్రపాతములతో హతులగుదురు గాక!
అలాంటి వేలాది శవములతో కూడిన వారు
కుత్సితజన్ములగుదురు గాక! ॥ 25 ॥

మంత్రము :

మర్మావిధం రోరువతం సుపర్ణై
రదన్తు దుశ్చితం మృదితం శయానమ్ ।
య ఇమాం ప్రతీచీ మాహుతి-
మమిత్రో నో యుయుత్సతి ॥ 26 ॥

పదము :

మర్మావిధమ్ । రోరువతమ్ । సు౽పర్ణైః ।

అదన్తు । దుః౽చితమ్ । మృదితమ్ । శయానమ్ ।

యః । ఇమామ్ । ప్రతీచీమ్ । ఆఽహుతిమ్ ।

అమిత్రః । నః । యుయుత్సతి ॥ 26 ॥

అనువాదం :

వేగంగా ఎగురుతూపోయే శరములతో
ఆయువుపట్టులలో దెబ్బతిని
గొంతెత్తి ఆక్రోశిస్తున్న, దుఃఖపూరితము-
చూర్ణీకృతము అయి నేలపై పడిన
శత్రుసమూహాన్ని కుక్కలు, నక్కలు తినివేయు గాక !
మేమిస్తున్న ఆహుతిని త్రిప్పికొట్టడానికి
యుద్ధం చేయగోరే ఆ శత్రువులను కూడా
అలాగే అవి భక్షించు గాక ! ॥ 26 ॥

మంత్రము

యాం దివా అనుతిష్ఠన్తి

యస్యా నాస్తి విరాధనమ్ ।

తయేన్ద్రో హన్తు వృత్రహా

వజ్రేణ త్రిషంధినా ॥ 27 ॥

పదము :

యామ్ । దేవాః । అనుఽతిష్ఠన్తి ।

యస్యాః । న । అస్తి । విఽరాధనమ్ ।

తయా । ఇన్ద్రః । హన్తు । వృత్రఽహా ।

వజ్రేణ । త్రిఽసంధినా ॥ 27 ॥

అనువాదం :

పృషదాజ్యాహుతిని వజ్రోత్పాదనమునకై
దేవతలు సమర్పిస్తారు
ఆ ఆహుతికి ఎదురు లేదు
ఆ ఆహుతితో ఉత్పన్నమైన త్రిసంధి వజ్రంతో
వృత్రాసురుని ఇంద్రుడు సంహరించినాడు.
ఆయన మా శత్రువులను కూడా సంహరించు గాక ! ॥ 27 ॥

ఇది పదవ సూక్తం

ఇది ఐదవ అనువాకం

ఇది పదకొండవ కాండ

# అనువాకం : 1

## సూక్తం _1

ఋషి. అథర్వుడు॥ దేవత: భూమి॥ ఛందస్సు: 1,3,17,29,31,55,60 త్రిష్టుప్, 2 భురిక్ త్రిష్టుప్, 4-6,10,38 షట్పదా జగతీ, 7 ప్రస్తార పంక్తి, 8,11 షట్పదా విరాడష్టిః, 9 పరానుష్టుప్ త్రిష్టుప్, 12,13,15, 37 పఞ్చపదా శక్వరీ, 14 మహాబృహతీ, 16, 21 సామ్నీ త్రిష్టుప్, 18 షట్పదా త్రిష్టుబనుష్టుబ్గర్భాతి శక్వరీ, 19 ఉరోబృహతీ, 20 విరాడురో బృహతీ, 22 షట్పదా విరాడతిజగతీ, 23 పఞ్చపదా విరాడతిజగతీ, 24 పఞ్చపదానుష్టుబ్గర్భా జగతీ, 25 సప్తపదోష్ణిగనుష్టుబ్గర్భా శక్వరీ, 26-28,33,35,39,40,50,54,56,59,63 అనుష్టుప్, 53 పురోబార్హతానుష్టుప్, 30 (త్రిపదా) విరాడ్ గాయత్రీ, 32 పురస్తాజ్జ్యోతిస్త్రిష్టుప్, 34 షట్పదా త్రిష్టుబ్బృహతీగర్భాతిజగతీ, 36 విపరీతపాదలక్ష్మ్యా పంక్తి। 41 షట్పదా కకుమ్మతీ శక్వరీ, 42 స్వరాడనుష్టుప్, 43 విరాడాస్తారపంక్తి, 44,45,49 జగతీ, 46 షట్పదాऽనుష్టుబ్గర్భా పరాశక్వరీ, 47 షట్పదోష్ణిగనుష్టుబ్గర్భా పరాతిశక్వరీ, 48 పురోऽనుష్టుప్ త్రిష్టుప్, 51 షట్పదాऽనుష్టుబ్గర్భా కకుమ్మతీ శక్వరీ; 52 పఞ్చపదాऽనుష్టుబ్గర్భా పరాతిజగతీ, 57 పురాతిజాగతా జగతీ, 58 పురస్తాద్ బృహతీ, 61 పురోబార్హతా త్రిష్టుప్, 62 పరా విరాట్ (?, నిచృత్) త్రిష్టుప్॥ మంత్రములు: ॥ 63 ॥

వినియోగం:- ఇది పృథివీ సూక్తము. పృథివి యొక్క ప్రభూతమైన సహజ వర్ణనము ఇందులో ఉన్నది. కొన్ని పౌరాణిక కథలను దృష్టిలో పెట్టుకొని చేసిన వర్ణనములున్నవి. పలుమారులు ఈ మంత్ర ద్రష్ట అయిన ఋషి భూదేవిని వరములను కోరుతున్నాడు.

సంప్రదాయానుసారంగా ఈ సూక్తం బహువిధములుగా వినియుక్తమౌతుంది. ఈ అనువాకం వాస్తోష్పత్యగణంలోనిది దీని వినియోగం 3వ కాండ 12వ సూక్తంలో చూడవలెను.

అలాగే ఆగ్రహాయణీ కర్మలో రాత్రిపూట ఆఖ్యానాంతం చేసి మూడు చరువులను వదలాలి.

తరువాత ఈ అనువాకంతో అగ్ని వెనుకనున్న గుంటలో దర్భలను పరచి ఒకచరువును ఒక మారు సర్వహుతం చెయ్యాలి ఎనిమిది ఋక్కులతు అవృత్తితో హోమత్రయాన్ని సంపాదింప వలెనని అర్థం

అగ్నికి వెనుక దర్భాది తృణములయందు వాటితోనే అల్లిన ఒక ప్రస్తరణాన్ని పరదాలి విమృగ్వరీమ్ అనే ఋక్కును పఠిస్తూ దానిపై కూర్చొన వలెను

సత్యం బృహత్ ' అనే తొమ్మిది మంత్రాలను ' శన్తివా ' అనే ఋక్కును 'ఉదాయుషా ' అనే రెండు ఋక్కులను పఠిస్తూ ఉదయం లేవాలి

' ఉద్వయం ' అనే మంత్రంతో వెళ్ళిపోవాలి ఉదీరాణాః ' అనే ఋక్కుతో తూర్పునకో, ఉత్తరానికో బయటికి వెళ్ళిపోవాలి ' యావత్ తే ' అనే మంత్రంతో భూమిని వీక్షించాలి ఇదీ ' ఆగ్ర హాయణి ' కర్మ

అలాగే పుష్టికాముడు ఎత్తైన స్థలంపైనికి ఎక్కి ' యావత్ తే ' అనే మంత్రంతో పార జూడాలి

అలాగే ఈ అనువాకంతో జలపాత్రను సంపాదించి అగ్నికి ముందు సీరయుక్తంగా సంప్రోక్షించాలి

అలాగే ఈ అనువాక పఠనంతో కృషికర్మ అవుతుంది దీనిని ' సీరా యుఞ్జన్తి ' ( 8వ కాండ, 17వ సూక్తం ) అనే సూక్తంలో విస్తరించి చెప్పడం జరిగింది

అలాగే పుత్ర ధనాది సర్వఫలప్రాప్త్యర్థం ' యస్యాం సదోహవిర్ధానే ' అనే మూడుమంత్రాలతో ( 38,39,40 ) అజ్యాన్ని హోమం చేయాలి

అలాగే వ్రీహియవాద్యన్నకాముడు ' యస్యామన్నం అనే ఋక్కుతో పృథివిని ఉపస్థానం చెయ్యాలి

అలాగే మణిహిరణ్యాదికాముడు ' నిధిం బిభ్రతీ ' అనే రెండు మంత్రాలతో పృథివిని ఉపస్థానం చెయ్యాలి.

అలాగే మణిహిరణ్యాదులు ప్రాప్తించిన తర్వాత కూడా ఈ మంత్రాలతోనే ఉపస్థానం చెయ్యాలి.

అలాగే పుష్టికాముడు వృష్టికాలంలో ' యస్యాం కృష్ణమ్ ' అనే ( 52 ) ఋక్కుతో నవోదకాన్ని అభిమంత్రించి ఆచమనాన్ని స్నానాన్ని నిర్వర్తించాలి.

అలాగే గ్రామపత్తనాదిరక్షార్థం ఈ అనువాకంతో నాలుగు పురోడాశములపై రాళ్ళనుంచి గ్రామాదికోణములలో పాతి పెట్టాలి.

అలాగే గ్రామపత్తనాదిరక్షార్థం ఈ అనువాకంతో ఒకొక్క పురోడాశం పైన శిలనుంచి రెండింటిని కలిపి గ్రామాదికోణము లలో పాతిపెట్టాలి

అలాగే అగ్నిగృహం వద్ద ఆ వేడి తగులని చోట పడుకుని ఈ సూక్తాన్ని జపించాలి ఈ కర్మలన్నీ వైకల్పికాలు.

అలాగే భూమి కంపించినపుడు చేసే హోమంలో ఈ అను వాకానికి వినియోగం.

అలాగే సోమయజ్ఞంలో దీక్షితనియమంలో మూత్ర, పురీష పరిశుద్ధ్యర్థం ఉపయోగించే మట్టిగడ్డలను తీసుకునేటప్పుడు దీనికి వినియోగం.

అలాగే పార్థివ మహాశాంతిలో ఈ అనువాకానికి వినయోగం.

మంత్రము ।

సత్యం బృహ దృత ముగ్రం దీక్షా తపో

బ్రహ్మ యజ్ఞః పృథివీం ధారయన్తి ।

సా నో భూతస్య భవ్యస్య ప
త్న్యురుం లోకం పృథివీ నః కృణోతు ॥ 1 ॥

పదము :

సత్యమ్ । బృహత్ । ఋతమ్ । ఉగ్రమ్ । దీక్షా । తపః ।
బ్రహ్మ । యజ్ఞః । పృథివీమ్ । ధారయన్తి ।
సా । నః । భూతస్య । భవ్యస్య । పత్నీ ।
ఉరుమ్ । లోకమ్ । పృథివీ । నః । కృణోతు ॥ 1 ॥

అనువాదం

సత్యము, బృహత్తు, ఋతము, ఉగ్రము,
తపస్సు, దీక్ష, బ్రహ్మ, యజ్ఞము—
ఇవన్నీ పృథివిని భరిస్తున్నవి
ఆ పృథివి మా భూతభవిష్యద్వర్తమానాలకు
చెందిన అన్నిటినీ పాలించునదై
మాకు ఉత్తమలోకాన్ని ప్రసాదించు గాక! ॥ 1 ॥

మంత్రము

అసంబాధం మధ్యతో మానవానాం
యస్యా ఉద్వతః ప్రవతః సమం బహు ।
నానావీర్యా ఓషధీ ర్యా బిభర్తి
పృథివీ నః ప్రథతాం రాధ్యతాం నః ॥ 2 ॥

పదము :

అసమ్ఽబాధమ్ । మధ్యతః । మానవానామ్ ।

యస్యాః । ఉత్ఽవతః । ప్రఽవతః । సమమ్ । బహు ।

నానాఽవీర్యాః । ఓషధీః । యా । బిభర్తి ।

పృథివీ । నః । ప్రథతామ్ । రాధ్యతామ్ । నః ॥ 2 ॥

అనువాదం :

ఈ పృథివిపై నున్న మానవుల మధ్యంలో
నీచోచ్చ భేదాలున్నా,
అధికారికంగా సమత్వం, ఐకమత్యం ఉన్నది.
మా ఈ పృథివి రోగాలను దూరం చేసే
అనేక గుణసంపన్నాలైన ఓషధులను భరిస్తున్నది.
మా యశోవృద్ధికి ఇది సాధనభూతంగా ఉన్నది. ॥ 2 ॥

మంత్రము :

యస్యాం సముద్ర ఉత సిన్ధు రాపో

యస్యా మన్నం కృష్టయః సంబభూవుః ।

యస్యా మిదం జిన్వతి ప్రాణ దేజత్

సా నో భూమిః పూర్వపేయే దధాతు ॥ 3 ॥

పదము :

యస్యామ్ । సముద్రః । ఉత । సిన్ధుః । ఆపః ।

యస్యామ్ । అన్నమ్ । కృష్టయః । సమ్ఽబభూవుః ।

యస్యామ్ । ఇదమ్ । జిన్వతి । ప్రాణత్ । ఏజత్ ।
సా । నః । భూమిః । పూర్వ౽పేయే । దధాతు ॥ 3 ॥

అనువాదం

ఇందులో మహాసముద్రములు
నదీనదాలు, జలపూరములు ఉన్నవి
దీనిలోనే అహోరాదులుగా పనికివచ్చే
ధాన్య శాకపాకాదులు ఉన్నవి
అవి ఇందరి ప్రాణులకు ప్రాణం పోస్తున్నవి
కృషీవలులు, శిల్పకర్మవిశారదులు జన్మించినారు
ఈ భూమి సమస్త భోగములను, ఐశ్వర్యమును
మాకు ప్రసాదించు గాక! ॥ 3 ॥

మంత్రము :

యస్యా శ్చతస్రః ప్రదిశః పృథివ్యా
యస్యా మన్నం కృష్టయః సంబభూవుః ।
యా బిభర్తి బహుధా ప్రాణ దేజత్
సా నో భూమి ర్గోష్వ ప్యన్నే దధాతు ॥ 4 ॥

పదము :

యస్యాః । చతస్రః । ప్ర౽దిశః । పృథివ్యాః ।
యస్యామ్ । అన్నమ్ । కృష్టయః । సమ్౽బభూవుః ।

యా । బిభ_ర్తి । బహుఽధా । ప్రాణత్ । ఏజత్ ।

సా । నః । భూమిః । గోషు । అపి । అన్నే । దధాతు । ॥ 4 ॥

అనువాదం.

ఈ భూమిపై అనేక కర్మచాతురీసమేతులు జన్మించినారు.
దీని నలుదిశలు అన్నాన్ని అనేక ప్రకారాలుగా
ప్రాణులకై భరిస్తున్నవి.
బహువిధాలుగా ప్రాణధారులు, కర్మకరులు
అయిన వారి ధారణపోషణాదులను
ఈ భూమి కల్పిస్తున్నది.
గోవులు, మేకలు మొదలగువాని ధారణ పోషణములను
కూడా ఇదే చేస్తున్నది. ॥ 4 ॥

మంత్రము.

యస్యాం పూర్వే పూర్వజనా విచక్రిరే
యస్యాం దేవా అసురా నభ్యవ_ర్తయన్ ।
గవా మశ్వానాం వయసశ్చ విష్ఠా
భగం వర్చః పృథివీ నో దధాతు ॥ 5 ॥

పదము:

యస్యామ్ । పూర్వే । పూర్వఽజనాః । విఽచక్రిరే ।

యస్యామ్ । దేవాః । అసురాన్ । అభిఽఅవ_ర్తయన్ ।

గవామ్ । అశ్వానామ్ । వయసః । చ । విఽస్థా ।
భగమ్ । వర్చః । పృథివీ । నః । దధాతు ॥ 5 ॥

అనువాదం :

ఈ భూమిపై పూర్వజనులు విక్రమించినారు
ఇక్కడే దేవతలు అసురులను తరిమికొట్టినారు
గోవులు, అశ్వములు, పక్షులు అశేషసుఖాన్నిచ్చే చోటిది.
ఈ పృథివి ఐశ్వర్యాన్ని, బలపరాక్రమాదులను
మాకు ప్రసాదించు గాక! ॥ 5 ॥

మంత్రము :

విశ్వంభరా వసుధానీ ప్రతిష్ఠా
హిరణ్యవక్షా జగతో నివేశనీ ।
వైశ్వానరం బిభ్రతీ భూమి రగ్ని-
మిన్ద్రఋషభా ద్రవిణే నో దధాతు ॥ 6 ॥

పదము :

విశ్వమ్ఽభరా । వసుఽధానీ । ప్రతిఽస్థా ।
హిరణ్యఽవక్షాః । జగతః । నిఽవేశనీ ।
వైశ్వానరమ్ । బిభ్రతీ । భూమిః । అగ్నిమ్ ।
ఇన్ద్రఋఽఋషభా । ద్రవిణే । నః । దధాతు ॥ 6 ॥

**అనువాదం:**

ఈ పృథివి విశ్వంభర, వసుంధర,
వస్తువులకు ఆధారస్థానం.
హిరణ్యగర్భ అయినది.
జగత్తునకు నివేశనం కల్పిస్తుంది.
వైశ్వానరాగ్ని దీనిపైనే ఉన్నది.
ఇక్కడ అగ్రగామి అయిన అగ్ని
వృషభసదృశుడు ఇంద్రుడు
మాకు ధనధారులుగా ఉన్నారు. ॥ 6 ॥

మంత్రము:

యాం రక్ష న్త్యస్వప్నా విశ్వదానీం
దేవా భూమిం పృథివీ మప్రమాదమ్ ।
సా నో మధు ప్రియం దుహా-
మథో ఉక్షతు వర్చసా ॥ 7 ॥

పదము:

యామ్ । రక్షన్తి । అస్వప్నాః । విశ్వఽదానీమ్ ।
దేవాః । భూమిమ్ । పృథివీమ్ । అప్రఽమాదమ్ ।
సా । నః । మధు । ప్రియమ్ । దుహామ్ ।
అథో ఇతి । ఉక్షతు । వర్చసా ॥ 7 ॥

అనువాదం :

నిద్రారహితులైన దేవతలు ఈ విశ్వధాత్రిని
మాతై మధుదోహనం చేస్తున్నారు
ఈ విశాలభూమి ప్రమాదరహితమగు గాక !
మమ్ము వర్చస్సుతో, జ్ఞానైశ్వర్యాదులతో
పరిపూర్ణులను చేయు గాక ! ॥ 7 ॥

మంత్రము :

యార్ణవేధి సలిల మగ్ర ఆసీత్
యాం మాయాభి రన్వచరన్ మనీషిణః ।
యస్యా హృదయం పరమే వ్యోమ-
న్సత్యేనావృత మమృతం పృథివ్యాః ।
సా నో భూమి స్త్విషిం బలం
రాష్ట్రే దధాతూత్తమే ॥ 8 ॥

పదము :

యా । అర్ణవే । అధి । సలిలమ్ । అగ్రే । ఆసీత్ ।
యామ్ । మాయాభిః । అను౽అచరన్ । మనీషిణః ।
యస్యాః । హృదయమ్ । పరమే । వి౽ఓమన్ ।
సత్యేన । ఆ౽వృతమ్ । అమృతమ్ । పృథివ్యాః ।

సా । నః । భూమిః । త్విషిమ్ । బలమ్ ।

రాష్ట్రే । దధాతు । ఉత్ఽతమే ॥ 8 ॥

అనువాదం.

ఈ భూమి తొలుత జలంపై, సముద్రంపై ఉండినది.
ఈ పృథివీహృదయం అమృతం వలె
సత్యసంకల్పమైన బలంతో వ్యాప్తమై ఉన్నది.
మహాకాశంలో దీనిని మాపాదులతో
మనీషులు సేవిస్తున్నారు.
ఈ మా భూమి ఉత్కృష్ట రాజ్యంలో
తేజస్సును, బలాన్ని ధరించు గాక! ॥ 8 ॥

మంత్రము :

యస్యా మాపః పరిచరాః సమానీ-
రహోరాత్రే అప్రమాదం క్షరన్తి ।
సా నో భూమి ర్భూరిధారా పయో
దుహా మథో ఉక్షతు వర్చసా ॥ 9 ॥

పదము ।

యస్యామ్ । ఆపః । పరిఽచరాః । సమానీః ।
అహోరాత్రే ఇతి । అప్రఽమాదమ్ । క్షరన్తి ।
సా । నః । భూమిః । భూరిఽధారా । పయః ।
దుహామ్ । అథో ఇతి । ఉక్షతు । వర్చసా ॥ 9 ॥

**అనువాదం :**

ఈ భూమిపై తిరిగే పరివ్రాజకులు,
జలప్రవాహాలు, సమదృష్టికలవైన అహోరాత్రములు
సావధానములై పరిభ్రమిస్తున్నవి,
ఇందలి రకరకాల భూరిధారలు
క్షీరధారలను మాకు ప్రసాదిస్తున్నవి
ఈ భూమి వర్చఃప్రతాపాదులతో విలసిల్లు గాక! ॥ 9 ॥

**మంత్రము :**

యా మశ్వినా వమిమాతాం
విష్ణు ర్యస్యాం విచక్రమే ।
ఇన్ద్రో యాం చక్ర ఆత్మనే-
నమిత్రాం శచీపతిః ।
సా నో భూమి ర్వి సృజతాం
పయః ॥ 10 ॥

యామ్ । అశ్వినా । అమిమాతామ్ ।
విష్ణుః । యస్యామ్ । విఽచక్రమే ।
ఇన్ద్రః । యామ్ । చక్రే । ఆత్మనే ।
అనమిత్రామ్ । శచీఽపతిః ।

సా । నః । భూమిః । వి । సృజతామ్ ।

మాతా । పుత్రాయ । మే । పయః ॥ 10 ॥

అనువాదం :

ఈ భూమికి అశ్వినీ దేవతలు
మాపనక్రియను చేస్తున్నారు.
ఇందలి పాలకులు ఇక్కడ పరాక్రమిస్తున్నారు.
ఇంద్రుడు శచీపతి తన శత్రునిర్మూలన క్రియల చేతను,
మాకు తల్లి అయిన భూమి తన పుత్రులకై
పాలనివ్వడంతోను పాలిస్తున్నారు.
తన పుత్రులందరకూ పృథివి
అన్నపానాదులు కల్పించు గాక ! ॥ 10 ॥

మంత్రము :

గిరయస్తే పర్వతా హిమవన్తోఽ-

రణ్యం తే పృథివి స్యోనమస్తు ।

బభ్రుం కృష్ణాం రోహిణీం విశ్వరూపాం

ధ్రువాం భూమిం పృథివీ మిన్ద్రగుప్తామ్ ।

అజీతో హతో అక్షతో

ధ్యష్ఠాం పృథివీ మహమ్ ॥ 11 ॥

పదము :

గిరయః । తే । పర్వతాః । హిమఽవన్తః ।

అరణ్యమ్ । తే । పృథివి । స్యోనమ్ । అస్తు ।

బభ్రుమ్ । కృష్ణామ్ । రోహిణీమ్ । విశ్వ౽రూపామ్ ।

ధ్రువామ్ । భూమిమ్ । పృథివీమ్ । ఇన్ద్ర౽గుప్తామ్ ।

అజీతః । అహతః । అక్షతః ।

అధి । అస్థామ్ । పృథివీమ్ । అహమ్ ॥ 11 ॥

అనువాదం

ఓ పృథివీ! గిరులు, పర్వతాలు,
అరణ్యాలు నీకు సుఖమునిచ్చు గాక!
వాటి భరణపోషణాదులను నిర్వర్తిస్తున్నదానవు నీవు
వృక్షాదికములు అంకురించడానికి కృషి కారణమౌతున్నది
విశ్వరూపిణివి స్థిరమైన దానవు ఇంద్రరక్షితమైన దానవు.
అజీతవు. అక్షతవు
నేను ఇలాంటి భూమిని అధిష్ఠించి ఉన్నాను ॥ 11 ॥

మంత్రము:

యత్ తే మధ్యం పృథివి యచ్చ నభ్యం

యాస్త ఊర్జస్తన్వ౽ః సంబభూవుః ।

తాసు నో ధే హ్యభి నః పవస్వ

మాతా భూమిః పుత్రో అహం పృథివ్యాః ।

పర్జన్యః పితా స ఉ నః పిపర్తు ॥ 12 ॥

పదము .

యత్ । తే । మధ్యమ్ । పృథివి । యత్ । చ । నభ్యమ్ ।

యాః । తే । ఊర్జః । తన్వః । సమ్ఽబభూవుః ।

తాసు । నః । ధేహి । అభి । నః । పవస్వ ।

మాతా । భూమిః । పుత్రః । అహమ్ । పృథివ్యాః ।

పర్జన్యః । పితా । సః । ఓం ఇతి । నః । పిపర్తు ॥ 12 ॥

అనువాదం .

ఓ పృథ్వీ! నీ మధ్యభాగమేది? నీ నాభిస్థానమేది?
నీతో ఊర్జస్స్వంతమైన శరీరధారులు
స్వయంభువులై ఉన్నారు.
వారిలో మాకు స్థానమివ్వు
మాకు రక్షనివ్వు.
ఓ భూమీ! నీవు మాతవు.
నేను పుత్రుడను. పర్జన్యుడు మా తండ్రి.
ఆయన మమ్ము పాలించు గాక! ॥ 12 ॥

మంత్రము :

యస్యాం వేదిం పరిగృహ్ణన్తి భూమ్యాం

యస్యాం యజ్ఞం తన్వతే విశ్వకర్మాణః ।

యస్యాం మీయన్తే స్వరవః పృథివ్యా-

ఊర్ధ్వాః శుక్రా ఆహుత్యాః పురస్తాత్ ।
సా నో భూమి ర్వర్ధయద్ వర్ధమానా ॥ 13 ॥

పదము :

యస్యామ్ । వేదిమ్ । పరిఽగృహ్ణన్తి । భూమ్యామ్ ।
యస్యామ్ । యజ్ఞమ్ । తన్వతే । విశ్వఽకర్మాణః ।
యస్యామ్ । మీయన్తే । స్వరవః । పృథివ్యామ్ ।
ఊర్ధ్వాః । శుక్రాః । ఆఽహుత్యాః । పురస్తాత్ ।
సా । నః । భూమిః । వర్ధయత్ । వర్ధమానా ॥ 13 ॥

అనువాదం :

ఈ భూమిపైనే యజ్ఞవేదిని నిర్మిస్తున్నారు
విశ్వకర్మలందరూ ఇక్కడే యజ్ఞములు చేస్తున్నారు
ఈ భూమికి ముందు ఉన్నతిని కల్పిస్తూ
వీర్యోపేతములైన ఆహుతులతో పాటు
యూపస్తంభములూ ఉన్నవి
ఇవన్నీ ఉపదేశం చేస్తున్నవి
ఈ భూమి మమ్ములను వర్ధిల్లజేయు గాక ! ॥ 13 ॥

మంత్రము :

యో నో ద్వేషత్ పృథివి యః పృతన్యాద్
యోఽభిదాసా న్మనసా యో వధేన ।
శం నో భూమే రన్ధయ పూర్వకృత్వరి ॥ 14 ॥

పదము।

యః । నః । ద్వేషత్ । పృథివి । యః । పృతన్యాత్ ।

యః । అభిఽదాసాత్ । మనసా । యః । వధేన ।

తమ్ । నః । భూమే । రన్ధయ । పూర్వఽకృత్వరి ॥ 14 ॥

అనువాదం

ఎవరు మమ్ము ద్వేషిస్తున్నారో,
ఎవరైతే తమసేనలతో మమ్ము
పరాభవింపవలెనని చూస్తున్నారో,
ఎవడు మాకు అనిష్టం చేయవలెనని సంకల్పిస్తున్నాడో,
మమ్ములను ఎవరు బానిసలను చేయదలచుకొన్నాడో,
మమ్ములను చంపి కష్టపెట్టవలెనని
ఎవడు చూస్తున్నాడో, వారినెల్లా
ఓ పృథ్వి! ముందుగానే నశింపజెయ్యి. ॥ 14 ॥

మంత్రము।

త్వజ్జాతా స్త్వయి చరన్తి మర్త్యా-

స్త్వం బిభర్షి ద్విపద స్త్వం చతుష్పదః ।

తవేమే పృథివి పఞ్చ మానవా

యేభ్యో జ్యోతి రమృతం మర్త్యేభ్య

ఉద్య న్త్సూర్యో రశ్మిభి రాతనోతి ॥ 15 ॥

పదము :

త్వత్ । జాతాః । త్వయి । చరన్తి । మర్త్యాః ।

త్వమ్ । బిభర్షి । ద్వి౽పదః । త్వమ్ । చతుః౽పదః ।

తవ । ఇమే । పృథివి । పఞ్చ । మానవాః ।

యేభ్యః । జ్యోతిః । అమృతమ్ । మర్త్యేభ్యః ।

ఉత్౽యన్ । సూర్యః । రశ్మి౽భిః । ఆ౽తనోతి ॥ 15 ॥

అనువాదం :

ఓపృథివీ! మర్త్యులు నీలోనుంచే ఉద్భవించినారు
నీ పైనే సంచరిస్తున్నారు
ద్విపాత్తులు, చతుష్పాత్తులు అయిన
ప్రాణులందరనూ నీవు భరిస్తున్నావు
ఈ మానవుల అమృతత్వసిద్ధికై
వారికి వెలుగునిచ్చుటకై ఉదయించిన సూర్యుని
కిరణాలతో విస్తృతపరుస్తున్నావు
మేము - పంచవిధ మానవులమూ,
నిన్ను సేవించుటకై ఇచ్ఛగిస్తున్నాము ॥ 15 ॥

మంత్రము :

తా నః ప్రజాః సం దుహ్రతాం సమగ్రా

వాచో మధు పృథివి ధేహి మహ్యమ్ ॥ 16 ॥

పదము :

తాః । నః । ప్ర౽జాః । సమ్ । దుహ్రతామ్ । సమ్౽అగ్రాః ।

వాచః । మధు । పృథివి । ధేహి । మహ్యమ్ ॥ 16 ॥

అనువాదం :

ఓ భూమాతా! మేము నీ వారము.
మేము నీ సంతానము.
సమ్యగవాక్కుతో మధుసందోహనం చేసే
శక్తిని మాకు నీవు కల్పించు. ॥ 16 ॥

మంత్రము :

విశ్వస్వం౨ మాతర మోషధీనాం
ధ్రువాం భూమిం పృథివీం ధర్మణా ధృతామ్ ।
శివాం స్యోనా మను చరేమ విశ్వహా ॥ 17 ॥

పదము :

విశ్వ౨స్వ౨మ్ । మాతరమ్ । ఓషధీనామ్ ।
ధ్రువామ్ । భూమిమ్ । పృథివీమ్ । ధర్మణా । ధృతామ్ ।
శివామ్ । స్యోనామ్ । అను । చరేమ । విశ్వహా ॥ 17 ॥

అనువాదం :

సర్వవనస్పతులకు మాత ఈ విశాలభూమి.
ధర్మంతో, ధృతితో కల్యాణమయి అయిన
ఈ పృథివిని మేము సర్వదా సేవిస్తున్నాము ॥ 17 ॥

మంత్రము :

మహత్ సధస్థం మహతీ బభూవిథ
మహాన్ వేగ ఏజథు ర్వేపథు ష్టే ।

మహాం స్త్వేన్ద్రో రక్ష త్యప్రమాదమ్ ।
సా నో భూమే ప్ర రోచయ
హిరణ్యస్యేవ సందృశి
మా నో ద్విక్షత కశ్చన ॥ 18 ॥

పదము :

మహత్ । సధఽస్థమ్ । మహతీ । బభూవిథ ।
మహాన్ । వేగః । ఏజథుః । వేపథుః । తే ।
మహాన్ । త్వా । ఇన్ద్రః । రక్షతి । అప్రఽమాదమ్ ।
సా । నః । భూమే । ప్ర । రోచయ ।
హిరణ్యస్యఽఇవ । సమ్ఽదృశి ।
మా । నః । ద్విక్షత । కః । చన ॥ 18 ॥

అనువాదం :

మేమందరం ఒకచోట కలిసికొనుటకు
నీవు స్థానమైనావు నీవు గొప్పదానవు
నీ చలనగమనాదులు గొప్పవి వేగవంతమైనవి
ఇలాంటి నిన్ను మహేంద్రుడు
ప్రమాదాలు రాకుండా రక్షిస్తున్నాడు.
నీవు సేనవలె మెరిసిపోతున్నావు
మాయెడ ఎలాంటి ద్వేషభావాన్ని
మనసులో ఉంచుకోవద్దు ॥ 18 ॥

మంత్రము :

అగ్ని ర్భూమ్యా మోషధీ ష్వగ్ని

మాపో బిభ్ర త్యగ్ని రశ్మసు ।

అగ్ని ర న్తః పురుషేషు

గో ష్వశ్వే ష్వగ్నయః ॥ 19 ॥

పదము :

అగ్నిః । భూమ్యామ్ । ఓషధీషు । అగ్నిమ్ ।

ఆపః । బిభ్రతి । అగ్నిః । అశ్మ౽సు ।

అగ్నిః । అ న్తః । పురుషేషు ।

గోషు । అశ్వేషు । అగ్నయః । ॥ 19 ॥

అనువాదం .

పృథివీమధ్యభాగంలో అగ్ని ఉన్నాడు.
ఓషధులలో అగ్ని ఉన్నది. జలంలో అగ్ని ఉన్నది.
రాళ్ళలో నిప్పు ఉన్నది.
మనుష్యులలో జఠరాగ్ని రూపంలో అగ్ని ఉన్నాడు.
గోవులలో, అశ్వములలో కూడా అగ్ని కలదు. ॥ 19 ॥

మంత్రము :

అగ్ని ర్దివ ఆ తప త్యగ్నే

ర్దేవస్యోర్వ౹ న్తరిక్షమ్ ।

అగ్నిం మర్తాస ఇన్ధతే
హవ్యవాహం ఘృతప్రియమ్ ॥ 20 ॥

పదము :

అగ్నిః । దివః । ఆ । తపతి । అగ్నేః ।
దివస్య । ఉరు । అన్తరిక్షమ్ ।
అగ్నిమ్ । మర్తాసః । ఇన్ధతే ।
హవ్యఽవాహమ్ । ఘృతఽప్రియమ్ ॥ 20 ॥

అనువాదం :

ద్యులోకంలో (సూర్యరూపంతో) అగ్ని ఉండి ప్రకాశిస్తున్నది
ఈ అగ్ని ప్రకాశంలో అంతరిక్షం ఎదిగిపోతున్నది
ఈ విధంగా వివిధ రూపాలలో ఉన్న
హవ్యవాహనుడు, ఘృతప్రియుడు అయిన అగ్నిని
మనుష్యలోకం దీప్తిమంతం చేస్తున్నది ॥ 20 ॥

మంత్రము :

అగ్నివాసాః పృథివ్యసితజ్ఞూ-
స్త్విషీమన్తం సంశితం మా కృణోతు ॥ 21 ॥

పదము :

అగ్నిఽవాసాః । పృథివీ । అసితఽజ్ఞూః ।
త్విషిఽమన్తమ్ । సమ్ఽశితమ్ । మా । కృణోతు ॥ 21 ॥

అనువాదం :

అగ్నితో పరివ్యాప్తమై,
కాటుక వలె నల్లనైన పొగతో కూడిన అగ్ని
పృథివీ రూపంలో నన్ను వెలిగిపోజేస్తున్నాడు. ॥ 21 ॥

మంత్రము :

భూమ్యాం దేవేభ్యో దదతి
యజ్ఞం హవ్య మరంకృతమ్ ।
భూమ్యాం మనుష్యాః జీవన్తి
స్వధయాన్నేన మర్త్యాః ।
సా నో భూమిః ప్రాణ మాయు ర్దధాతు
జరదష్టిం మా పృథివీ కృణోతు ॥ 22 ॥

పదము :

భూమ్యామ్ । దేవేభ్యః । దదతి ।
యజ్ఞమ్ । హవ్యమ్ । అరమ్ఽకృతమ్ ।
భూమ్యామ్ । మనుష్యాఃః । జీవన్తి ।
స్వధయా । అన్నేన । మర్త్యాః ।
సా । నః । భూమిః । ప్రాణమ్ । ఆయుః । దధాతు ।
జరత్ఽఅష్టిమ్ । మా । పృథివీ । కృణోతు ॥ 22 ॥

అనువాదం :

ఈ భూమిపై మనుష్యులు అలంకృతులై ఉన్నారు
హవ్యమును, యజ్ఞమును దేవతలకై
సమర్పణం చేస్తున్నారు
'స్వధా' అంటూ అన్నంతో మర్త్యులు జీవిస్తున్నారు
ఈ భూమి మాకు బలమును, ప్రాణమును
ఆయుస్సును ప్రసాదించు గాక!
నాకు ఉన్నతిని కల్పించు గాక! ॥ 22 ॥

మంత్రము :

య స్తే గన్ధః పృథివి సంబభూవ
యం బిభ్ర త్యోషధయో యమాపః ।
యం గన్ధర్వా అప్సరసశ్చ భేజిరే
తేన మా సురభిం కృణు
మా నో ద్విక్షత కశ్చన ॥ 23 ॥

పదము :

యః । తే । గన్ధః । పృథివి । సమ్ఽబభూవ ।
యమ్ । బిభ్రతి । ఓషధయః । యమ్ । ఆపః ।
యమ్ । గన్ధర్వాః । అప్సరసః । చ । భేజిరే ।
తేన । మా । సురభిమ్ । కృణు । మా । నః । ద్విక్షత । కః । చన
॥ 23 ॥

అనువాదం.

ఓ పృథివీ! నీ నుంచి వచ్చే సుగంధాన్ని
ఓషధులు ధరిస్తున్నవి.
జలం ధరిస్తున్నది. గంధర్వులు ధరిస్తున్నారు.
అప్సరసలు ధరిస్తున్నారు.
ఆ సుగంధంతో నన్ను కూడా సుగంధయుతునిగా చెయ్యి.
మాలో ఎవరూ ఎవరినీ ద్వేషించరు.
మాలో మేము అంతరంగంలో
మైత్రీభావంతో ఉందుము గాక! ॥ 23 ॥

మంత్రము.

యస్తే గన్ధః పుష్కర మావివేశ
యం సంజభ్రుః సూర్యాయా వివాహే ।
అమర్త్యాః పృథివి గన్ధ మగ్రే
తేన మా సురభిం కృణు
మా నో ద్విక్షత కశ్చన ॥ 24 ॥

పదము.

యః । తే । గన్ధః । పుష్కరమ్ । ఆఽవివేశ ।
యమ్ । సమ్ఽజభ్రుః । సూర్యాయాః । విఽవాహే ।
అమర్త్యాః । పృథివి । గన్ధమ్ । అగ్రే ।

తేన । మా । సురభిమ్ । కృణు ।

మా । నః । ద్విక్షత । కః । చన ॥ 24 ॥

అనువాదం:

నీ సుగంధం ఓ పృథివీ! కమలంలో ప్రవేశించి ఉన్నది
మొదట దీనిని వాయ్వాది దేవతలు, సూర్యుడు
ఉషావివాహసమయంలో దానిని ధరిస్తున్నారు
దీనితో నన్ను సుగంధవంతునిగా చెయ్యి
మాలో ఎవరుకానీ పరస్పరం
ద్వేషించుకొనకుందుము గాక! ॥ 24 ॥

మంత్రము:

యస్తే గన్ధః పురుషేషు

స్త్రీషు పుంసు భగో రుచిః ।

యో అశ్వేషు వీరేషు

యో మృగేషూత హస్తిషు ।

కన్యాऽయాం వర్చో యద్ భూమే

తేనాస్మాం అపి సం సృజ

మా నో ద్విక్షత కశ్చన ॥ 25 ॥

పదము:

యః । తే । గన్ధః । పురుషేషు

స్త్రీషు । పుమ్ऽసు । భగః । రుచిః ।

యః । అశ్వేషు । వీరేషు ।

యః । మృగేషు । ఉత । హస్తిషు ।

కన్యాఽయామ్ । వర్చః । యత్ । భూమే ।

తేన । అస్మాన్ । అపి । సమ్ । సృజ ।

మా । నః । ద్విక్షత । కః । చన ॥ 25 ॥

**అనువాదం :**

ఓ పృథివీ! నీ సౌరభం వీరపురుషులలో, స్త్రీలలో
తేజోమయమై, కాంతిరూపమై ఉన్నది.
అశ్వములతో, మృగములలో, గజములలో
ఏ వర్చస్సైతే ఉన్నదో అది
కన్యలోను, మాలోను సృష్టి అగు గాక!
మాలో ఎవరూ మరొకనిని
ద్వేషింపకుందురు గాక! ॥ 25 ॥

**మంత్రము :**

శిలా భూమి రశ్మా పాంసుః

సా భూమిః సంధృతా ధృతా ।

తస్యై హిరణ్యవక్షసే

పృథివ్యా అకరం నమః ॥ 26 ॥

పదము:

శిలా । భూమిః । అశ్మా । పాంసుః ।

సా । భూమిః । సమ్ఽధృతా । ధృతా ।

తస్యై । హిరణ్యఽవక్షసే ।

పృథివ్యై । అకరమ్ । నమః ॥ 26 ॥

అనువాదం :

రాళ్ళు, రప్పలు, దుమ్ము, ధూళి భూస్వరూపమే
అది మాలోని వీరత్వాన్ని రక్షించుగాక!
యోగ్యమైన రీతిలో సురక్షితమై ఉండుగాక!
ఆ హిరణ్యగర్భ అయిన భూమికి నమస్కారం ॥ 26 ॥

మంత్రము :

యస్యాం వృక్షా వానస్పత్యా

ధ్రువా స్తిష్ఠన్తి విశ్వహా ।

పృథివీం విశ్వధాయసం

ధృతా మచ్ఛావదామసి ॥ 27 ॥

పదము

యస్యామ్ । వృక్షాః । వానస్పత్యాః ।

ధ్రువాః । తిష్ఠన్తి । విశ్వహా ।

పృథివీమ్ । విశ్వఽధాయసమ్ ।
ధృతామ్ । అచ్యుఽఅవదామసి ॥ 27 ॥

అనువాదం :

ఇందలి ఓషధులు, లతాదులు ఎల్లప్పుడూ స్థిరంగా ఉంటాయి
పూర్వోక్త గుణ విశిష్ట అయిన ఈ భూమి
సురక్షితంగా ఉండుగాక!
ముఖ్యంగా మేమీ పృథివిని
ప్రశంసిస్తూ గానం చేస్తున్నాము. ॥ 27 ॥

మంత్రము :

ఉదీరాణా ఉతాసీనా
స్తిష్ఠన్తః ప్రక్రామన్తః ।
పద్భ్యాం దక్షిణసవ్యాభ్యాం
మా వ్యథిష్మహి భూమ్యామ్ ॥ 28 ॥

పదము

ఉత్ఽఈరాణాః । ఉత । ఆసీనాః ।
తిష్ఠన్తః । ప్రఽక్రామన్తః ।
పత్ఽభ్యామ్ । దక్షిణఽసవ్యాభ్యామ్ ।
మా । వ్యథిష్మహి । భూమ్యామ్ ॥ 28 ॥

అనువాదం :

అటూ ఇటూ తిరుగుతూ,
కూర్చుంటూ, నిలుచుంటూ, పరాక్రమిస్తూ
ఈ భూమిపై ఉన్న మేము ఎవరినీ కష్టపెట్టము ॥ 28 ॥

మంత్రము :

విమృగ్వరీం పృథివీ మా వదామి
క్షమాం భూమిం బ్రహ్మణా వావృధానామ్ ।
ఊర్జం పుష్టం బిభ్రతీ మన్నభాగం
ఘృతం త్వాభి ని షీదేమ భూమే ॥ 29 ॥

పదము :

వి౽మృగ్వరీమ్ । పృథివీమ్ । ఆ । వదామి ।
క్షమామ్ । భూమిమ్ । బ్రహ్మణా । వవృధానామ్ ।
ఊర్జమ్ । పుష్టమ్ । బిభ్రతీమ్ । అన్న౽భాగమ్ ।
ఘృతమ్ । త్వా । అభి । ని । సీదేమ । భూమే ॥ 29 ॥

అనువాదం :

పాపప్రక్షాళకమై, బ్రహ్మసృష్టించినట్టి,
ఓజస్వంతమై, పుష్టివంతమైన అన్నాన్ని,
అజ్యభాగాన్ని ధరించిన ఈ పృథివి
ప్రాణిమాత్రులకు నివాసయోగ్యమైనది

ఈ మాతృభూమిని అందువల్లనే ప్రార్థిస్తున్నాను.
ఈ మా భూమి మాకు ఆధారభూతమగు గాక! ॥ 29 ॥

మంత్రము।

శుద్ధా న ఆప స్తన్వేఽ క్షరన్తు
యో నః సేదు రప్రియే తం ని దధ్మః।
పవిత్రేణ పృథివి మోత్ పునామి ॥ 30 ॥

పదము।

శుద్ధాః। నః। ఆపః। తన్వే। క్షరన్తు।
యః। నః। సేదుః। అప్రియే। తమ్। ని। దధ్మః।
పవిత్రేణ। పృథివి। మా। ఉత్। పునామి ॥ 30 ॥

అనువాదం।

ఓ పృథివీ మా శరీరశుద్ధికై
నిర్మల జలములు స్రవించు గాక!
మాకు అప్రియులైన వారిని వేరుపరచి
నా పవిత్ర కర్తవ్యాన్ని నేను నిర్వర్తిస్తున్నాను. ॥ 30 ॥

మంత్రము.

యా స్తే ప్రాచీః ప్రదిశో యా ఉదీచీ-
ర్యా స్తే భూమే అధరాద్ యాశ్చ పశ్చాత్।
స్యోనా స్తా మహ్యం చరతే భవన్తు
మా ని పప్తం భువనే శిశ్రియాణః ॥ 31 ॥

పదము

యాః। తే। ప్రాచీః। ప్ర౽దిశః। యాః। ఉదీచీః।

యాః। తే। భూమే। అధరాత్। యాః। చ। పశ్చాత్।

స్యోనాః। తాః। మహ్యమ్। చరతే। భవన్తు।

మా। ని। పప్తమ్। భువనే। శిశ్రియాణః ॥ 31 ॥

అనువాదం:

ఓ భూమీ! నీకు పూర్వదిశలు, ఉత్తరదిశలు,
ప్రత్యగ్దిశలు, నీ క్రిందుగానున్న దిశలు,
నీ వెనుకనున్న దిశలు ఈ సర్వదిక్కులయందు
జనం వస్తూ పోతూ ఉన్నారు
మాకు వారు సుఖాన్ని కల్పింతురు గాక!
ఏ దేశంలో మేము నివసిస్తున్నామో
దానినుంచి ఎప్పుడూ మేము
అధఃపాతం చెందము ॥ 31 ॥

మంత్రము:

మా నః పశ్చాన్మా పురస్తా-

న్నుదిష్ఠా మోత్తరా దధరా దుత।

స్వస్తి భూమే నో భవ మా విదన్

పరిపన్థినో వరీయో యావయా వధమ్ ॥ 32 ॥

పదము :

మా । నః । పశ్చాత్ । మా । పురస్తాత్ ।

నుదిష్ఠాః । మా । ఉత్తరాత్ । అధరాత్ । ఉత ।

స్వస్తి । భూమే । నః । భవ । మా । విదన్ ।

పరి౽పన్థినః । పరీయః । యవయ । వధమ్ ॥ 32 ॥

అనువాదం .

ఓ భూమీ! మా వెనుకనున్న ప్రాంతం
మమ్ములను చేయి వదలకుండు గాక!
దాని ముందునుంచి, ఉత్తరం నుంచి,
క్రిందిభాగం నుంచి మేము వినష్టులం కాకుందుము గాక!
మాకు శుభం కలుగు గాక!
మా శత్రువులు జ్ఞానశూన్యులగుదురు గాక!
ఆ శత్రువధార్థమై మాలో
ఉత్కృష్టులు ప్రయత్నింతురు గాక! ॥ 32 ॥

మంత్రము :

యావత్ తే౽భి విపశ్యామి

భూమే సూర్యేణ మేదినా ।

తావన్మే చక్షుర్మా మే

ష్టోత్తరా ముత్తరాం సమామ్ ॥ 33 ॥

పదము :

యావత్ । తే । అభి । వి౽పశ్యామి ।

భూమే । సూర్యేణ । మేదినా ।

తావత్ । మే । చక్షుః । మా । మేష్ట ।

ఉత్తరామ్౽ఉత్తరామ్ । సమామ్ ॥ 33 ॥

అనువాదం.

ఓ భూమాతా ! సర్వసంతోషకారకుడైన
సూర్యుడు ఎంతవరకు మాకు కన్పిస్తాడో,
అంతవరకు మా నేత్రేంద్రియాదులు
ఒక్కొక్క సంవత్సరం మా వయసు గడచిన కొలదీ
శిథిలములు కాకుండు గాక ! ॥ 33 ॥

మంత్రము :

య చ్ఛయానః పర్యావర్తే దక్షిణం

సవ్య మభి భూమే పార్శ్వమ్ ।

ఉత్తానా స్త్వా ప్రతీచీం యత్

పృష్ఠీభి రధిశేమహే ।

మా హింసీ స్తత్ర నో భూమే

సర్వస్య ప్రతిశీవరి ॥ 34 ॥

పదము.

యత్ । శయానః । పరి౨ఆవర్తే । దక్షిణమ్ ।

సవ్యమ్ । అభి । భూమే । పార్శ్వమ్ ।

ఉత్తానాః । త్వా । ప్రతీచీమ్ । యత్ ।

పృష్టిభిః । అధి౨శేమహే ।

మా । హింసీః । తత్ర । నః । భూమే ।

సర్వస్య । ప్రతి౨శీవరి ॥ 34 ॥

అనువాదం:

ఓ భూమీ! నిద్రిస్తున్నపుడు,
ఎడమ నుంచి కుడికి పొరలుతున్నపుడు,
నీవు పశ్చిమమునకు తిరిగి ఉన్నపుడు,
వెల్లకిల పడుకున్నపుడు,
మా సహచరులను ప్రతీక్షిస్తున్న వారిని
మమ్ములనెవరినీ ఓ భూదేవీ! నాశం చేయవద్దు. ॥ 34 ॥

మంత్రము:

యత్ తే భూమే విఖనామి

క్షిప్రం తదపి రోహతు ।

మా తే మర్మ విమృగ్వరి

మా తే హృదయ మర్పిపమ్ ॥ 35 ॥

పదము ।

యత్ । తే । భూమే । వి॒ఽఖనా॑మి ।

క్షి॒ప్రమ్ । తత్ । అపి॑ । రో॒హ॒తు ।

మా । తే॒ । మర్మ । వి॒ఽమృ॒గ్వ॒రి॒ ।

మా । తే । హృ॒దయ॑మ్ । అ॒ర్పి॒పమ్ ॥ 35 ॥

అనువాదం ।

ఓ భూమీ! నీ కోసమై దేనినైతే నాటినానో
అది త్వరలో మొలకెత్తు గాక!
ఓ విమృగ్వరీ! నీకు అర్పించిన హృదయం
దుఃఖితం కాకుండు గాక! ॥ 35 ॥

మంత్రము

గ్రీ॒ష్మ స్తే॑ భూమే వ॒ర్షాణి॑

శ॒ర ద్ధే॑మ॒న్తః శిశి॑రో వస॒న్తః ।

ఋ॒తవ॑ స్తే॒ విహి॑తా హాయ॒నీ-

ర॑హోరా॒త్రే పృ॑థివి నో దుహాతామ్ ॥ 36 ॥

పదము ।

గ్రీ॒ష్మః । తే॒ । భూ॒మే॒ । వ॒ర్షాణి॑ ।

శ॒రత్ । హే॒మ॒న్తః । శిశి॑రః । వ॒స॒న్తః ।

ఋతవః । తే । వి౨హితాః । హాయనీః ।
అహోరాత్రే ఇతి । పృథివి । నః । దుహాతామ్ ॥ 36 ॥

అనువాదం:

ఓ పృథివీ! నీకు గ్రీష్మము, శరత్తు, హేమంతము,
శిశిరము, వసంతము - ఈ ఋతువులన్నీ
ఒక సంవత్సరంగా విహితములై ఉన్నవి.
దినరాత్రులు మాకు సుఖమునిచ్చేవి. ॥ 36 ॥

మంత్రము:

యాప సర్పం విజమానా విమృగ్వరీ
యస్యా మాస న్నగ్నయో యే అప్స్వ1 న్తః ।
పరా దస్యూన్ దదతి దేవపీయూ-
నిన్ద్రం వృణానా పృథివీ న వృత్రమ్ ।
శక్రాయ దధ్రే వృషభాయ వృష్ణే ॥ 37 ॥

పదము:

యా । అప । సర్పమ్ । విజమానా । వి౨మృగ్వరీ ।
యస్యామ్ । ఆసన్ । అగ్నయః । యే । అప్౨సు । అన్తః ।
పరా । దస్యూన్ । దదతీ । దేవ౨పీయూన్ ।

ఇన్ద్రమ్ । వృణానా । పృథివీ । న । వృత్రమ్ ।

శక్రాయ । దధ్రే । వృషభాయ । వృష్ణే ॥ 37 ॥

అనువాదం :

ప్రక్షాళనకారి అయినట్టి, అటూఇటూ తిరుగుచున్నట్టి,
ఉదకములలో అంతర్నిహితములై ఉన్నట్టి
అగ్నులు ఇందులో ఉన్నవి
దస్యులను, శక్రుని, వీర్యవంతుడైన వృషభుని, ఇంద్రుని-
ఈ భూమి ధరిస్తున్నది.
శత్రువులను దూరం చేస్తున్నది
వృత్రనాశకుడైన ఇంద్రుని
మాతో సంగతుని చేస్తున్నది ఈ మా భూమే ॥ 37 ॥

మంత్రము :

యస్యాం సదోహవిర్ధానే

యూపో యస్యాం నిమీయతే ।

బ్రహ్మాణో యస్యా మర్చ-

న్త్యృగ్భిః సామ్నా యజుర్విదః ।

యుజ్యన్తే యస్యా మృత్విజః

సోమ మిన్ద్రాయ పాతవే ॥ 38 ॥

పదము :

యస్యామ్ । సదోహవిర్ధానే ఇతి సదఃఽహవిర్ధానే ।

యూపః । యస్యామ్ । నిఽమీయతే ।

బ్రహ్మాణః । యస్యామ్ । అర్చన్తి ।

ఋక్ఽభిః । సామ్నా । యజుఃఽవిదః ।

యుజ్యన్తే । యస్యామ్ । ఋత్విజః ।

సోమమ్ । ఇన్ద్రాయ । పాతవే ॥ 38 ॥

అనువాదం

ఈ భూమి మీదనే మా నివాసగృహమున్నది.
ఇక్కడనే హవ్యములున్నవి.
ఇక్కడే యూపమును నాటి ఉన్నాము.
ఇక్కడే యజుర్వేదానికి చెందిన ఋత్విక్కులు,
ఋగ్వేదులైన ఋత్విక్కులు,
సామవేదము నెరిగిన బ్రహ్మలు,
కలిసి అర్చిస్తున్నారు.
సోమపానార్థమై ఇంద్రునితో సంయోజనం చేస్తున్నారు. ॥38॥

మంత్రము :

యస్యాం పూర్వే భూతకృత

ఋషయో గా ఉదానృచుః ।

సప్త సత్రేణ వేధసో

యజ్ఞేన తపసా సహ ॥ 39 ॥

పదము :

యస్యామ్ । పూర్వే । భూతఽకృతః ।

ఋషయః । గాః । ఉత్ఽఆనృచుః ।

సప్త । సత్రేణ । వేధసః ।

యజ్ఞేన । తపసా । సహ ॥ 39 ॥

అనువాదం :

ఈ భూమిపైనే పూర్వులు, ఋషులు
బ్రహ్మను సప్తసూత్రమైన యజ్ఞంతో,
తపస్సుతో, ఉత్తమ స్వరంతో స్తుతిస్తూ ఉండినారు ॥ 39 ॥

మంత్రము :

సా నో భూమి రా దిశతు

య ద్ధనం కామయామహే ।

భగో అనుప్రయుఙ్క్తా

మిన్ద్ర ఏతు పురోగవః ॥ 40 ॥

పదము

సా । నః । భూమిః । ఆ । దిశతు ।

యత్ । ధనమ్ । కామయామహే ।

భగః । అనుఽప్రయుఙ్క్తామ్ ।

ఇన్ద్రః । ఏతు । పురఃఽగవః ॥ 40 ॥

అనువాదం :

మా ఈ భూమి, మా ధనమును - మేము
కోరుతున్న దానిని మాకు ఇచ్చుగాక !

భగుడు, సహాయకుడైన ఇంద్రుడు
పురోగమిస్తూ ఇక్కడికి వత్తురు గాక! ॥ 40 ॥

మంత్రము.

యస్యాం గాయన్తి నృత్యన్తి
భూమ్యాం మర్త్యా వ్యైఽలబాః।
యుధ్యన్తే యస్యా మాక్రన్దో
యస్యాం వదతి దున్దుభిః।
సా నో భూమిః ప్ర ణుదతాం
సపత్నా నసపత్నం మా పృథివీ కృణోతు ॥ 41 ॥

పదము:

యస్యామ్। గాయన్తి। నృత్యన్తి।
భూమ్యామ్। మర్త్యాః। విఽఐలబాః।
యుధ్యన్తే। యస్యామ్। ఆఽక్రన్దః।
యస్యామ్। వదతి। దున్దుభిః।
సా। నః। భూమిః। ప్ర। నుదతామ్।
సఽపత్నాన్। అసపత్నమ్। మా। పృథివీ। కృణోతు ॥ 41 ॥

**అనువాదం :**

ఏ భూమిపై మర్త్యులు గానం చేస్తున్నారో,
నృత్యం చేస్తున్నారో, తమ రాష్ట్రరక్షను కోరుతున్నారో,
దేనిపై ఆక్రందనాలు వినబడుతున్నవో,
దుందుభులు మ్రోగుతున్నవో
ఆ ఈ మా భూమి శత్రువులను నురుమాడుతున్నది
ఈ భూమి మమ్ములను శత్రురహితంగా చేయుగాక! ॥ 41 ॥

**మంత్రము :**

యస్యా మన్నం వ్రీహియవౌ
యస్యా ఇమాః పఞ్చ కృష్టయః ।
భూమ్యై పర్జన్యపత్న్యై
నమోఽస్తు వర్షమేదసే ॥ 42 ॥

**పదము :**

యస్యామ్ । అన్నమ్ । వ్రీహిఽయవౌ ।
యస్యాః । ఇమాః । పఞ్చ । కృష్టయః ।
భూమ్యై । పర్జన్యఽపత్న్యై ।
నమః । అస్తు । వర్షఽమేదసే ॥ 42 ॥

**అనువాదం :**

ఏ భూమిపై వ్రీహియవలు పండునో,
ఆహారార్థమై అవి ఉపయుక్తమగునో,

దేనిపై పంచప్రకారములైన కృత్యములు నడుచునో,
ఎక్కడ సంవత్సరాంతం అన్నాదులు ఉత్పన్నములగునో,
ఇంద్రుడు దేని పాలకుడో,
ఆ పర్జన్యపత్నికి నా నమస్కారం. ॥ 42 ॥

మంత్రము:

యస్యాః పురో దేవకృతాః
క్షేత్రే యస్యా వికుర్వతే ।
ప్రజాపతిః పృథివీం విశ్వగర్భా-
మాశామాశాం రణ్యాం నః కృణోతు ॥ 43 ॥

పదము:

యస్యాః । పురః । దేవఽకృతాః ।
క్షేత్రే । యస్యాః । విఽకుర్వతే ।
ప్రజాఽపతిః । పృథివీమ్ । విశ్వఽగర్భామ్ ।
ఆశామ్ఽఆశామ్ । రణ్యామ్ । నః । కృణోతు ॥ 43 ॥

అనువాదం:

ఈ భూమిపైనే నగరములు దేవకృతములై ఉన్నవి.
దీని ప్రత్యేక ప్రాంతములలో పురుషులు
తమ తమ పనులను నిర్వర్తిస్తున్నారు.
ప్రజాపతి విశ్వగర్భయైన ఈ పృథివిని
దిక్కుదిక్కులా రమణీయంగా రూపొందిస్తున్నాడు. ॥ 43 ॥

మంత్రము:

నిధిం బిభ్రతీ బహుధా గుహా వసు
మణిం హిరణ్యం పృథివీ దదాతు మే ।
వసూని నో వసుదా రాసమానా
దేవీ దధాతు సుమనస్యమానా ॥ 44 ॥

పదము:

నిఽధిమ్ । బిభ్రతీ । బహుఽధా । గుహా । వసు ।
మణిమ్ । హిరణ్యమ్ । పృథివీ । దదాతు । మే ।
వసూని । నః । వసుఽదాః । రాసమానా ।
దేవీ । దధాతు । సుఽమనస్యమానా । ॥ 44 ॥

అనువాదం:

బహువిధ గృహాలలో ధనము, రత్నాదులు, బంగారము
మొదలైన నిధులను ధరిస్తున్న మా ఈ భూమి
మాకు వాటినన్నిటినీ ప్రసాదించు గాక!
ధనదాత్రి అయిన ఈ దేవి మా పనులన్నిటినీ
సౌమనస్యంతో ధనమిచ్చి పూర్తిచేయు గాక!
తగినంత ధనాన్ని మాకు ప్రసాదించు గాక! ॥ 44 ॥

మంత్రము:

జనం బిభ్రతీ బహుధా వివాచసం
నానాధర్మాణం పృథివీ యథౌకసమ్ ।

సహస్రం ధారా ద్రవిణస్య మే దుహాం
ధ్రువేవ ధేను రనపస్ఫురన్తీ ॥ 45 ॥

పదము :

జనమ్ । బిభ్రతీ । బహుఽధా । విఽవాచసమ్ ।
నానాఽధర్మాణమ్ । పృథివీ । యథాఽఓకసమ్ ।
సహస్రమ్ । ధారాః । ద్రవిణస్య । మే । దుహామ్ ।
ధ్రువాఽఇవ । ధేనుః । అనపఽస్ఫురన్తీ ॥ 45 ॥

అనువాదం :

అనేకవిధ ధర్మములుగల వారు
అనేక భాషలు భాషించే వారు అయిన జనాన్ని,
ఒకే ఇంటిలో నున్న వారిని వలె భరిస్తూ,
వినష్టం వారికి కాకుండా కాపాడుతూ,
స్థిరంగా ఉన్న భూమి ద్రవ్యధారలను మాకై
ధేనువు వలె దోహనం చేయుగాక! ॥ 45 ॥

మంత్రము :

యస్తే సర్పో వృశ్చిక స్తృష్టదంశ్మా
హేమ న్తజబ్ధో భృమలో గుహా శయే ।
క్రిమి ర్జిన్వత్ పృథివి యద్య దేజతి

ప్రావృషి తన్నః సర్ప న్నోప స్పృపద్
యచ్ఛివం తేన నో మృడ ॥ 46 ॥

పదము

యః । తే । సర్పః । వృశ్చికః । తృష్టఽదంశ్మా ।
హేమన్తఽజబ్ధః । భృమలః । గుహా । శయే ।
క్రిమిః । జిన్వత్ । పృథివి । యత్ఽయత్ । ఏజతి ।
ప్రావృషి । తత్ । నః । సర్పత్ । మా । ఉప । సృపత్ ।
యత్ । శివమ్ । తేన । నః । మృడ ॥ 46 ॥

అనువాదం :

పాము, తేలు వంటి విషక్రిమికీటాదులు
నీలోనే ఉంటున్నవి
మంచుదెబ్బతిని కాటు వేయక, కుట్టక
మబ్బుగా పడి ఉన్నవి
వర్షాగమంతో అవి ఓ పృథివీ
అటూ ఇటూ కదలనారంభిస్తాయి
అవి ఏవికానీ మాపై ప్రాకకుండు గాక!
మాకు నీవు శుభ, సుఖదాత్రివి కమ్ము ॥ 46 ॥

మంత్రము :

యే తే పన్థానో బహవో జనాయనా
రథస్య వర్త్మానసశ్చ యాతవే ।

ర్యైః సంచర స్త్యుభయే భద్రపాపా-
స్తం పన్థానం జయే మానమిత్ర-
మతస్కరం యచ్ఛివం తేన నో మృడ ॥ 47 ॥

పదము।

యే । తే । పన్థానః । బహవః । జనఽఅయనాః ।
రథస్య । వర్త్మ । అనసః । చ । యాతవే ।
యైః । సమ్ఽచరన్తి । ఉభయే । భద్రఽపాపాః ।
తమ్ । పన్థానమ్ । జయేమ । అనమిత్రమ్ ।
అతస్కరమ్ । యత్ । శివమ్ । తేన । నః । మృడ ॥ 47 ॥

అనువాదం।

ఓ భూమీ! నీపై మనుష్యులు నడయాడే
దారులెన్నో ఉన్నవి.
బండి బాటలెన్నో ఉన్నవి.
వాటిపై అటూ ఇటూ తిరిగే మార్గాలున్నవి.
వాటిలో పరోపకారులైన వారు తిరుగుతుంటారు.
పాపులూ అలాగే తిరుగుతుంటారు.
వాటిని శత్రురహితంగా, తస్కరరహితంగా చెయ్యి.
అవి మాకు జయాన్ని చేకూర్చు గాక!
మాకు కల్యాణకారులగు గాక!
వాటితో మేము సుఖపడుదుము గాక! ॥ 47 ॥

మంత్రము :

మల్వం బిభ్రతీ గురుభృద్

భద్రపాపస్య నిధనం తితిక్షుః ।

వరాహేణ పృథివీ సంవిదానా

సూకరాయ వి జిహీతే మృగాయ ॥ 48 ॥

పదము :

మల్వమ్ । బిభ్రతీ । గురుఽభృత్ ।

భద్రఽపాపస్య । నిఽధనమ్ । తితిక్షుః ।

వరాహేణ । పృథివీ । సమ్ఽవిదానా ।

సూకరాయ । వి । జిహీతే । మృగాయ ॥ 48 ॥

అనువాదం :

బరువులను మోస్తూ, వాటిని మోయగల శక్తి కలది భూమి.
పుణ్యాత్ములు, పాపాత్ములు అయిన మానవుల
మరణాలను సహించేది పృథివి.
ఉత్తమ జలదాతలతో జలపానం చేస్తూన్న
వరాహములను మృగములను తనకిరణాలతో
పవిత్రం చేసే సూర్యరశ్ములు కూడా విశేషంగా
ఈ భూమిపై పడుతున్నవి. ॥ 48 ॥

మంత్రము :

యే త ఆరణ్యాః పశవో

మృగా వనే హితాః సింహా

వ్యాఘ్రాః పురుషాదశ్చరన్తి ।
ఉలం వృకం పృథివి దుచ్ఛునామిత
ఋక్షీకాం రక్షో అప బాధయాస్మత్ ॥ 49 ॥

పదము :

యే । తే । అరణ్యాః । పశవః ।
మృగాః । వనే । హితాః । సింహాః ।
వ్యాఘ్రాః । పురుషఽఅదః । చరన్తి ।
ఉలమ్ । వృకమ్ । పృథివి । దుచ్ఛునామ్ । ఇతః ।
ఋక్షీకామ్ । రక్షః । అప । బాధయ । అస్మత్ ॥ 49 ॥

**అనువాదం :**

నీ వనాలలో ఉన్న సింహములు, వ్యాఘ్రములు
ఓ భూమీ! మానవ భక్షకములు.
అరణ్యములలోని ఇతర మృగాదికములు
స్వేచ్ఛగా తిరుగుతున్నవి.
వన్యమృగాలు, పిచ్చికుక్కలు,భల్లూకాదులు కూడా
భూమి పైనే ఉన్నవి.
అవి మాకు దూరంగా ఉండుగాక! ॥ 49 ॥

**మంత్రము :**

యే గన్ధర్వా అప్సరసో
యే చారాయాః కిమీదినః ।

పిశాచా న్త్సర్వా రక్షాంసి
తా నస్మద్ భూమే యావయ ॥ 50 ॥

పదము :

యే । గన్ధర్వాః । అప్సరసః ।
యే । చ । అరాయాః । కిమీదినః ।
పిశాచాన్ । సర్వా । రక్షాంసి ।
తాన్ । అస్మత్ । భూమే । యవయ ॥ 50 ॥

అనువాదం :

గంధర్వులు, అప్సరసలు, నిర్ధనులు, కిమీదినులు,
ఇతర పిశాచములు – వీటినన్నిటినీ
మా నుండి దూరంగా కొనిపో. ॥ 50 ॥

మంత్రము :

యాం ద్విపాదః పక్షిణః సంపత న్తి
హంసాః సుపర్ణాః శకునా వయాంసి ।
యస్యాం వాతో మాతరిశ్వేయతే
రజాంసి కృణ్వం శ్చ్యావయంశ్చ వృక్షాన్ ।
వాతస్య ప్రవా ముపవా మను వా త్యర్చిః ॥ 51 ॥

పదము :

యామ్ । ద్వి౽పాదః । పక్షిణః । సమ్౽పతన్తి ।

హంసాః । సు౽పర్ణాః । శకునాః । వయాంసి ।

యస్యామ్ । వాతః । మాతరిశ్వా । ఈయతే ।

రజాంసి । కృణ్వన్ । చ్యవయన్ । చ । వృక్షాన్ ।

వాతస్య । ప్ర౽వామ్ । ఉప౽వామ్ । అను । వాతి । అర్చిః ॥51॥

అనువాదం :

ద్విపాత్తులు, హంసగరుడాది పక్ష్యాదులు,
మా భూమిపై తిరుగాడుతున్నవి.
సంచారశీలమైన వాయువు
దుమ్ము, ధూళిని రేపుతూ, వృక్షాలను
కదలించి వేస్తూ మరింతగా పెరిగి వీచుతున్నది.
ఆ వాయువు గతి తేజస్సునకు అనుకూలంగా వీచుతున్నది.
॥ 51 ॥

మంత్రము :

యస్యాం కృష్ణ మరుణం చ సంహితే
అహోరాత్రే విహితే భూమ్యా మధి ।
వర్షేణ భూమిః పృథివీ వృతా వృతా
సా నో దధాతు భద్రయా
ప్రియే ధామని ధామని ॥ 52 ॥

పదము :

యస్యామ్ । కృష్ణమ్ । అరుణమ్ । చ । సంహితే ఇతి సమ్ఽహితే ।

అహోరాత్రే ఇతి । విహితే ఇతి విఽహితే । భూమ్యామ్ । అధి ।

వర్షేణ । భూమిః । పృథివీ । వృతా । ఆఽవృతా ।

సా । నః । దధాతు । భద్రయా ।

ప్రియే । ధామనిఽధామని ॥ 52 ॥

అనువాదం :

ఈ భూమిపై కృష్ణవర్ణములు, అరుణవర్ణములు
అయిన అహోరాత్రములు, అధివిహితములై ఉన్నవి.
ఈ విశాలమైన పృథివి వర్షంతో ఆవృతమై,
భద్రంకరమై ప్రియమైన ప్రతిఇంటిలోను
మాకు ప్రసన్నమగుగాక! ॥ 52 ॥

మంత్రము :

ద్యౌశ్చ మ ఇదం పృథివీ

చాన్తరిక్షం చ మే వ్యచః ।

అగ్నిః సూర్య ఆపో మేధాం

విశ్వే దేవాశ్చ సం దదుః ॥ 53 ॥

పదము :

ద్యౌః । చ । మే । ఇదమ్ । పృథివీ । చ ।

అన్తరిక్షమ్ । చ । మే । వ్యచః ।

అగ్నిః । సూర్యః । ఆపః । మేధామ్ ।

విశ్వే । దేవాః । చ । సమ్ । దదుః ॥ 53 ॥

**అనువాదం :**

అకాశము, పృథివి, అంతరిక్షము, అగ్ని,
సూర్యుడు, విశ్వేదేవతలు - వీరందరూ
మాకు మేధస్సును ఇచ్చి మా సర్వులలోను
వ్యాపించి బాగా ప్రకాశించాలి. ॥ 53 ॥

**మంత్రము :**

అహ మస్మి సహమాన

ఉత్తరో నామ భూమ్యామ్ ।

అభీషా డస్మి విశ్వాషా-

డాశామాశాం విషాసహిః ॥ 54 ॥

**పదము :**

అహమ్ । అస్మి । సహమానః ।

ఉత్తరః । నామ । భూమ్యామ్ ।

అభీషాట్ । అస్మి । విశ్వాషాట్ ।

ఆశామ్ఽఆశామ్ । విఽససహిః ॥ 54 ॥

**అనువాదం :**

నేను సుఖదుఃఖాదులను సమానంగా పరిగ్రహించువాడను.
యశస్సు, ప్రతిష్ఠ, ఉత్కృష్టతరంగా భూమిపై

దిక్కుదిక్కులనుంచి జయం లభింపగా
పరాక్రమిస్తూ శత్రుధ్వంసం చేయువాడను. ॥ 54 ॥

మంత్రము :

అదో యద్ దేవి ప్రథమానా పురస్తాద్
దేవై రుక్తా వ్యసర్పో మహిత్వమ్ ।
ఆ త్వా సుభూత మవిశత్ తదానీ-
మకల్పయథాః ప్రదిశ శ్చతస్రః ॥ 55 ॥

పదము :

అదః । యత్ । దేవి । ప్రథమానా । పురస్తాత్ ।
దేవైః । ఉక్తా । విఽఅసర్పః । మహిఽత్వమ్ ।
ఆ । త్వా । సుఽభూతమ్ । అవిశత్ । తదానీమ్ ।
అకల్పయథాః । ప్రఽదిశః । చతస్రః ॥ 55 ॥

అనువాదం :

ఓ దేవీ! ముందు దేవతలతో పాటు విజిగీషవై,
ప్రఖ్యాతవై, ప్రశంసితవై ఉన్న నీకు
విశేషించి ఉత్కృష్టమైన నీ చతుర్దిక్కులు
ప్రతిష్ఠను సమకూరుస్తున్నవి.
ఓ భూమీ! నీలోనికి ఆ ప్రతిష్ఠ ప్రవేశించి ఉన్నది. ॥ 55 ॥

మంత్రము :

యే గ్రామా యదరణ్యం

యాః సభా అధి భూమ్యామ్ ।

యే సంగ్రామాః సమితయ-

స్తేషు చారు వదేమ తే ॥ 56 ॥

పదము :

యే । గ్రామాః । యత్ । అరణ్యమ్ ।

యాః । సభాః । అధి । భూమ్యామ్ ।

యే । సమ్ఽగ్రామాః । సమ్ఽఇతయః ।

తేషు । చారు । వదేమ । తే ॥ 56 ॥

**అనువాదం :**

ఏ గ్రామాదులు, ఏ అరణ్యాదులు,
ఏ సభాదులు, ఏ సంగ్రామాదులు,
ఏ పరిషత్తులు ఈ భూమిపై ఉన్నవో
అవన్నీ నిన్ను బహుధా ప్రశంసిస్తాయి. ॥ 56 ॥

మంత్రము :

అశ్వ ఇవ రజో దుధువే వి తాన్ జనాన్

య ఆక్షియన్ పృథివీం యా దజాయత ।

మన్దాగ్రేత్వరీ భువనస్య గోపా
వనస్పతీనాం గృభి రోషధీనామ్ ॥ 57 ॥

పదము :

అశ్వఃఽఇవ । రజః । దుధువే । వి । తాన్ । జనాన్ ।
యే । ఆఽఅక్షియన్ । పృథివీమ్ । యాత్ । అజాయత ।
మన్ద్రా । అగ్రఽఇత్వరీ । భువనస్య । గోపాః ।
వనస్పతీనామ్ । గృభిః । ఓషధీనామ్ ॥ 57 ॥

అనువాదం :

ఈ భూమిపైనే యుద్ధములు మొదలైనవి జరిగినవి.
వానిలో పాల్గొన్న మనుష్యులు, రాజాదులు,
అశ్వాదులను భూమి భరిస్తున్నది.
దానిపైనుంచి ఎగసివచ్చే ధూళి
అశ్వగతితో ముందుకు పరుగిడుతున్నది.
ప్రసన్నమై అగ్రభాగంలో
నడుస్తున్న భువనగోప్త్రి! భూమీ!
వనస్పతులను, ఓషధులను రక్షిస్తున్నావు నీవు. ॥ 57 ॥

మంత్రము :

యద్ వదామి మధుమత్ తద్ వదామి
య దీక్షే తద్ వనన్తి మా ।

త్విషీమా నస్మి జూతిమా-

నవాన్యాన్ హన్మి దోధతః ॥ 58 ॥

పదము :

యత్ । వదామి । మధు౽మత్ । తత్ । వదామి ।

యత్ । ఈక్షే । తత్ । వనన్తి । మా ।

త్విషి౽మాన్ । అస్మి । జూతి౽మాన్ ।

అవ । అన్యాన్ । హన్మి । దోధతః ॥ 58 ॥

**అనువాదం :**

మేము మా ప్రదేశాన్ని గూర్చి ప్రవచిస్తూ
మధురంగా ప్రశంసిస్తున్నాము.
ఆ ప్రశంసలు మాకు సహాయకారులుగా ఉన్నవి.
ప్రకాశమానము, తేజోవంతము,
దీప్తివంతము అయిన జ్ఞానం కలవారిని తప్ప
మిగతా వారిని నేను నశింపజేస్తున్నాను. ॥ 58 ॥

మంత్రము :

శన్తివా సురభిః స్యోనా

కీలాలోఘ్నీ పయస్వతీ ।

భూమి రధి బ్రవీతు మే ।

పృథివీ పయసా సహ ॥ 59 ॥

పదము :

శన్తిఽవా । సురభిః । స్యోనా ।

కీలాలఽఊఘ్నీ । పయస్వతీ ।

భూమిః । అధి । బ్రవీతు । మే

పృథివీ । పయసా । సహ ॥ 59 ॥

అనువాదం :

శాంతికారకము, సుగంధయుక్తము, సుఖకరము,
అన్నదాత్రి, జలదాత్రి అయిన మా భూమి జలంతో పాటు
స్థిరమై మా ప్రశంసలను అందుకొను గాక! ॥ 59 ॥

మంత్రము :

యా మన్వైచ్ఛ ద్ధవిషా విశ్వకర్మా-

న్త రర్ణవే రజసి ప్రవిష్టామ్ ।

భుజిష్యం । పాత్రం నిహితం గుహాయ

దావి ర్భోగే అభవ న్మాతృమద్భ్యః ॥ 60 ॥

పదము :

యామ్ । అనుఽఐచ్ఛత్ । హవిషా । విశ్వఽకర్మా ।

అన్తః । అర్ణవే । రజసి । ప్రఽవిష్టామ్ ।

భుజిష్యఽమ్ । పాత్రమ్ । నిఽహితమ్ । గుహా । యత్ ।

ఆవిః । భోగే । అభవత్ । మాతృమత్ఽభ్యః ॥ 60 ॥

**అనువాదం :**

విశ్వకర్మ అంతరిక్షంలో అంతః ప్రవిష్ట
అయిన భూమిని హవిస్సుతో సేవానిర్వహణకై
ఆకాంక్షిస్తున్నాడు.
ఆ గుహానిహితమైన, భాజనయోగ్యమైన
అన్నాదులను ఉపభోగార్థమై
మాతృభూమిపై భక్తి కలిగినవారికి
ఆయన భాగం కల్పిస్తున్నాడు. ॥ 60 ॥

మంత్రము :

**త్వ మస్యావపనీ జనానా-**

**మదితిః కామదుఘా పప్రథానా ।**

**యత్ త ఊనం తత్ త ఆ పూరయాతి**

**ప్రజాపతిః ప్రథమజా ఋతస్య ॥ 61 ॥**

పదము.

**త్వమ్ । అసి । ఆऽవపనీ । జనానామ్**

**అదితిః । కామऽదుఘా । పప్రథానా ।**

**యత్ । తే । ఊనమ్ । తత్ । తే । ఆ । పూరయాతి ।**

**ప్రజాऽపతిః । ప్రథమऽజాః । ఋతస్య ॥ 61 ॥**

**అనువాదం**

జనులకు నీవు అదితివి ( జనులకు దుఃఖదాత్రివి కావు ).
కామదుఘవు స్థితియోగ్యవు.

బహువిధ ఆహారములకు మూలమైన దానవు.
అన్నిటికంటె అధికమైన ఋతం ఏదైతే ఉన్నదో,
దానిని సృష్టికి ముందు జనించినవారు,
తరువాత జనించినవారు పరిపూర్ణం చేస్తున్నారు. ॥ 61 ॥

మంత్రము :

ఉపస్థా స్తే అనమీవా అయక్ష్మా
అస్మభ్యం సన్తు పృథివి ప్రసూతాః ।
దీర్ఘం న ఆయుః ప్రతిబుధ్యమానా
వయం తుభ్యం బలిహృతః స్యామ ॥ 62 ॥

పదము :

ఉపఽస్థాః । తే । అనమీవాః । అయక్ష్మాః ।
అస్మభ్యమ్ । సన్తు । పృథివి । ప్రఽసూతాః ।
దీర్ఘమ్ । నః । ఆయుః । ప్రతిఽబుధ్యమానాః ।
వయమ్ । తుభ్యమ్ । బలిఽహృతః । స్యామ ॥ 62 ॥

అనువాదం :

ఓ పృథివీ ! నీ వల్ల ఉత్పన్నులైన
రోగరహితులు, క్షయరోగరహితులు
మా వద్ద ఉందురు గాక !
మా ఆయుస్సు దీర్ఘతరమగు గాక !
మేము విజ్ఞాన యుక్తులమై
నీకై బలిని సమకూర్తుము గాక ! 62 ॥

**మంత్రము :**

భూమే మాత ర్ని ధేహి మా

భద్రయా సుప్రతిష్ఠితమ్ ।

సంవిదానా దివా కవే

శ్రియాం మా ధేహి భూత్యామ్ ॥ 63 ॥

**పదము :**

భూమే । మాతః । ని । ధేహి । మా ।

భద్రయా । సుఽప్రతిష్ఠితమ్ ।

సమ్ఽవిదానా । దివా । కవే ।

శ్రియామ్ । మా । ధేహి । భూత్యామ్ ॥ 63 ॥

**అనువాదం:**

భూమాతా! భద్రమూర్తివైన నిన్ను,
సుస్థిరమైన నిన్ను, మాకు స్థిరత్వాన్ని ప్రసాదించమని,
ప్రతిదినమూ మాకు అనేకవిషయాలను
తెలియజేయమని కోరుతున్నాము.
ఓ క్రాంతదర్శినీ! భూమిపై సంపదను
మాకు లభింపజేతువు గాక! ॥ 63 ॥

ఇది మొదటి సూక్తం.

ఇది మొదటి అనువాకం.

# అనువాకం: 2

## సూక్తం - 2

ఋషి: భృగువు ॥ దేవతలు: అగ్ని; మరియు మంత్రములలో పేర్కొన్నవారు; 21-33 మృత్యువు ॥ ఛందస్సు: 1,4,10,11,21-33,53 త్రిష్టుప్; 2,5, 12-15,17,19,20,34-36,38,39,41,43,51,54 అనుష్టుప్; 3 ఆస్తార పంక్తి; 6 భురిగార్షీ పంక్తి; 7,45 జగతీ; 8,48,49 భురిక్ త్రిష్టుప్; 9 అనుష్టుబ్గర్భా విపరీత పాదాలక్ష్మా పంక్తి; 16 కకుమ్మతీ పరాబృహత్యనుష్టుప్; 18 నిచృదనుష్టుప్; 37 పురస్తాద్ బృహతీ; 40 పురస్తాద్ కకుమ్మత్యనుష్టుప్; 42 త్రిపదా భురిగార్చీ గాయత్రీ; 44 ద్విపదాఒఒర్చీ బృహతీ; 46 ద్విపదా సామ్నీ త్రిష్టుప్; (42,44,46 ఏకావసానా); 47 పంచపదా బార్హత వైరాజగర్భా జగతీ; 50 ఉపరిష్టాద్ విరాడ్ బృహతీ; 52 పురస్తాద్ విరాడ్ బృహతీ; 55 బృహతీ గర్భాత్రిష్టుప్ ॥ మంత్రములు: ॥ 55 ॥

వినియోగం:- 'క్రవ్యాద్' అను పేరుగల అగ్నిని గూర్చినదీ సూక్తం. అగ్నులు మూడు. ఆమాద, క్రవ్యాద, హవ్యవాహులు. అపక్వాన్నాన్ని తినువాడు లౌకికాగ్ని. క్రవ్యాదాగ్ని అనగా ఘోర రూపుడైన చితాగ్ని. పక్వాన్నాన్ని ఆహుతిచేయగా తినువాడు, దేవతలకై దానిని కొనిపోవువాడు హవ్యహాహుడు. మొదటి ఇద్దరూ యాగానికి యోగ్యులు కారు. క్రవ్యాదాగ్నిని గూర్చి ఈ సూక్తం చెప్తున్నది.

ఈ చితాగ్ని శవమాంసాన్ని తినడమే గాక, ఘోరత్వం వల్ల యక్ష్మాది బహురోగములను, మృత్యువును తనలో నింపుకుని ఉంటాడు. అందువల్ల అనేక విపత్తులకు మూలమౌతాడు. ఆయా ఆపదలను, ఆ యా రోగములను, ఆ యా మృత్యువును ఈ సూక్తకర్త ప్రార్థనతో పరిహరిస్తున్నాడు.

అంతేగాక ఘోరరూపి అయిన ఈ క్రవ్యాదాగ్నిని శత్రువులను చంపవలసినదని కూడా ప్రార్థిస్తున్నాడు, సర్వపాపములను ఈ అగ్ని హరింపవలెనని అతని ఆశంస.

అలాగే క్రవ్యాదనాశానికై గార్హపత్యాగ్నినుద్దేశించి ప్రార్థన.
క్రవ్యాదాగ్ని ఉపాసకులు నాశం చెందుతారని ఈ సూక్తం చెప్తుంది.

సాంప్రదాయికులు క్రవ్యాచ్ఛమనార్థం దీనిని వినియోగిస్తారు. అందుకై ఒక కర్మను నివ్వర్తిస్తారు. ఆ కర్మవివరణం కౌశిక సూత్రాలలో, నవమాధ్యాయంలో, చతుర్థకాండలో ప్రపంచిత మైనది.

మంత్రము;

నడ మా రోహ న తే అత్ర లోక

ఇదం సీసం భాగధేయం త ఏహి ।

యో గోషు యక్ష్మః పురుషేషు యక్ష్మ-

స్తేన త్వం సాక మధరాఙ్ పరేహి ॥ 1 ॥

పదము .

నడమ్ । ఆ । రోహ । న । తే । అత్ర । లోకః ।

ఇదమ్ । సీసమ్ । భాగఽధేయమ్ । తే । ఆ । ఇహి ।

యః । గోషు । యక్ష్మః । పురుషేషు । యక్ష్మః ।

తేన । త్వమ్ । సాకమ్ । అధరాఙ్ । పరా । ఇహి ॥ 1 ॥

అనువాదం :

నీవు తుంగ మీాదికి ఎక్కిపో.
నీకీ లోకంలో స్థానం లేదు.

ఈ సీసం నీ భాగ్యం
నీవిక్కడకు రా
ఈ గోవులలో క్షయరోగం ఉన్నది
ఈ పురుషులలో క్షయరోగం ఉన్నది
ఈ రోగంతో పాటు నీవు అవాఙ్ముఖంగా వెళ్ళు ॥ 1 ॥

మంత్రము :

అఘశంసదుఃశంసాభ్యాం
కరేణానుకరేణ చ ।
యక్ష్మం చ సర్వం తేనేతో
మృత్యుం చ నిరజామసి ॥ 2 ॥

పదము :

అఘశంసఽదుఃశంసాభ్యామ్ ।
కరేణ । అనుఽకరేణ । చ ।
యక్ష్మమ్ । చ । సర్వమ్ । తేన । ఇతః ।
మృత్యుమ్ । చ । నిః । అజామసి ॥ 2 ॥

అనువాదం :

పాపి, దుష్టము అయిన దానితో పాటు నిన్ను,
కరణానుకరణలతో
సర్వయక్ష్మరోగములను, తుదకు మృత్యువును
ఇక్కడ నుంచి దూరంగా తరిమివేస్తున్నాము. ॥ 2 ॥

మంత్రము:

నిరితో మృత్యుం నిర్ఋతిం

నిరరాతి మజామసి ।

యో నో ద్వేష్టి తమ ద్ధ్యగ్నే

అక్రవ్యాద్ యము ద్విష్మ-

స్తము తే ప్ర సువామసి ॥ 3 ॥

పదము.

నిః । ఇతః । మృత్యుమ్ । నిఃఒఋతిమ్ ।

నిః । అరాతిమ్ । అజామసి ।

యః । నః । ద్వేష్టి । తమ్ । అద్ధి । అగ్నే ।

అక్రవ్యఒఅత్ । యమ్ । ఓం ఇతి । ద్విష్మః ।

తమ్ । ఓం ఇతి । తే । ప్ర । సువామసి ॥ 3 ।

అనువాదం:

ఇక్కడనుంచి మృత్యువును,
దుఃఖమును, శత్రువును
దూరీకరిస్తున్నది. ఓ అగ్నీ ! మమ్ముల నెవడు
ద్వేషిస్తున్నాడో, అతనిని నాశం చెయ్యి.
మేమెవరిని ద్వేషిస్తున్నామో,
వానిని కూడా నీ వద్దకు పంపుతున్నాము. ॥ 3

మంత్రము :

యద్యగ్నిః క్రవ్యాద్ యది వా వ్యాఘ్ర

ఇమం గోష్ఠం ప్రవివేశాన్యోకాః ।

తం మాషాజ్యం కృత్వా ప్ర హిణోమి

దూరం స గచ్ఛ త్వప్సుషదో ప్యగ్నీన్ ॥ 4 ॥

పదము

యది । అగ్నిః । క్రవ్యఽఅత్ । యది । వా । వ్యాఘ్రః ।

ఇయమ్ । గోఽస్థమ్ । ప్రఽవివేశ । అనిఽఓకాః ।

తమ్ । మాషఽఆజ్యమ్ । కృత్వా । ప్ర । హిణోమి ।

దూరమ్ । సః । గచ్ఛతు । అప్సుఽసదః । అపి । అగ్నీన్ ॥ 4 ॥

అనువాదం

మాంసాశని అయిన అగ్ని,
ప్రాణిహింసకమైన వ్యాఘ్రం
నీ గోష్ఠంలో ప్రవేశించినది
దానిని మాషాజ్యముచేసి దూరంగా పంపివేస్తున్నాము
ఈ జలంలో ఉన్న అగ్నిలో ఇది చేరుగాక! ॥ 4 ॥

మంత్రము :

యత్ త్వా క్రుద్ధాః ప్రచక్రు-

ర్మన్యునా పురుషే మృతే ।

సుకల్ప మగ్నే తత్ త్వయా
పున స్త్వోద్దీపయామసి ॥ ౫ ॥

పదము

యత్ । త్వా । క్రుద్ధాః । ప్రఽచక్రుః ।
మన్యునా । పురుషే । మృతే ।
సుఽకల్పమ్ । అగ్నే । తత్ । త్వయా ।
పునః । త్వా । ఉత్ । దీపయామసి ॥ ౫ ॥

అనువాదం

పురుషుడు మృతిచెందగా క్రుద్ధులై,
క్రోధంతో నీకు అన్యాయం చేస్తున్నారు.
ఓ అగ్ని ! ని ద్వారా ఆ అన్యాయం చక్కబడాలి.
అందువల్ల నిన్ను పునః ప్రజ్వలింప జేస్తున్నారు. ॥ ౫ ।

మంత్రము

పున స్త్వాదిత్యా రుద్రా వసవః
పున ర్బ్రహ్మా వసునీథ రగ్నే ।
పున స్త్వా బ్రహ్మణస్పతి రాధాద్
దీర్ఘాయుత్వాయ శతశారదాయ ॥ ౬ ॥

పదము :

పునః । త్వా । ఆదిత్యాః । రుద్రాః । వసవః ।

పునః । బ్రహ్మా । వసుఽనీతిః । అగ్నే ।

పునః । త్వా । బ్రహ్మణః । పతిః । ఆ । అధాత్ ।

ధీర్ఘాయుఽత్వాయ । శతఽశారదాయ ॥ 6 ॥

అనువాదం:

ఓ అగ్ని ! ఆదిత్యులు, రుద్రులు, వసువులు,
ధనదాతలు, బ్రహ్మ, బ్రహ్మణస్పతి మాకు
దీర్ఘాయువు చేకూర్చాలి
అందుకై నిన్ను పునఃస్థాపితం చేస్తున్నాము ॥ 6 ॥

మంత్రము :

యో అగ్నిః క్రవ్యాత్ ప్రవివేశ నో గృహ-

మిమం పశ్య న్నితరం జాతవేదసమ్ ।

తం హరామి పితృయజ్ఞాయ దూరం

స ఘర్మ మిన్ధాం పరమే సధస్థే ॥ 7 ॥

పదము :

యః । అగ్నిః । క్రవ్యఽఅత్ । ప్రఽవివేశ । నః । గృహమ్ ।

ఇమమ్ । పశ్యన్ । ఇతరమ్ । జాతఽవేదసమ్ ।

తమ్ । హరామి । పితృఽయజ్ఞాయ । దూరమ్ ।

సః । ఘర్మమ్ । ఇన్ధామ్ । పరమే । సధఽస్థే ॥ 7 ॥

అనువాదం.

మాంసభక్షకుడైన అగ్నిని దూరంగా కొనిపోతున్నాము.
దైన్యాన్ని దూరం చేసి యమరాజ్యం వద్దకు వెళ్ళిపోవుగాక!
ఇక్కడ మరొక అగ్ని (జాతవేదుడు) ఉన్నాడు.
మా ఇంటిలో ప్రవేశించినాడు.
అతనిని పితృయజ్ఞార్థం దూరంగా కొనిపోతున్నాము.
అతను పరమధామంలో వేడిని కలిగించు గాక! ॥ 7 ॥

మంత్రము.

క్రవ్యాద మగ్నిం ప్ర హిణోమి దూరం
యమరాజ్ఞో గచ్ఛతు రిప్రవాహః ।
ఇహాయ మితరో జాతవేదా దేవో
దేవేభ్యో హవ్యం వహతు ప్రజానన్ ॥ 8 ॥

పదము.

క్రవ్యఽఅదమ్ । అగ్నిమ్ । ప్ర । హిణోమి । దూరమ్ ।
యమఽరాజ్ఞః । గచ్ఛతు । రిప్రఽవాహః ।
ఇహ । అయమ్ । ఇతరః । జాతఽవేదాః । దేవః ।
దేవేభ్యః । హవ్యమ్ । వహతు । ప్రఽజానన్ ॥ 8 ॥

అథర్వ V 24

అనువాదం :

క్రవ్యాదుడైన అగ్నిని దూరంగా పంపివేస్తున్నాను
దోషాన్ని దూరం చేసి యమరాజువద్దకు వెళ్ళు
ఇక్కడ మరొక జాతవేదాగ్ని ఉన్నాడు
ప్రజ్ఞావంతుడైన దేవుడు దేవతలకోసమై
హవ్యమును కొనిపోవు గాక ! ॥ 8 ॥

మంత్రము :

క్రవ్యాద మగ్ని మిషితో హరామి
జనాన్ దృంహన్తం వజ్రేణ మృత్యుమ్ ।
ని తం శాస్మి గార్హపత్యేన విద్వాన్
పితౄణాం లోకేఽపి భాగో అస్తు ॥ 9 ॥

పదము :

క్రవ్యఽఅదమ్ । అగ్నిమ్ । ఇషితః । హరామి ।
జనాన్ । దృంహన్తమ్ । వజ్రేణ । మృత్యుమ్ ।
ని । తమ్ । శాస్మి । గార్హఽపత్యేన । విద్వాన్ ।
పితౄణామ్ । లోకే । అపి । భాగః । అస్తు ॥ 9 ॥

అనువాదం :

వజ్రప్రహరణం ద్వారా జనులను
మృత్యువు వద్దకు కొనిపోవునట్టి
క్రవ్యాదాగ్నిని ఇచ్ఛాపూర్వకంగా కొనిపోతున్నాను
గార్హపత్యాగ్ని ద్వారా విద్వాంసుడనైన నేను

అజ్ఞాపిస్తున్నాను.
జాతవేదునకు పితృలోకంలో
భాగం అవశ్యం లభించు గాక ! ॥ 9 ॥

మంత్రము.

క్రవ్యాద మగ్నిం శశమాన ముక్థ్యం।
ప్ర హిణోమి పథిభిః పితృయాణైః ।
మా దేవయానైః పునరా గా
అత్రైవైధి పితృషు జాగృహి త్వమ్ ॥ 10 ॥

పదము.

క్రవ్యఽఅదమ్ । అగ్నిమ్ । శశమానమ్ । ఉక్థ్యఽమ్ ।
ప్ర । హిణోమి । పథిఽభిః । పితృఽయానైః ।
మా । దేవఽయానైః । పునః । ఆ । గాః ।
అత్ర । ఏవ । ఏధి । పితృషు । జాగృహి । త్వమ్ ॥ 10 ॥

అనువాదం।

ప్రశంసనీయగతి అయిన, మాంసభక్షకుడైన
అగ్నిని పితృయానం ద్వారా పంపుతున్నాను.
దేవయానం ద్వారా తిరిగి రాకుందువు గాక !
అందుకే అక్కడే ఉండు.
పితరుల విషయమై నీవు జాగ్రత్త వహించు. ॥ 10 ॥

మంత్రము

స మిన్ధతే సంకసుకం స్వస్తయే
శుద్ధా భవన్తః శుచయః పావకాః ।
జహాతి రిప్ర మత్యేన ఏతి
సమిద్ధో అగ్నిః సుపునా పునాతి ॥ 11 ॥

పదము

సమ్ । ఇన్ధతే । సమ్ఽకసుకమ్ । స్వస్తయే ।
శుద్ధాః । భవన్తః । శుచయః । పావకాః ।
జహాతి । రిప్రమ్ । అతి । ఏనః । ఏతి ।
సమ్ఽఇద్ధః । అగ్నిః । సుఽపునా । పునాతి ॥ 11 ॥

అనువాదం :

పవిత్రములు, పరిశుద్ధములు అయిన అగ్నులు మీరు
కల్యాణార్థమై అగ్నిని మరింత ప్రదీప్తం చేస్తున్నారు.
దుష్టత్వాన్ని వదలి పాపాన్ని అతిక్రమిస్తున్నారు
ప్రదీప్తమైన అగ్ని సర్వులను పవిత్రం చేస్తున్నాడు ॥ 11 ॥

మంత్రము :

దివో అగ్నిః సంకసుకో
దివ స్పృష్ఠా న్యారుహత్ ।

ముచ్యమానో నిరేణసో౽-
మోగస్మాం అశస్త్యాః ॥ 12 ॥

పదము.

దేవః । అగ్నిః । సమ్౽కసుకః ।
దివః । పృష్ఠాని । ఆ । అరుహత్ ।
ముచ్యమానః । నిః । ఏనసః ।
అమోక్ । అస్మాన్ । అశస్త్యాః ॥ 12 ॥

అనువాదం.

విదాహకుడైన అగ్ని దేవుడు ద్యులోకానికి
పైభాగాన్ని ఆరోహించి ఉన్నాడు.
మమ్ములను పాపం నుంచి విముక్తులను చేసి
చెడుదారుల నుంచి తప్పిస్తున్నాడు. ॥ 12 ॥

మంత్రము:

అస్మిన్ వయం సంకసుకే
అగ్నౌ రిప్రాణి మృజ్మహే ।
అభూమ యజ్ఞియాః శుద్ధాః
ప్ర ణ ఆయూంషి తారిషత్ ॥ 13 ॥

పదము :

అస్మిన్ । వయమ్ । సమ్ఽకసుకే ।

అగ్నౌ । రిప్రాణి । మృజ్మహే ।

అభూమ । యజ్ఞియాః । శుద్ధాః ।

ప్ర । నః । ఆయూంషి । తారిషత్ ॥ 13 ॥

అనువాదం

ఈ దహించే అగ్నిలో మా దోషములన్నీ
పరిశుద్ధములై పోతున్నవి
మేము పవిత్రులము, పరిశుద్ధులము అవుతున్నాము
మా ఆయుస్సు పెరుగుతున్నది ॥ 13 ॥

మంత్రము :

సంకసుకో వికసుకో

నిర్ ఋథో యశ్చ నిస్వరః ।

తే తే యక్ష్మం సవేదసో

దూరాద్ దూర మనీనశన్ ॥ 14 ॥

పదము :

సమ్ఽకసుకః । విఽకసుకః ।

నిఃఽఋథః । యః । చ । నిఽస్వరః ।

తే । తే । యక్ష్మమ్ । సఽవేదనః ।
దూరాత్ । దూరమ్ । అనీనశన్ ॥ 14 ॥

అనువాదం.

సంఘాతకుడు, విఘాతకుడు,
వినాశకుడు, స్వరరహితుడు అయిన అగ్ని
నీ యక్ష్మను నీ నుంచి దూరంగా కొనిపోతున్నాడు.
అలా కొనిపోయి దానిని నాశం చేస్తాడు. ॥ 14 ॥

మంత్రము।

యో నో అశ్వేషు వీరేషు
యో నో గో ష్వజావిషు ।
క్రవ్యాదం ని ర్ణుదామసి
యో అగ్ని ర్జనయోపనః ॥ 15 ॥

పదము.

యః । నః । అశ్వేషు । వీరేషు ।
యః । నః । గోషు । అజఽఅవిషు ।
క్రవ్యఽఅదమ్ । నిః । నుదామసి ।
యః । అగ్నిః । జనఽయోపనః ॥ 15 ॥

**అనువాదం :**

మా అశ్వములలో, మా పిల్లలలో,
మా గోవులలో, మేకలు - గొర్రెలలో
లోకులను కష్టపరచే ఏ అగ్ని ఉన్నదో
మాంసభక్షకమైన ఆ అగ్నిని
మేము దూరం చేస్తున్నాము ॥ 15 ॥

**మంత్రము :**

అన్యేభ్య స్త్వా పురుషేభ్యో
గోభ్యో అశ్వేభ్య స్త్వా ।
నిః క్రవ్యాదం నుదామసి
యో అగ్ని ర్జీవితయోపనః ॥ 16 ॥

**పదము :**

అన్యేభ్యః । త్వా । పురుషేభ్యః ।
గోభ్యః । అశ్వేభ్యః । త్వా ।
నిః । క్రవ్యఽఅదమ్ । నుదామసి ।
యః । అగ్నిః । జీవితఽయోపనః ॥ 16 ॥

**అనువాదం**

జీవనాశకమైన క్రవ్యాదాగ్ని ఏదైతే ఉన్నదో
దానిని అన్యులనుంచి, పురుషులనుంచి,

గోవులనుంచి, అశ్వములనుంచి
నిశ్శేషంగా దూరీకరిస్తున్నాము. ॥ 16 ॥

మంత్రము

యస్మిన్ దేవా అమృజత
యస్మిన్ మనుష్యా౨ఉత ।
తస్మిన్ ఘృతస్తావో మృష్ట్వా
త్వ మగ్నే దివం రుహ ॥ 17 ॥

పదము

యస్మిన్ । దేవాః । అమృజత ।
యస్మిన్ । మనుష్యా౨ః । ఉత ।
తస్మిన్ । ఘృత౨స్తావః । మృష్ట్వా ।
ఆ । త్వమ్ । అగ్నే । దివమ్ । రుహ ॥ 17 ॥

అనువాదం ।

ఎందులో దేవతలు పరిశుద్ధులౌతున్నారో,
ఎందులో మనుష్యులు పరిశుద్ధులౌతున్నారో,
అందులో ఓ అగ్ని ఘృతాన్ని ఆహుతి చేసి,
పరిశుద్ధుడనౌతున్న నన్ను
ద్యులోకాన్ని ఆరోహింప జెయ్యి. ॥ 17 ॥

మంత్రము

సమిద్ధో అగ్న ఆహుత

స నో మాభ్యపక్రమీః ।

అత్రైవ దీదిహి ద్యవి

జ్యోక్ చ సూర్యం దృశే ॥ 18 ॥

పదము ।

సమ్ఽఇద్ధః । అగ్నే । ఆహుత ।

సః । నః । మా । అభిఽఅపక్రమీః ।

అత్ర । ఏవ । దీదిహి । ద్యవి ।

జ్యోక్ । చ । సూర్యమ్ । దృశే ॥ 18 ॥

అనువాదం

ఆహుతి తీసుకున్న అగ్నీ!
ప్రదీపించి మమ్ములను అతిక్రమించకు
ఈ ద్యులోకస్థానంలోనే ప్రకాశిస్తూ ఉండు
సూర్యుని ఎల్లవేళలా దర్శిస్తూ ఉండు ॥ 18 ॥

మంత్రము

సీసే మృడ్ఢ్వం నడే మృడ్ఢ్వ-

మగ్నౌ సంకసుకే చ యత్ ।

అథో అవ్యాం రామాయాం

శీర్షక్తి ముపబర్హణే ॥ 19 ॥

పదము.

సీసే । మృడ్ఢ్వమ్ । నడే । మృడ్ఢ్వమ్ ।

అగ్నౌ । సమ్ఽకసుకే । చ । యత్ ।

అథో ఇతి । అవ్యామ్ । రామాయామ్ ।

శీర్షక్తిమ్ । ఉపఽబర్హణే ॥ 19 ॥

అనువాదం.

దేనిని సీసంతో సంబంధింపజేసినామో,
దేనిని తుంగలో ఆవహింపజేసినామో,
దేనిని వినాశకమైన అగ్నిలో తపింపజేసినామో,
మేకలలో - నల్లనివానిలో, రంగులుగలవానిలో
తలపై ఉన్న మాలిన్యాన్ని కడిగివేయాలి ॥ 19 ॥

మంత్రము.

సీసే మలం సాదయిత్వా

శీర్షక్తి ముపబర్హణే ।

అవ్యా మసిక్న్యాం మృష్ట్వా

శుద్ధా భవత యజ్ఞియాః ॥ 20 ॥

పదము

సీసే । మలమ్ । సాదయిత్వా ।

శీర్షక్తిమ్ । ఉపఽబర్హణే ।

అవ్యామ్ । అసిక్న్యామ్ । మృష్ట్వా ।

శుద్ధాః । భవత । యజ్ఞియాః ॥ 20 ॥

అనువాదం :

సీసంలోని మలినాన్ని పరిశుద్ధం చేసి,
ఇతర మాలిన్యాలను తొలగించి,
నల్లని గొర్రెలపైనున్న మలినాన్ని తొలగించి,
యజ్ఞమునకు అర్హమగు రీతిలో
పవిత్రులమగుదుము గాక ! ॥ 20 ॥

మంత్రము :

పరం మృత్యో అను పరేహి పన్థాం
యస్తే ఏష ఇతరో దేవయానాత్ ।
చక్షుష్మతే శృణ్వతే తే బ్రవీ-
మీహేమే వీరా బహవో భవన్తు ॥ 21 ॥

పదము :

పరమ్ । మృత్యో ఇతి । అను । పరా । ఇహి । పన్థామ్ ।

యః । తే । ఏషః । ఇతరః । దేవఽయానాత్ ।

చక్షుష్మతే । శృణ్వతే । తే । బ్రవీమి ।

ఇహ । ఇమే । వీరాః । బహవః । భవన్తు ॥ 21 ॥

అనువాదం

ఓ మృత్యూ! దేవయానానికి భిన్నమైన
నీ మార్గం ఏదైతే ఉన్నదో,
ఆ మార్గానికి దూరంగా వెళ్ళిపో.
చెవులు, కనులు ఉన్న నిన్ను అర్థిస్తున్నాను,
మా వీరులు అనేకులగుదురు గాక! ॥ 21 ॥

మంత్రము

ఇమే జీవా వి మృతై రా వవృత్ర-
న్నభూద్ భద్రా దేవహూతి ర్నో అద్య ।
ప్రాఞ్చో అగామ నృతయే హసాయ
సువీరాసో విదథ మా వదేమ ॥ 22 ॥

పదము,

ఇమే । జీవాః । వి । మృతైః । ఆ । అవవృత్రన్ ।
అభూత్ । భద్రా । దేవఽహూతిః । నః । అద్య ।
ప్రాఞ్చః । అగామ । నృతయే । హసాయ ।
సుఽవీరాసః । విదథమ్ । ఆ । వదేమ ॥ 22 ॥

అనువాదం

ఈ జీవులు మృతులలో నుంచి వేరుపడినారు
మా ప్రార్థన నేడు కల్యాణప్రదమైనది
మేము నవ్వుతూ, గంతులేస్తూ
నాట్యం చేయడం వైపు వెడుతున్నాము
ఉత్తమ వీరులమై యుద్ధవిచారంలో
నిమగ్నులమగుదుము గాక! ॥ 22 ॥

మంత్రము :

ఇమం జీవేభ్యః పరిధిం దధామి
మైషాం ను గా దపరో అర్థ మేతమ్ ।
శతం జీవన్తః శరదః పురూచీ-
స్తిరో మృత్యుం దధతాం పర్వతేన ॥ 23 ॥

పదము

ఇమమ్ । జీవేభ్యః । పరిऽధిమ్ । దధామి ।
మా । ఏషామ్ । ను । గాత్ । అపరః । అర్థమ్ । ఏతమ్ ।
శతమ్ । జీవన్తః । శరదః । పురూచీః ।
తిరః । మృత్యుమ్ । దధతామ్ । పర్వతేన ॥ 23 ॥

అనువాదం :

జీవులకోసమై నేనొక పరిధిని కల్పిస్తున్నాను
వీరిలో ఎవరూ ఒక్కసారి కూడా
ఈ పరిధిని దాటకుందురు గాక!

నూరేళ్ళకు పైగా జీవిస్తూ, జీవితాన్ని అనుభవిస్తూ,
పర్వతం మూలంగా మృత్యువును ఇటు రాకుండా
అడ్డగింతురు గాక! ॥ 23 ॥

మంత్రము:

ఆ రోహ తాయు ర్జరసం వృణానా
అనుపూర్వం యతమానా యతి స్థ ।
తాన్ వ స్త్వష్టా సుజనిమా సజోషాః
సర్వ మాయు ర్నయతు జీవనాయ ॥ 24 ॥

పదము.

ఆ । రోహత । ఆయుః । జరసమ్ । వృణానాః ।
అను౽పూర్వమ్ । యతమానాః । యతి । స్థ ।
తాన్ । వః । త్వష్టా । సు౽జనిమా । స౽జోషాః ।
సర్వమ్ । ఆయుః । నయతు । జీవనాయ ॥ 24 ॥

అనువాదం:

మేము వృద్ధులమై దీర్ఘాయుష్షుతో మనుదుము గాక!
సిద్ధి లభించే వరకూ మేము ప్రయత్నం చేస్తూనే ఉంటాము,
ఉత్తమజన్ముడు, ఉత్సాహవంతుడు
అయిన త్వష్ట మా అందరిని
దీర్ఘాయువు కోసమై నడిపించును గాక! ॥ 24 ॥

మంత్రము :

యథాహా న్యనుపూర్వం భవన్తి

యథ ర్తవ ఋతుభి ర్యన్తి సాకమ్ ।

యథా న పూర్వ మపరో జహా

త్యేవా ధాత రాయూంషి కల్పయైషామ్ ॥ 25 ॥

పదము

యథా । అహాని । అను౨పూర్వమ్ । భవన్తి ।

యథా । ఋతవః । ఋతు౨భిః । యన్తి । సాకమ్ ।

యథా । న । పూర్వమ్ । అపరః । జహాతి । ఏవ ।

ధాతః । ఆయూంషి । కల్పయ । ఏషామ్ ॥ 25 ॥

అనువాదం :

ఒకదాని వెనుక ఒకటిగా రోజులు వస్తూంటాయి
అలాగే ఋతువులు ఒకదాని వెంట ఒకటి వస్తూంటాయి
ముందు ఉన్న దానిని రెండవది వదలిపెట్టదు
ఓ ధాతా! వీరి ఆయుస్సును కూడా
అలాగే కల్పించు ॥ 25 ॥

మంత్రము :

అశ్మన్వతీ రీయతే సం రభధ్వం

వీరయధ్వం ప్ర తరతా సఖాయః ।

అత్రా జహీత యే అసన్ దురేవా

అనమీవా నుత్తరే మాభి వాజాన్ ॥ 26 ॥

పదము:

అశ్మన్ఽవతీ । రీయతే । సమ్ । రభధ్వమ్ ।

వీరయధ్వమ్ । ప్ర । తరత । సఖాయః ।

అత్ర । జహీత । యే । అసన్ । దుఃఽఏవాః ।

అనమీవాన్ । ఉత । తరేమ । అభి । వాజాన్ ॥ 26 ॥

అనువాదం.

అశ్మన్వతి (నది) అతివేగంగా ప్రవహిస్తున్నది.
దాని కెదురుగా మనం ఏకమై నిలబడదాం.
మిత్రులారా! పరాక్రమించి నేస్తులందరూ
ఒకటిగా నిలబడండి
దుఃఖదాయకమైన వానిని ఇక్కడనుంచి తరిమివేద్దాం.
మనం దీనిని దాటినట్లయితే
ఆరోగ్యవంతమైన ఆహారాన్ని సంపాదించుకొనగలం. ॥ 26 ॥

మంత్రము:

ఉత్తిష్ఠతా ప్ర తరతా సఖాయోఽ-

శ్మన్వతీ నదీ స్యన్దత ఇయమ్ ।

అత్రా జహీత యే అసన్నశివాః

శివా న్త్స్యోనా నుత్తరే మాభి వాజాన్ ॥ 27 ॥

అథర్వ. v 25

